# బానీ మిక్స్®

## తక్షణం తయారయ్యే పోరిడ్జ్
## చిరుధాన్యములు, పళ్లు మరియు జీడిపప్పులోని మంచి గుణములతో నిండినది.

బానీ మిక్స్ మంచి పోషణ శక్తితో కూడిన పోరిడ్జ్ కుటుంబంలో అందరికీ శ్రేష్ఠమైనది. ఫలహారంగా లేదా ఆఫీసు, బడి నుంచి తిరిగి వచ్చాక సాయంత్రం పూట తినడానికి అనుకూలమైనది.




**నిమిషాల్లో తయారు!**
బానీ మిక్స్‌ను సులభంగా, త్వరగా తయారు చేయవచ్చు.



ఒక చిన్న గిన్నెలో కావలసినంత బానీ మిక్స్‌ను వేయండి.



ముందుగా కాచివుంచిన పాలను తగినంతగా తీసుకొని, నెమ్మదిగా దానితో పాటు కలపండి.



మృదువైన జావ తయారయ్యేలా మెత్తగా కలపండి.



ప్రతి చెంచాలో మీ కుటుంబానికి రుచికరమైన ఆనందం!

## బానీ మిక్స్®
భారతదేశంలో మొట్టమొదటి సారిగా!



గ్లాక్సో నుండి వస్తుంది మంచి ఆరోగ్యం.



GL/2/88-R-TEL

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

* కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

నవంబర్ చతుర నవల 'మండుతున్న మేధస్సు'

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లానువేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# చేతులు కత్తెరలు

**నలహా**

"**అక్క**గారూ!"

"ఎవరూ? ఓ...నువ్వా కమలా! రా!కూర్చో" అంటూ పలకరించి, ప్రక్కనే ఉన్న సోఫా చూపించింది కామాక్షి.

కమల సోఫాలో దిగాలుగా కూర్చుంది.

"అలా దిగాలుగా ఉన్నావేం కమలా?"

"ఏంచేయమంటావ్ అక్కా! మా ఆయనను బాగుచేయాలంటే నావల్ల కావడంలేదు" ఏడుపు మొహం పెట్టింది కమల.

"అదేమిటి కమలా! మీ ఆయనకు త్రాగుడు, జూదం, వ్యభిచారం మొదలైన దురలవాట్లేమీలేవుకదా! మరి ఆయనను బాగుచేయడమేమిటి?" అంది కామాక్షి.

"నిజమే! ఆయనకు అలాంటివేమీలేవు. అయితే ఈమధ్య ఎక్కడ నేర్చుకున్నారోగానీ చేతిగోళ్ళు కొరకడం బాగా నేర్చుకున్నారు. గోళ్ళను కొరుకుతూ, అలాగే వేళ్లను కూడా కొరికి పారేస్తున్నారు. నిన్న డాక్టర్ దగ్గరకు తీస్కెళ్ళి చేతివేళ్ళకు కట్లు కట్టించాను కూడా" అంది కమల బాధగా.



కామాక్షి నవ్వింది "ఓస్! ఇంతేనా! మా ఆయన పరిస్థితి ఇంకా అధ్వాన్నంగా ఉంది, చూడు" అంటూ కిటికీ తెరిచింది.

కమల కిటికీలోంచి ప్రక్కగదిలోకి తొంగిచూసింది. లోపల కామాక్షి భర్త గోపాలం కాలికి కట్టిన గుడ్డను పీకేసి మెల్లగా కాలిని పైకి లాక్కొని కాలిగోళ్ళను కసకస...మంటూ కొరక

కవర్ పేజ్ ఫోటోగ్రాఫర్: వికీహండా

సాగాడు.

అది చూసిన కమల కెవ్వున కేకపెట్టింది. "అక్కా! మా ఆయనను బాగుచేయడానికి నీ దగ్గరేమైనా సలహా ఉందేమోనని వచ్చాను గానీ, నా పని రోలు వెళ్ళి రోకలికి మొరపెట్టు కున్నట్లుందే" అని వాపోయింది.

"ఈ మగాళ్ళకు బుద్ధి ఎప్పుడు వస్తుందో?" సాలోచనగా అంది కామాక్షి.

"ఏమిటిక్కడ అక్కాచెల్లెళ్ళు మీటింగుపెట్టారు" అంటూ వచ్చింది ప్రక్క ఇంట్లో ఉండే మహిళామండలి అధ్యక్షురాలు తనూజ.

కామాక్షి, కమల ఇద్దరూ కలసి తమ గోడు విన్నవించుకున్నారు.

అంతా విన్న తనూజ పెద్దగా నవ్వింది. "పిచ్చిమొద్దుల్లారా! మీ మొగుళ్ళకీ పరిస్థితి వచ్చేవరకు ఆగడం మీ బుద్ధి తక్కువ. ఎప్పుడో డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళక ఇప్పటివరకు ఎందుకు ఆగారు. మా ఆయనకు కాలిగోళ్ళు, చేతిగోళ్ళు కూడా కొరుక్కునే అలవాటుంది. నేను తక్షణం ఆయన్ను డాక్టరుదగ్గరకు తీస్కెళ్ళి బాగుచేయించాను. ఇప్పుడాయన గోళ్ళు కొరకమని బ్రతిమాలినా కొరకరు"

తనూజ మాటలు విన్న ఆ ఇద్దరూ ఆశ్చర్యపోయారు. "మేమూ మా మొగుళ్ళని డాక్టర్ దగ్గరకు తీస్కెళ్ళాం. కాని ఆ అలవాటు మానలేదే?"

"డాక్టర్ దగ్గరకు తీస్కెళ్ళారా? బహుశా యం.బి.బి.ఎస్ డాక్టర్ దగ్గరకు తీస్కెళ్ళి ఉంటారు" అంది తనూజ.

అవునన్నారిద్దరూ.

"అక్కడికికాదు తీస్కెళ్ళాల్సింది. డెంటిస్ట్ దగ్గరకి. అక్కడకి తీస్కెళ్ళి పళ్ళు ఊడబెరికిస్తే ఇక జన్మలో గోళ్ళు కొరకరు. మా ఆయనకు ఆ పనే చేయించాను" నగర్వంగా చెప్పింది తనూజ.

## ఆకర్షణ

గోపాలం కోతలు కోయడంలో ఘనుడు అయినా ఎన్నోసార్లు వాడి కోతలను నమ్మేశాను. ఆ తరువాత నిజం తెలిసి అదేమిట్రా అని వాడినడిగితే పెద్దగా నవ్వేసేవాడు.

ఎలాగైనా సరే గోపాలం చిన్నబుచ్చుకునే పరిస్థితి ఎదురుకావాలనీ, వాడి దురలవాటు అంతటితో ఆగిపోవాలనీ కోరుకునేవాడిని నేను.

ఒకసారి మేమిద్దరం పార్కుకని వాడి స్కూటర్ మీద బయలుదేరాము.

"రేయ్ రాజూ...నిన్న ఒకమ్మాయి నన్ను



చూసి కన్నుగొట్టి దగ్గరకు రమ్మంది. మొదట నాకు జంకువేసింది. తరువాత సర్దుకుని దగ్గరకు వెళ్ళాను. అంతే! ఆ అమ్మాయి మాట్లాడకుండా ఓ మాంఛి ముద్దు ఇచ్చి పంపింది'' తన్మయత్వంతో చెబుతున్నాడు.

నాకు ఒళ్ళు మండింది. ''రేయ్ గోపాలం... నువ్వు కోతలు కోయడం ఆపకపోతే నేదిగి ఇంటికెళ్ళిపోతాను'' అన్నాను.

''నావి కోతలా'' అని అయోమయంగా మొహం పెట్టాడు ''నువ్వు శుద్ధ అమాయకుడివి. నీకు అమ్మాయిల గురించి బొత్తిగా తెలియదు. మన పర్సనాలిటీ ఏంటంట? మనలను చూస్తే ఏ అమ్మాయయినా సరే ఒక్కసారి తిరిగి చూసి మరీ వెళుతుంది సుమా'' అన్నాడు.

''నీ బట్టతల అమ్మాయిలకు ముచ్చట గొలుపుతోందేమోలేరా?'' అన్నాన్నేను అసలు విషయం బయటపెడుతూ.

అందుకు వాడు సీటుమీదే అంతెత్తు ఎగిరి పడ్డాడు. ''రాజూ... నా బట్టతల గురించి ఏమన్నా నేనొప్పుకోను. నామాటలు నీవు నమ్మడంలేదుకదూ, సరే...ఎప్పటికైనా నాకోసం పడిచచ్చే అమ్మాయిల్ని నీకు చూపిస్తాను - సరేనా'' అన్నాడు.

ఇంతలో కొద్దిదూరంలో ఒకమ్మాయి మావాడిని స్కూటర్ ఆపమన్నట్టు చేయి ఊపుతూ కనిపించింది. ఆ అమ్మాయి బాగుంది. సన్నటి నడుము, తెల్లటి బుగ్గలు, సంపెంగ ముక్కు, పలుచటి చీరకట్టి, అంతకన్నా పలుచని జాకెట్టు తొడిగి ఉంది.

''అరేయ్ రాజూ... చెబితే విన్నావా? ఆ అమ్మాయి ఎవరోగానీ బాగుందిగదూ. లిఫ్ట్ కోసంగామోను. సరే... నావెనుక కూర్చోబెట్టుకుంటానుగానీ నువ్వు దిగిపో'' అన్నాడు గోపాలం.

నాకు కోపం వచ్చింది. కాని నేనేం చేయనూ. దిగనని మొండికేస్తే ఆ అమ్మాయి ముందే స్కూటర్ ఆపి దిగమంటే...నా పరువేంగాను.

ఇంతలో ఆ అమ్మాయి దగ్గరకు వచ్చి ఆగింది స్కూటర్. వెంటనే నేను దిగిపోయి దూరంగా వెళ్లి నిలబడ్డాను. వాడు థాంక్సన్నట్టుగా నావైపు కొంటెగా చూశాడు. నాకు కోపంతో ఒళ్ళు మండిపోతోంది.

ఆ అమ్మాయి గోపాలంతో ''ఎక్స్‌క్యూజ్ మి...'' అంటూ స్కూటర్‌కు ఉండే అద్దాన్ని తనవైపు తిప్పుకుంది.

గోపాలం నవ్వుతూ, గుడ్లప్పగించి అమ్మాయి వైపే చూస్తున్నాడు.

వెంటనే అ అమ్మాయి బ్యాగ్‌లోంచి క్రీం తీసి మొహానికి పూసుకుని, ఆతరువాత పౌడర్ అద్దుకుంది. తరువాత బ్యాగ్‌లోంచి దువ్వెన తీసి తలదువ్వుకుంది. తరువాత లిఫ్‌స్టిక్ తీసి పెదాలకు ఎర్రగా పూసుకుంది.

అబ్బా...ఎంత అందం. గోపాలంగాడి అదృష్టానికి నాలో అసూయ రేగసాగింది.

ఇంతలో ఆ అమ్మాయి మేకప్ పూర్తిచేసుకుని, పైట సర్దుకుని ''ఈరోజు బ్యూటీపార్లర్ మూసివేసి ఉంది. కాలేజీ ఫంక్షన్‌కు వెళ్ళాలి. ఇంటికెళ్ళి రెడీ కావాలంటే చాలాకష్టం. పైగా ఆలస్యంకూడా. మీరు ఇలా సహాయం చేసినందుకు చాలాచాలా థాంక్స్'' అంటూ నడుం ఊపుకుంటూ వెళ్ళిపోయింది.

పాపం... గోపాలం మొహంలో నెత్తుటి బొట్టు లేదు.

## దేవుడి మహిమ

పార్వతమ్మ భక్తిగా ప్రార్థనచేసి కర్పూరం వెలిగించి, భర్త దగ్గరకు తీసుకురాగా రాజశేఖర్ దాన్ని కళ్ళకద్దుకున్నాడు.

''గోపాలం! హారతి తీసుకో—'' అంటూ కొడుకువద్దకు వచ్చింది పార్వతమ్మ.

''హారతా? నాకు నమ్మకంలేదని నీకు తెలుసుగా!'' కసురుకున్నాడు అద్దం ముందు తల దువ్వుకుంటున్న గోపాలం.

''అలా అనకురా! దేవుడు వింటే కోప్పడతాడు. నాకోసమైనా..'' చెప్పబోతోంది పార్వతమ్మ.

''నేనద్దుకోనుగానీ, సరే, మీదేవుడు ఏంచేస్తాడో చూద్దాం'' అంటూ గప్పున ఊది కర్పూరాన్ని ఆర్పేశాడు.

ఆ సమయంలో తల్లిదండ్రులకు సుపుత్రుడిమీద వచ్చిన కోపం అంతా ఇంతాకాదు.

★ ★ ★

''ఏవండీ! కూరగాయలు తీసుకురండి''




అంటూ నంచి రాజశేఖర్‌కిచ్చింది పార్వతమ్మ.

"అబ్బాయి ఎక్కడకి వెళ్ళాడేంటి?" అడిగాడు రాజశేఖరం ఆఫీను ఫైలు ప్రక్కన పెడుతూ.

"ఏమో! చీకటితోనే వెళ్ళాడు" చెప్పింది పార్వతమ్మ.

రాజశేఖర్ నంచి తీనుకుని మార్కెట్టుకు వెళ్ళాడు. కూరగాయలు తీనుకుని వస్తుంటే దారిలో గుడి కనిపించి లోపలికి వెళ్ళి నమస్కరించి తిరిగివస్తూ చూశాడు.

ఆ వెనుక, కొద్దిదూరంలో అరుగుమీద గోపాలం కళ్ళు మూసుకుని బాసింపట్టు వేసుకుని ధ్యానిస్తున్నాడు.

రాజశేఖర్ నమ్మలేకపోయాడు. ఇది కలా...నిజమా...గిల్లి చూసుకున్నాడు. నిజమే...

అయినా నమ్మలేకపోతున్నాడు.

కళ్ళజోడు తుడుచుకుని మరీ పరిశీలించాడు. నందేహంలేదు గోపాలమే...

★ ★ ★

"గోపాలం!" తండ్రి పిలిచాడు.

"ఏమిటి?" అన్నట్టుగా తలెత్తిచూశాడు గోపాలం.

"హారతి అందుకో..." పళ్ళేన్ని గోపాలంకు దగ్గరగా చేర్చుతూ అన్నాడు తండ్రి.

"డాడీ! నిన్న మమ్మీకి చెప్పాను. నాకిలాంటివి పడవు. నిన్న చేసిందే ఈరోజు కూడా చేస్తా" అంటూ హారతిని ఆర్పబోయాడు గోపాలం దురుసుగా.

అంతే! రాజశేఖర్ శక్తికొద్దీ గోపాలం గూబ "గుయ్..." మనేలా ఓ దెబ్బ కొట్టాడు.

గోపాలం బిత్తరచూపులు చూడసాగాడు. అప్పుడే హాలులోకి వచ్చిన పార్వతమ్మ అది చూసి "ఏవిటండి! చెట్టంత కొడుకుని కొట్టడానికి మీకు చేతులెలా వచ్చాయి. అనలు వీడు చేసిన తప్పేమిటి?" అంది.

"నిన్న వీడు కర్పూరాన్ని ఆర్పాడుకదా! మరి ఈరోజు ఉదయం సాయిబాబా గుడిలో కనిపించాడు. మనను మార్చుకున్నాడేమోనని ఇప్పుడు హారతి ఇవ్వబోతే నిన్నటిలాగానే మొండిగా ప్రవర్తిస్తున్నాడు" అని గోపాలం వేపు తిరిగి- "గోపాలం! నీకు భక్తి లేకపోతే మరి గుడికి ఎందుకెళ్ళావు. ఆ ధ్యానం దేనికి" అన్నాడు తండ్రి కోపంగా.

"నేనేమీ దేవుడి మీద భక్తితో గుడికి వెళ్ళలేదు డాడీ! అక్కడకు నా క్లాస్‌మేట్ కమల వస్తుంటుంది. అందుకే వెళ్తాను" అనేసి వెంటనే నాలుక్కరుచుకున్నాడు గోపాలం.

పాపం ఆ పుణ్యదంపతులకు నోటివెంట మాటరాలేదు.

—పాలకొల్లు రాజమోహన్‌రెడ్డి



# 'ది రోడ్' నవలపై చతుర సమీక్షలు

సెప్టెంబర్ నెల 'చతుర'లో ప్రచురిత మైన పి. చంద్రశేఖర్ అజాద్ నవల 'ది రోడ్'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## జనతత్త్వాలరియల్ రివ్యూ...

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

రకరకాల కాలక్షేపం జిమ్మిక్కులూ... కథ నడవడంకోసమే పాత్రల ప్రవేశమూ లేకుండా, ఓ చక్కటి సాంఘిక ఇతివృత్తంతో ఓ పిహెచ్.డి విద్యార్థి వ్రాయవలసిన థీసిస్‌ని చక్కని నవలగా రమ్యంగా అందించారు 'ది రోడ్' రచయిత చంద్రశేఖర అజాద్. ఇది కేవలం నవల, ఊహాజనితమైన కథ కాదు. సమాజంలోని వివిధ వర్గాల మనస్తత్వ చిత్రీకరణ. చక్కని విశ్లేషణతో, ఆద్యంతమూ ఆలోచనా యుతమై నడుస్తూ చైతన్యవంతంగా ముగుస్తుంది కథ. రోడ్ అంటే ఏమిటి? రోడ్ ఎందుకు వుండాలి? లేకపోతే ఏం జరుగుతుంది? ఈ రోడ్ రావడంవల్ల పాలెం గ్రామంలోని వివిధ వర్గాల ప్రతినిధుల ద్వారా 'రివ్యూ' చేశారు రచయిత.

ఒక్క పాలెం అనే కాదు.. నవభారతంలో దాదాపుగా ఏ పల్లె పరిస్థితి కూడా ఇందుకు భిన్నంగా లేదు. సాంఘిక సమస్య... ఇక్కడ రోడ్ అనే కాదు. దానివల్ల మన ప్రజల భావాలెలావుంటాయో చక్కగా చెబుతుందీ నవల. పాలెంలోని వృద్ధతరం, యువతరం, మధ్యతరం, స్త్రీలూ, ధనికులూ, పేదలూ, రైతులూ, రైతుకూలీలు, మాలపల్లెవాసులూ అందరి అభిప్రాయాలూ వాస్తవంగా రివ్యూ చేయబడ్డాయి ఈ నవలలో.

అలాటి పాలెంలో ఓ అభ్యుదయ వివాహం అలజడిని లేవదీస్తే, ఓ అక్రమ సంబంధం చెవులు కొరికితే, ఆ శ్లేష్మంలో పడి కొట్టుకుంటూనే వుండేవారు పాలెం జనాలు ఎన్నాళ్ళైనా. అయితే ఆ స్థితి ఎక్కడా సాధ్యంకాదు. మార్పుతో వుండేదేమానవ ప్రపంచం. 'రాజనాలు పండించే రైతుకు భోజనాలు కరువు' అన్న భావాల్ని పలికించిన వ్యక్తులూ, కాగితప్పులుల్లాంటి అతివాదులూ, గాంధేయవాదులూ, యదార్థవాదులూ ఎవ్వరూ సాధించలేనిపరివర్తన ఓ ఆడమనిషి మరణం కలిగించిందంటే సందేహాస్పదమే అయినా దానికి తగ్గ 'బ్యాక్‌గ్రవుండ్' రచయిత అంతకుముందే తయారు చేసి వుంచారు. పైగా చేపల చెరువు ద్వారా ఆర్థిక చైతన్యం సాంఘిక, రాజకీయ చైతన్యాలకు మూలమని చెప్పేశారు..

సుధీర్ తాను మౌనంగా వుంటూనే ఆ సమాజంలోని అన్ని వర్గాల ప్రజల అభిప్రాయాలనూ విశ్లేషించాడు. సమాజంగురించీ, విప్లవం గురించీ, సైన్సు గురించీ, రాజకీయం గురించీ, మనోబలహీనతల్నీ కుదురుకోని వ్యక్తిత్వాలనూ, ఆవేశాలనూ, ఆలోచనలనూ, ఆకాంక్షలనూ బాగా ఆకళింపు చేసుకొన్నాడు. చెప్పదలచుకున్నదేదో నిర్మొహమాటంగా చెప్పినందుకు రచయిత అభినందనీయుడు

— ధూళిపాళ శ్రీనివాసమూర్తి,
విజయవాడ.





## సందేశాత్మకం

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

శ్రీ అజాద్‌గారి 'ది రోడ్' నవల, మారుమూల గ్రామప్రజలు ఎదుర్కొంటున్న సమకాలీన సమస్యే! ప్రతి మనిషికి కనీస అవసరాలుగా కూడు, గుడ్డ, గూడు, గ్రామమునకు విద్య, వైద్య, విద్యుచ్ఛక్తి రోడ్లు చెప్పవచ్చును. బాపూజీ "గ్రామ స్వరాజ్యం" గురించి ఎన్నో కలలు కన్నారు. గ్రామాలు దేశమునకు వెన్నెముక నీ, వాటి అభివృద్ధియే దేశ అభివృద్ధి అనీ త్రికరణశుద్ధిగా నమ్మి, ప్రజలకు ఉద్బోధించారు. నేడు చాలా గ్రామాలకు కనీస సదుపాయాలే లేవు. దీనికి కారణం ఆ గ్రామ ప్రజల అశ్రద్ధ, అజ్ఞానం, కుటిల రాజకీయాలూను! అజాద్‌గారు నవలలో చెప్పినట్లు చైతన్యం పొందని మధ్యతరగతి, బాధ్యతారహితులైన యువత, పెద్దల అధికారపు నీడలో జీవితాలు వెళ్ళబుచ్చుతున్న బడుగువర్గాలూ గ్రామాలను చైతన్యవంతం కానీయడంలేదు. "పిల్లి మెడలో గంట కట్టేవారెవరు?" ఎవరికి వారే అభ్యుదయ పథంలో నడవడానికి జంకేవారే. ఈ పరిస్థితులలో గ్రామ సౌభాగ్యం, గ్రామాభ్యుదయం ఎలా సంభవిస్తుంది?

సమస్య మనదైనపుడు పరిష్కారం కూడా మనమే ఆలోచించాలని రచయిత ఉద్బోధించారు. ఏ చెన్నారెడ్డిగాని, లేక ఏ వి.పి.సింగ్‌గానీ వచ్చి గ్రామ పరిస్థితులను మార్చెయ్యరు. సమస్యలను స్థానిక ప్రజలే పరిష్కరించుకోవాలి.

ఏ పనైనా చెప్పడంకన్నా చేసి చూపించడం గొప్పకాదా? వాక్శూరత్వం కన్నా క్రియాశూరత్వం మిన్న. అతడు గ్రామంలో ఉన్నత స్థానం పొందడానికి చూపించిన చొరవ, అతడి ఆలోచనలు, అభివృద్ధి పథంలోకి దూసుకొనిపోయే ఆ ప్రవృత్తి, నేటి యువతీ యువకులకు ఆదర్శం కావాలి. అతడి వ్యక్తిత్వానికి మనమూ ముగ్ధులవుతాం.

స్త్రీలు కూడా అన్ని రంగాలలో ముందంజ వేస్తున్న రోజులివి. గ్రామీణ స్త్రీలు నిర్లిప్తతతో, నిస్సారంగా జీవితాలు దొర్లించరాదు. వంటా-వార్పే జీవితానికి గమ్యంకాదు. ఊసుపోని కబుర్లతో కాలాన్ని దొర్లించక, ఉత్సాహంతో పనులు చేపట్టడానికి ముందుకి రావాలి. పల్లెటూరి భోజనప్రియత్వం, అలవాట్లు, మనస్తత్వాలు నవలలో చక్కగా చెప్పారు. మామూలుగా చదవడం ప్రారంభించిన మనల్ని నవలలో లీనం చేయడం రచయిత ప్రావీణ్యానికి నిదర్శనం.

గ్రామీణులు అన్ని ఆలోచనలూ చక్కగా చేసి, ఉత్తమ నాయకత్వంలో ప్రగతిపథంవైపు సాగాలి. దేశాభివృద్ధికి అంకురార్పణ అక్కడే జరగాలి. అదే రచయిత నవలలో చెప్పినమాట. గ్రామీణ ప్రజలకి చూపిన బాట.

—మంజుల,
విజయనగరం.

## కళ్ళున్న ధృతరాష్ట్రులు

*(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

శ్రీ చంద్రశేఖర్ అజాద్‌గారి రచన "ది రోడ్" ఎన్నో పల్లెల జనజీవితానికి ప్రతీక. ఈనాటికీ మన దేశంలో ఎన్నో పల్లెలు పాలెంలాగే కనీస జీవితానికి నోచుకోకుండా ఉన్నవి. ఈ నవలకు నామకరణం చేయడంలోనే రచయిత ఒక విలక్షణ పద్ధతిని అవలంబించారని చెప్పవచ్చు. సాధారణంగానయితే ఈ నవలకు "పాలెం రోడ్డు" అనే మరొక పేరేదో నిర్ణయించడం జరిగేది. "రోడ్డు" అంటే ఒక బాట అనే అర్థంలో నేటి సమాజాన్ని రచయిత నూతనార్థంతో "ప్రాచీనం నుంచి నవీనంలోకి బాట"గా నిరూపించడం జరిగింది.

ఈ నవల్లోని పాలెం సమస్యలు ఈనాటి పల్లెలకు, ఆ పల్లెల్లోని ఆసాములకు, రైతులకు అందరికీ సంబంధించిన యదార్థ విషయాలే అయినా నూతంగా చెప్పడం జరిగింది. రోడ్డువేస్తే తమ షావుకారుతనానికి ఎక్కడ ముప్పువస్తుందో అని రోడ్డు వద్దన్న విషయాన్ని స్పష్టపరచడం జరిగింది. అలాగే పిల్లలు తమ వూరిలోనే సప్త వ్యసనాలకు బానిసలయిలనా ఫరవాలేదుగానీ నగర నాగరికతను తమ పల్లెలోనికి రానివ్వకూడదనే వితండవాదులూ ఉన్నారు. అందుకు ప్రయత్నించిన వారిని ఆవూరి నుంచి తప్పించిన వారూ ఉన్నారు. ఒక విధంగా వీరంతా కళ్ళుండి చూడలేని ధృతరాష్ట్రులనే చెప్పాలి.



రోడ్డు వలన కలిగే ప్రయోజనాల్ని వివరిస్తూ యువతను మేల్కొలపాలి అన్న ఆశతో చేసిన ఈ రచన వలన పాలెంలాంటి అసంఖ్యాక మైన పల్లెల్లోని యువత మేల్కొని తమ పల్లె ల్ని నాగరికతతో నింపి నూతన స్ఫూర్తితో వెలుగొందుతారని ఆశిద్దాం. అప్పుడే రహదా రులు నాగరికతకు నిదర్శనం అన్న నానుడి నిజం అవుతుంది. ఇటువంటి రచన గావించిన అజాద్‌గారికి ధన్యవాదాలు.

— డి.రమేష్‌రెడ్డి,
తిరుపతి.

## ఒక సమగ్ర పరిశోధన

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

పి.చంద్రశేఖర్ ఆజాద్‌గారి 'దిరోడ్' సాంఘిక నవల అనడంకన్న ఒక సమగ్ర పరిశోధన అనవచ్చు. వాహన యానానికి నోచుకోని ఎన్నో గ్రామజీవితాలకు ఇది ఒక దర్పణం. పాలెంలాంటి గ్రామాలు భారతదేశంలో ఎన్నో వేలున్నాయి. రాజకీయాలకు దూరంగా నిలబ డి ఎంతో ప్రశాంతతను సంతరించుకున్నా కొన్ని గ్రామాలు నాగరికతానవకాంతుల్ని విశ్వ నవీన పురోగమనాన్ని అందుకోలేకపోతున్నా యనడానికి ఒకే ఒక కారణం ఆ గ్రామాలకు రోడ్డు లేకపోవడమే! కాలగమనంతోపాటు పరు గులెత్తుతున్న పురోగమనానికి అనుగుణంగా, మానసిక వికాసాలను సాధించవలసిన యు వత రోడ్డులాంటి భౌతిక కారణాల వలన ఎలావెనుకబడి వుంటారో పాలెం యువత ద్వారా, అజాద్‌గారు చక్కగా విశ్లేషించారు. నలుగురూ చేయివేస్తే గంటలలో రోడ్డు తయా రవగలదు. మరి, గ్రామానికి రోడ్డు అవసరాన్ని వారెందుకు గుర్తించరు. రోడ్డు తెచ్చే పరిణామా లను భూతద్దంలోంచి చూసి చాలా భయంక రంగా వూహించుకుంటూవున్నారు పాలెం ప్ర జలు. రోడ్డువుంటే పాలెం యువత పట్టణాలకు వెళ్ళి, ఆధునిక సంస్కృతిలో మాడిమసైపోతా రని వారి అభిప్రాయం. కాని పనిలేని పాలెం యువత, పేకాట, రౌడీయిజం, బ్లూఫిల్మ్‌లు, త్రాగుడు, యువతుల్ని రచ్చకీడ్వటం వంటి విషయాలలో మునిగి తేలుతున్నారన్న నిజా న్ని వెంకట్రావు మాష్టారులాంటి వారు ఎత్తిచూపించినా వొప్పుకోరు. అసలు ఆ నిజా న్ని వాళ్ళు భరించలేరు.

రోడ్డు వేయించుకోలేకపోవడానికి వారు చె ప్పే కారణాలనేకం. పాలెంకు రోడ్డు కోసం ప్రయత్నించిన ఒకే ఒకవ్యక్తి వెంకట్రావు మాష్టారు. రోడ్డు అవశ్యకతను అతినేర్పుగా ఆయన పిల్లల మనస్సుల్లోకి ఇంజెక్టు చేశాడు. అందుకే ఆయన్ను ఆవూరి నుంచి వెళ్ళగొ ట్టడం జరిగింది. చివరకు ఈ విషవల యంనుండి పాలెం గ్రామాన్ని రొయ్యల చె రువు నెపంతో బయటకు లాగి రోడ్డు అవశ్యకత ను చేతల ద్వారా గ్రహింపచేస్తాడు సుధీర్. దాంతోపాటు రోడ్డులేని కారణంగా ఒక ఆడపడ చు వైద్యసహాయానికి దూరమై ప్రసవించలేక చనిపోవడం ఆవూరి యువతలో సంచలనం కల్గిస్తుంది. ఆవూరికి రోడ్డు వేయించగల్గు తుంది.

ఈ నవలలో ప్రజల అమాయకతను, కొంద రు స్వార్థపరులు రాజకీయ ప్రేరేపణకు ఏ విధంగా యన్‌కాష్ చేసుకోగల్గుతున్నారో రచ యిత చాలా నేర్పుగా విశ్లేషించారు. రోడ్డులేని మరెన్నో గ్రామాలకు ఈ నవల కనువిప్పు కాగలదు.

— మణి,
మల్లవరం.

## పల్లెలలో ప్రగతి

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

శ్రీ పి. చంద్రశేఖర్‌ఆజాద్‌గారి నవల 'ది రోడ్' నేటి గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబింపచేసేలా వుంది. గాంధీగారు ప్రబోధించిన 'పల్లెలు ప్రగ తికి పట్టుకొమ్మలు' అనే విషయంపై ఆధారప డి కథ నడిచింది. కథనంలో ఓ ప్రత్యేకతను సంతరించుకున్నా ఇతివృత్తంలో ప్రత్యేకత కనబడదు. గ్రామ పురోగతికి రోడ్డు ముఖ్యం అనేది వాస్తవమే అయినా, రోడ్డు మీదే కథ నడపడం కొంత అసహజం అనిపిస్తుంది. "విప్లవ రాంబాబు, కమ్యూనిస్టు రాంబాబు" అని రెండుపాత్రలకు ఒక పేరు నిర్ణయించ డంలో ప్రత్యేకకారణం కనబడదు. ఈ పాత్రలు కథపై ఏ ప్రభావం చూపలేదు. 'పాలెం' గ్రామానికి రోడ్డు రాకపోవడానికి అవరోధాలు





వుండటం సహజం. యువత పట్టణ నాగరికత కులోనై చాటుమాటుగా కొన్ని అలవాట్లని దిగుమతి చేసుకోవడం మరో వాస్తవం. కానీ గ్రామంలోని ఎవ్వరూ పెద్దలనెదిరించలేని నిస్తేజులేనన్నట్లుగా చిత్రించడం అవాస్తవమనిపిస్తుంది. ఇది ఏ పూర్వకాలంలోనో పెద్దలపట్ల భక్తిప్రపత్తులు మెండిగా వుండి ఎదురుచెప్ప లేనికాలంలో అయితే సహజమేమోగాని ఆధునికసమాజంలో కూడా ఈనాటి యువత ఏమీ చేయలేని పరిస్థితిలోనే వుందా? 'పాలెం'కు చెందిన అభ్యుదయభావాలుగల వినయ్ పెద్దలనెదిరించి వర్ణాంతర వివాహం చేసుకోగల స్థితిలో లేడా? నగరంలో పెద్ద పొజిషన్‌లోవున్న రవిచంద్రగాని, చదువుకొని వ్యక్తిత్వం వున్న హనుమంతరావు లాంటివారుగాని ఎవరూ 'రోడ్' విషయంలో కలిగించుకున్నట్లు చూపకపోవడం లోపంగా వుంది. మూర్ఖత్వం మూర్తీభవించినవారిలా స్వతంత్రులుగా వ్యవహరించనివారిలా చిత్రీకరించిన గ్రామస్తులందరూ చివర్లో ఒకే సంఘటనతో, గర్భవతి అయిన అమ్మాయి సరైనసమయంలో వైద్యచికిత్స అందక చనిపోవడం చూసి చైతన్యవంతులుగా మారడం ఆశ్చర్యంగావుంది. సంఘటన బలమైనదే అయినా అంతవరకూ ఇలాంటివి పాలెంలో ఎన్నో జరిగివుండే అవకాశం ఎంతైనా వుంది. వెంకట్రావు మాష్టారిపాత్ర ఔచిత్యంగాను, ఉన్నతంగాను వుంది. అయితే ఆయన శ్రమవల్ల ప్రజల్లో ఏ చైతన్యం రాకపోవడం అవాస్తవికంగా వుంది. ఏదిఏమైనా కథాబలంలేని ఇతివృత్తాన్ని ఆద్యంతం ఆకర్షణీయంగాను నడిపించి చదివించినతీరు హృద్యంగా వుంది.

—ఎ.వి.ఎస్.ఆర్. శాస్త్రి,
ఒంగోలు.

## నవలకాదు స్కెచ్

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

శ్రీ అజాద్‌గారి నవల "ది రోడ్" ఒక నవలగా కన్నా ఒక స్కెచ్‌గా బాగుంటుందని చెప్పవచ్చు. సాధారణంగా కుటుంబజీవితాలు కథావస్తువుగాగల నవలల్ని మాత్రమే చదవడానికి అలవాటుపడ్డమనకి ఒక ఊరి రోడ్డును ఆ ఇతివృత్తంగా తీసుకుని, చుట్టూ వర్గ, వర్ణవిభేదాలను, రాజకీయాలను ప్రదర్శిస్తూ, ప్రజలందర్నీ పాత్రల్నిగా చేసిన ఈ రచన ఒక సరికొత్త ప్రయోగమనే చెప్పాలి. ఆ రకంగా రచయిత నవలా వస్తువువరంగా ఒక కొత్త 'రోడ్' వేశారనే చెప్పాలి.

అలాగే రోడ్డుకి కొత్త అర్థాన్ని చెప్పడానికి రచయిత చేసిన ప్రయత్నం హర్షించదగింది. మనిషికి, మనిషికి మధ్య సౌభ్రాతృత్వపుబాట, సాంఘిక జీవనగతిపట్ల అవగాహనబాట, నూత్నపరిణామాలకు ఆహ్వానపుబాట, సేవ, స్వార్థాలనడుమ సామనస్యపుబాట, మూర్ఖత్వంనుండి విజ్ఞానానికి వెలుగుబాట- రావాలని, వేసుకోవాలనేది రచయిత ఆశయం. అయితే శీర్షిక మినహారచనలో ఎక్కడా దీనిగురించి లోతులకు పోలేదు. వెంకటరావు మాష్టారు కూడా సూచనప్రాయంగా చెప్పి, తప్పుకుంటారేగాని, విశ్లేషణచేయరు. నవల ఆద్యంతం 'పాలెం' రోడ్డు పాఠకుడి మెదడులో కదుల్తుందేగాని రచయిత ఆశించిన 'ది రోడ్' భావన కలుగదు.

పాలెంలో యువకులు నిమ్పాచీగా, నిరర్థకంగా జీవితం గడిపేస్తున్నారని వాపోయే సుధీర్, తనూ అంతకుముందు గుంటూర్లో గమ్యంలేకుండానే తిరుగుతాడు. ఒక సోషియాలజీ సబ్జెక్టుమీద పరిశోధనాత్మక వ్యాసంగానే నవలంతా నడుస్తుంది.

నోట్సు రాసుకొన్నాక సుధీర్ ఏం నిర్ణయించుకున్నాడో, ఎలా తన కార్యక్రమాన్ని అమలువరిచేడో వివరిస్తే నిర్మాణాత్మకంగా ఉండేది. ఒకవేళ సుధీర్ ఎంచుకున్న గమ్యం రాజకీయాలైతే, ఆ పదవుల చదరంగంలో సేవాతత్పరత అసాధ్యమని సుధీర్‌కు తెలియదా? ఇంతకీ సుధీర్ ఆలోచనకు ఆకృతినిచ్చిన వ్యక్తి అతని బావ. అతడైనా సంపన్నుడు గనుకనే సాధ్యపడినట్లుగా చూపడం, మధ్యతరగతి హనుమంతరావులను నిరాశావాదులుగానే మిగిల్చేయడం రచయిత చెప్పినట్లు "మనిషిలో పరస్పర విరుద్ధమైన కోణాలు" ఎన్ని ఉంటాయో చూపడమేనేమో.

— లక్ష్మి
సి. మల్లవరం.

# చతుర

సంపుటి: 13 నవంబర్ 1990 సంచిక: 10

ఆ విద్యాధికుడు నిరాడంబరజీవేగాక అతిచురుకైనవాడూ, సుతిమెత్తని మనను గలవాడూను. పేదసాదల కష్టసుఖాలెరిగినవాడు. అటు కార్మిక నాయకుడిగా, ఇటు అధికారులకు తలలో నాల్కగా, ఇరువక్షాల మధ్య వారధిగా ఉంటూ తోటివారికి సాయపడే నిస్వార్థుడతను.

స్వల్పకాలంలోనే అందరి మన్ననలుపొంది ఉన్నతశిఖరాలకు ఎదుగుతున్న అతన్ని చూసి ఓర్వలేని దురహంకారులు కొందరు అతనిపై కక్ష పూనారు. ప్రత్యక్షంగా ఎదుర్కోలేక పరోక్షంగా అతన్ని మానసికంగా హింసిస్తూ, దౌర్జన్యంతో మట్టు బెట్టాలని ప్రయత్నించారు. వారికి అతను లొంగిపోయాడా? లేక ఏటికి ఎదురీది ప్రత్యర్థుల పన్నాగాలను చిత్తుచేసి తన ధీశక్తితో మరింత ఉజ్వలంగా ప్రకాశించాడా? అతని విశిష్టత ఎలాంటిది? అతన్ని పడద్రోసేందుకు ప్రయత్నించినవారు చివరికి ఏమయ్యారు?

స్వార్థపరుల ఈర్ష్యాద్వేషాలు మంచితనంపై చూపించే ప్రభావాలేగాక నేటి రాజకీయ నాయకుల నిజస్వరూపాలకు అద్దంపడుతూ ...

సత్యవోలు సుందరశాయి కలం నుండి వెలువడిన

## మండుతున్న మేధస్సు

ఈనెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.





మండుతున్న
మేధస్సు
— సత్యావోలు సుందరసాయి

మిట్ట మధ్యాహ్నం.

సముద్ర తీరప్రాంతమైన వైజాగ్‌లో కొంచెం ఎండకే చెమటలు పట్టేస్తాయి. ఆ రోజు ఎండ చాలా తీవ్రంగా వుంది. చమటకి ఒంటికి అంటుకుపోయిన బట్టలతో విపరీతమైన జనం.

లారీల్లో, బస్సుల్లో, వేన్లల్లో, జీపుల్లో, కార్లల్లో ... జనం.

విశాఖపట్నం ఎయిర్‌పోర్ట్ పరిసర ప్రాంతాలన్నీ జనంతో నిండిపోయాయి.

జిల్లాలోని ఇంచుమించు అన్ని రాజకీయపార్టీల నాయకులకూ సుపరిచితుడైన రాయలు అప్పటికే ఎయిర్‌పోర్ట్‌కి వచ్చేశాడు.

వెనుకనే లారీల్లో వచ్చిన బీద జనం.

జీపుల్లో జిందాబాద్ అని అరుచుకుంటూ వచ్చిన కుర్రజనం.

తెల్లబట్టల్లో భారీదండలు పట్టుకుని వచ్చిన బరువైన జనం.

తమ యూనియన్‌నీ, తమ నాయకత్వాన్నీ రాయలు గుర్తించేటట్లుగా, రాయలు పేరుకీ, యూనియన్ పేరుకీ, తమ తమ పేర్లకీ జిందాబాద్‌లు చెప్పుకుంటూ కార్మికవర్గం వెంటరాగా షో చేస్తున్న నాయకజనం.

వీరందరూ రాయలు ముందు వీరంగం చేస్తున్నారు.

అదంతా చూస్తున్న రాయలు చిరునవ్వులు చిందిస్తూ, ఆ నాయకజనం భుజాలమీద చేతులు వేస్తూ వారి చెవుల్లో ఏవో గుసగుసలు చేస్తున్నాడు. అది చూస్తున్న జనం రాయలుకీ, తమ నాయకుడికీ వున్న సన్నిహిత సంబంధాన్నీ అనుబంధాన్నీ తమ హృదయాల్లోనే చర్చించుకుని గొప్పగా ఊహించుకుంటున్నారు.

ఎందరెందరో నాయకులు. ఎన్నెన్నో జనసమూహాలు. రాయలు ఓపిగ్గా చెరగని చిరునవ్వుతో అందర్నీ అభిమానంగా, ఆప్యాయంగా పలకరిస్తూ, తనకి వీడ్కోలు చెప్పటానికి వచ్చినవారి హృదయాల్లో కొండంత సంతృప్తిని కలిగిస్తున్నాడు. దీనంతటికీ కారణం శాసనసభకు రాయలు ఎన్నికవటం.

ఎన్నిక అనంతరం విజయోత్సాహసభల్లో పాల్గొన్న ఎం.ఎల్.ఏ రాయలు హైదరాబాద్ నుంచి వచ్చిన పిలుపు మేరకు ఈరోజు రాజధానికి బయల్దేరుతున్నాడు.

రాయలు ప్రజల మనిషిగా మంచిపేరు తెచ్చుకున్నాడు. బీదాబిక్కీ మనవాడు అనుకుంటారు. గొప్పవారూ, సంపన్నులూ కూడా రాయల్ని మనవాడు అనే తమ జాబితాలో వేసుకుంటారు. అందర్నీ ఆకట్టుకుంటూ, మెల్లగా మాట్లాడుతూ, అందరి బాధలు వింటూ, ఓదారుస్తూ, మందలించాల్సినవాళ్లని కూడా నవ్వుతూనే చురకలు అంటించే రాయలకి వ్యక్తిగతంగా శత్రువులే లేరని చెప్పటం అతిశయోక్తికాదు. రాజకీయపరంగా ప్రత్యర్థులున్నా వారుకూడా రాయల్ని నవ్వుతూనే పలకరిస్తారు.

వారిలో ఎవరైనా పార్టీ సిద్ధాంతాల్ని దుయ్యబడతారే తప్ప రాయల్ని మాత్రం పల్లెత్తు మాట అనరు. వ్యక్తిగతంగా దూషించరు. అందుకే రాయలు ఎన్నికల్లో గెలవగలిగాడు. ఎవరు ఏ సమయంలో రాయలింటికెళ్లినా సాదరంగా ఆహ్వానించబడతారు. వచ్చినవాళ్ళని అన్నగారూ, బావగారూలాంటి పదాలతో సంబోధిస్తూ ఆప్యాయంగా మాట్లాడతాడు రాయలు. వాళ్ల సమస్యల్నీ అవసరాలనీ తెలుసుకుంటాడు. వీలయినంతవరకూ ఏదో ఒకటి చెయ్యటానికి ప్రయత్నిస్తాడు. ఆ సమస్యలు పరిష్కారమయినా కాకపోయినా, వాళ్ల పనులు జరిగినా జరగకపోయినా, తనవంతు ప్రయత్నలోపం లేకుండా వ్యవహరించే రాయలంటే జనానికి విపరీతమైన అభిమానం!

రాయలుకి వీడ్కోలు ఇవ్వటానికి వచ్చిన ప్రజావెల్లువ దృష్టిని ఆకట్టుకునేటట్లుగా ఓ యువకుడు చురుకుగా కదులుతూ అక్కడ అందరిలోనూ ఇతనెవరబ్బా? అనే ప్రశ్న రేకెత్తిస్తున్నాడు.

ఒకవైపు ఈ సంరంభం సాగుతూండగానే మరోపక్క అతను రాయలుతోపాటే తిరుగుతూ, అందర్నీ అలరిస్తూ, రాయలు పరిచయం చేసినవాళ్లని నవ్వుతూ పలకరిస్తూ, వాళ్లకి అప్పుడిలా మాట్లాడి ఆకట్టుకుంటూ చకచకా తన పనులు చేసుకుంటూ రాయలు చుట్టూనే




తిరుగుతున్నాడు.

చామనఛాయ. సన్నగా పొడుగ్గా వుండి చూపరులను ఆకట్టుకునే చురుకైన కళ్లు. పై జామా లాల్చీ వేసుకుని రాయలు ముందు ఉద్యోగిలా ప్రవర్తించక మందస్మిత వదనంతో హుందాగా వున్నాడు ఆ యువకుడు.

రాయలు ఏం చెప్పినా వింటూ చెప్పిన పనిని క్షణాల్లో చేస్తున్నాడు. చలాకీగా చురుకుగా వున్న ఆ యువకుడికి రాయలుతో ఉన్న చనువూ, చొరవా చూసి జనం, నాయకులూ, ముందు ఆ యువకుణ్ణి ఆకట్టుకుని తద్వారా రాయల్ని ఆకట్టుకునే ప్రయత్నాలు చేస్తున్నారు. వారి ప్రయత్నాలు ఫలిస్తాయనేటట్లుగా ప్రవర్తిస్తున్నాడు ఆ యువకుడు.

మురికివాడల్లో నివసించే ఓటర్ల దగ్గర్నుంచి, వేలాది కార్మికులు పనిచేసే కర్మాగారాల అధిపతులవరకూ అందరూ అక్కడున్నారు. వారందర్నీ ఒకేవిధంగా పలకరిస్తూ, వారి సలహాలను, సూచనలను, సమస్యలను వింటూ, వారందించే ప్రశంసలనూ, శుభాకాంక్షలనూ అందుకుంటూన్న ఎం.ఎల్.ఏ రాయలు వాళ్ళందరితోనూ వారి మనిషిలాగే మసులుకుంటున్నాడు.

ఈ హడావిడంతా ప్రముఖుల విశ్రాంతి కోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన గది ముందున్న హాలులో సాగుతోంది. ఈ జనసమూహాన్ని తప్పించుకుంటూ, ముఖంమీద పట్టిన చిరుచమటని కర్చీఫ్‌తో సుతారంగా అద్దుకుంటూ విశ్రాంతి గదివైపు నడుచుకుని వస్తున్నాడు జగదీష్.

జగదీష్‌ది గంభీరమైన ఆకారం. ఫుల్‌సూట్‌లోవున్న జగదీష్ అలా నడచివస్తూంటే అందరి చూపులూ అతనిమీదే పడేటట్లుగా వుంది అతని స్వరూపం. చాలామంది దారి యిచ్చేశారు. అతని వెనకాలే ఇద్దరు ప్యూన్లు సూట్‌కేస్, బ్రీఫ్‌కేస్ పట్టుకుని వస్తున్నారు.

నరాసరి విశ్రాంతిగదిలోకి అడుగుపెట్టాడు జగదీష్. అప్పటికే ఆ గదంతా నిండిపోయి ఉంది. గది బయటవున్న హాలులోని కుర్చీలన్నీ కూడా నిండిపోయాయి. విసురుగా, విసుగ్గా బయటకి వచ్చిన జగదీష్‌ని ఎవరో గుర్తుపట్టి కుర్చీలోంచి లేచి జగదీష్‌ని కూర్చోమన్నాడు.

"ఇట్స్ ఓకే" ఆ వ్యక్తిని ప్రశంసాపూర్వకంగా చూస్తూ ఆ కుర్చీలో దర్జాగా కూర్చున్నాడు జగదీష్.

"తాను నిలబడే వుండాలేమో ఎవరైనా చూస్తే బావుండదు"

క్షణకాలం కిందట అనుకున్నటి కంగారు జగదీష్‌లో అదృశ్యమైంది. అలా స్థిమితపడ్డ జగదీష్ నెమ్మదిగా అక్కడ జరుగుతున్న హడావిడిని, ఆ జనాన్ని చూడనారంభించాడు.

కొంతమంది జగదీష్‌ని చూసి పలకరిస్తున్నారు. ఏదో అడుగుతున్నారు. జగదీష్ తండ్రి గురించి కొందరూ, కంపెనీ వ్యవహారాల గురించి మరికొందరూ, కొత్త ఫ్యాక్టరీ నిర్మాణం పనులగురించి యింకొందరూ అడుగుతున్నారు. కొంతసేపటికి ఆ జనం విసిగింపు భరించలేని జగదీష్ అసహనంగా అటూ ఇటూ కదిలాడు.

ఆంధ్రదేశంలోని పెద్ద పారిశ్రామిక వేత్తల్లో ప్రముఖుడైన చంద్రశేఖర్ ఏకైక కుమారుడు జగదీష్. ఖరీదైన జీవితం, ఊహకందని వసతులు, అత్యాధునిక వాతావరణంలో పెరిగిన జగదీష్ మంచి అందగాడు. తండ్రి హోదాకు తగిన విధంగా కొడైకెనాల్, డార్జిలింగ్ ప్రాంతాల్లోని మిషనరీ స్కూల్స్‌లో ఖరీదైన విద్యను అందుకున్నాడు. ఆపైన అమెరికా వెళ్లి అక్కడ వ్యాపార నిర్వహణలోని వివిధ అంశాలను అధ్యయనం చేశాడు. విలాసవంతంగావుండే ఖరీదైన జీవితాన్ని గడిపే జగదీష్ ప్రస్తుతం తండ్రి నెలకొల్పిన అతిపెద్దదైన దిగుమతులు, ఎగుమతుల కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్. అదికాక తమవే మరో నాలుగు ఫ్యాక్టరీలకు నిర్ణయాధికారి.

జగదీష్ ఆధునిక జీవితంలో అలగా జనానికీ, మధ్యరకం జనానికీ చోటులేదు. అంతా టాప్ క్లాస్‌వాళ్లతోనే వ్యవహారం.

అందుకే తనని పలకరించేవాళ్లనీ, పలకరించటానికి ప్రయత్నించేవాళ్లని చూసి, తన నుండి వాళ్లేదో సహాయం పొందటానికి ప్రయత్నాలు చేస్తున్నారని భావిస్తాడు జగదీష్. సమయం గడుస్తున్నకొద్దీ అతనిలో చిరాకు ఎక్కువవుతోంది. ముఖంలో కోపం చోటుచేసుకో

వటం ప్రారంభమైంది.

సరిగ్గా ఆ సమయంలోనే రాయలు పక్కనే వున్న ఆ తెల్ల లాల్చీ, తెల్ల పైజామాలో యువకుడు కనిపించాడతనికి. ఓ క్షణం కన్నార్పకుండా చూశాడు. ఆ యువకుడు కూడా జగదీష్‌ని చూశాడు.

"నిజంగా చూశాడా?" – చూడనట్లు చూశాడు.

"చూసినా నువ్వు నాకెందుకులే" – అన్నట్లు చూశాడు.

ఆ చూపులో ఏ భావం లేదు.

కానీ ఎందుకలా చూడనట్లు, చూడకూడదన్నట్లు చూశాడు?

ఆ యువకుడు కూడా జగదీష్ వయసువాడే.

జగదీష్‌లో ఏదో కలవరం.

ఆ యువకుడిని తను ఎక్కడో చూశాడు.

"నిజంగా చూశాడా లేక అలా అనిపిస్తోందా?"

చూస్తే ఎప్పుడు? ఎక్కడ? ఎలా?

జగదీష్‌కు గుర్తురావటంలేదు. అసలు గుర్తుంచుకోవాల్సిన అవసరం కూడా లేదు అతనికి.

"అయినా ఆఫ్టరాల్! ఎవడో బినామీగాడు తనను చూడనట్లుగా చూస్తే, తను వాడిని గురించి ఎందుకు ఆలోచించాలి?" అనుకుని జగదీష్ సరిపెట్టుకుంటున్నాడు. కానీ అతని మనసులో చోటుచేసుకున్న ఆ ఆలోచన మాత్రం అసహనాన్ని రేపుతోంది.

ఎంత చూడకూడదనుకున్నా జగదీష్ కళ్లు ఆ యువకుడినే గమనిస్తున్నాయి. ఆ యువకుడి ముఖంమీద కదలాడే చిరునవ్వు జగదీష్‌లో సెగలు రేపుతోంది.

ఆ చిరునవ్వుకీ, జగదీష్ అసహనానికీ, ఆవేశానికీ ఏమిటి సంబంధం?

"నో... ఐ డోంట్ వాంట్ దట్ ఫెలో టు లాఫ్". "నాకు వాడి నవ్వంటేనే అసహ్యం. వాడు నవ్వకూడదు. దట్సాల్"- అనుకుంటున్నాడు జగదీష్.

యువకుడు నవ్వితే జగదీష్‌కి నష్టమేమిటి? జగదీష్‌కి అసహ్యమయినంతమాత్రాన ఆ యువకుడు నవ్వటం మానెయ్యాలా? ఎందుకు తను ఆవేశపడుతున్నాడో జగదీష్‌కి అర్థం కావటంలేదు. "ఛీ... డర్టీఫెలో వాడిని గురించి తనెందుకు మూడ్ పాడుచేసుకోవాలి? వాడెవడనీ? వాడు తనకు గుర్తుకొస్తున్నాడు? వాడిని గుర్తుకు తెచ్చుకోవాల్సిన అవసరం తనకేమిటి? అసలు తనంత వ్యక్తి వాడిని గురించి ఆలోచించటమే టైం వేస్ట్"

జగదీష్ మనసులో యిలా అనుకుంటున్నా ఆ యువకుడిని గురించి ఆలోచిస్తూనే గడుపుతున్నాడు.

"వాడి వేషం ... పైజామా, లాల్చీ! ఛ! ... చమటతో తడిసి ఒంటికి అంటుకుపోయాయి. వాడిని చూస్తే చాలు ఏ పనీలేని అలగావెధవని తెలిగ్గా చెప్పవచ్చు. మరి వాడు ఏంచేస్తున్నాడనీ, ఏంచేశాడనీ ఈ జనమంతా వాడిచుట్టూ చేరుతున్నారు? వాడిలో ఏంగొప్పతనముంది? ఏ ప్రాముఖ్యతాలేని వాడి చుట్టూ ఈ పనికిమాలిన జనం ఎందుకు తచ్చాడుతున్నట్లు?" జగదీష్ అన్యమనస్కుడయ్యాడు.

నిజానికి జగదీష్‌కి ఆ జనం అనవసరం. కానీ అదే జనం ఆ యువకుడి చిరునవ్వుల మధ్య మసలుతున్నారు.

తనకు అక్కర్లేని జనం వాడిచుట్టూ మసలడం కూడా జగదీష్‌కి నచ్చటంలేదు.

"ఈ పనికిమాలిన జనం ఏంచేస్తారో వాళ్లకే తెలియదు. ఎందుకు వాడికూడా పడిఛస్తున్నారు? వాడు ఏంమాట్లాడుతున్నాడు? వాడికా బిజీ ఏమిటి? కొత్తగా ఎన్నికయిన ఆ ఎం.ఎల్.ఏ రాయలు వాడిని మాటిమాటికీ పిలుస్తున్నాడెందుకు? వాడేదో తన అంతరంగిక స్నేహితుడన్నట్లు ప్రవర్తిస్తున్నాడే రాయలు.

ఈ నాయకులూ, పెద్ద పెద్ద మనుషులూ వాడిని పక్కకి పిల్చుకెళ్లి ఏవేవో చెబుతున్నారేమిటి? వాళ్లేం చెపుతున్నారు? వాడేదో గొప్ప నాయకశిఖామణిలా ఫోజు పెడుతూ వాళ్లతో ఏదో చర్చిస్తున్నాడే?" ఇలాంటి ఆలోచనలు జగదీష్‌లో ఎక్కువై బాధపెడుతున్నాయి.

"వాడేమన్నా ఉద్యోగాలు యిప్పించగ



లడా? ఊళ్లు ఏలగలడా? ఎవరికైనా ఏదైనా సహాయంచేసే సామర్థ్యం వున్నవాడా? నో ... వాడికే సామర్థ్యం వున్నట్టూ కనపడటంలేదు'' నిర్ధారించుకుంటున్నాడు జగదీష్.

అయినా ఏమిటిది?

తను విమానం ఎక్కడానికి వచ్చాడు. ఆ యువకుడిలో, విమానంలో కాలు పెట్టడానికి కూడా సాధ్యపడని బీదతనం కనపడుతోంది. ఆ యువకుడు ఎం.ఎల్.ఏ రాయుడిని విమానం ఎక్కించటానికి వచ్చిన సామాన్య బతుకు కూడా బతుకలేని మనిషి.

మరి ఎందుకు వాడికా ప్రాముఖ్యత?

ఆ యువకుడి ప్రతీ కదలికా జగదీష్‌ని వేధిస్తోంది.

ఆ జనం తన చుట్టూ తిరగటంలేదనే కోపంతో కాకుండా, ఆ యువకుడి చుట్టూ తిరుగుతున్నారనే వాస్తవంతో జనాన్ని తిట్టుకుంటున్నాడు జగదీష్. తన సహాయాన్ని అర్థించే జనం అక్కడున్నా కూడా తాను ఒంటరివాడైపోయాడు. తన కళ్ల కదలికే ఆజ్ఞగా భావించే సేవకులు ఎదురుగా వున్నా ఏదో లోటు ఏర్పడినట్లు భావిస్తున్నాడతను.

ఆ యువకుడికి సేవకులు లేరు. అతడే ఓ సేవకుడిలా వున్నాడు. ''అవును వాడు సేవకుడే! కాదు ... వాడు అసలు సేవకుడికన్నా హీనంగా వుండాల్సినవాడు''. ఆ యువకుడి వునికి కూడా కంపరంగా వుంది జగదీష్‌కి.

సర్వసౌఖ్యాలూ, హోదా, డబ్బు, ఊహించలేని ఖరీదైన జీవితం వున్న తను అతి సామాన్యుడైన ఆ యువకుడి నీడను చూసి కూడా భరించలేకపోతున్నాడు. ఎందుకో ఆ యువకుడంటే అసహ్యం కలుగుతోంది. ఆ ప్రవర్తన తనకు ఏమాత్రం సహించలేనిదిగా వుంది. ఒక్కక్షణం కూడా ఆ యువకుడిని దూరం నుంచి కూడా చూడలేని స్థితికొచ్చేశాడు జగదీష్.

యువకుడు మాత్రం జగదీష్‌లాంటి గొప్ప వ్యక్తి అక్కడున్నాడనే ధ్యాసే లేనట్టుగా, జగదీష్‌ని ఒక్కసారి మాత్రం చూసి మళ్లీ తనపనిలో నిమగ్నమైపోయాడు.

ఆ జనం, ఎం.ఎల్.ఏ రాయలూ, ఆ మొహాన చిరునవ్వు అంతే వున్నాయి ఆ యువకుడి ఆలోచనల్లో.

ఇంతలో విమానప్రయాణీకుల కోసం ఓ ఎనౌన్స్‌మెంట్ చేశారు. ఆ జనసమూహం చేసే జిందాబాద్‌ల మధ్య రాయలు నెమ్మదిగా కదిలాడు. ఓ మూడు అడుగులు వేసి, ఏదో గుర్తుకొచ్చినట్లుగా ఆ యువకుడిని పిలిచి అతని చెవిలో ఏదో చెప్పాడు. ఇద్దరూ కలిసి ముందుకు సాగారు. రన్‌వే వరకూ వచ్చాక, ఓ రెండు నిముషాలు మళ్ళీ రాయలుతో మాట్లాడి అక్కడే ఆగిపోయాడు ఆ యువకుడు.

అతన్ని దాటుకుంటూ వెళ్లాడు జగదీష్.

జనంకేసీ, ఆ యువకుడికేసీ చెయ్యి ఊపుతూ రాయలు విమానంలోకి ఎక్కాడు.

రాయల్ని దాటుకుంటూ వెళ్లిన జగదీష్ రాయల్ని చూసి కూడా చిరాకుపడ్డాడు.

తన సీటులో కూర్చున్న జగదీష్ మళ్లీ ఆలోచనలో పడ్డాడు.

''ఈ పెద్దమనిషికి బుద్ధివుందా? ఇలాంటి వాళ్లు నాయకులయితే దేశం ఏంకావాలి? అంత హోదాలో ఉన్న రాయలు ఆ పనికిమాలినవాడిని ఎందుకలా చేరదీశాడు? వాడితో ఈ రాయలకి ఏంపని? ఎందుకలా అందరికీ పరిచయం చేశాడు? వాడేమో తనే ఎం.ఎల్.ఏ అయినంత ఫీలింగ్ యిస్తాడే? ఈ జనం కూడా ఎంత విచిత్రంగా వుంటారు? ఎం.ఎల్.ఏ పట్ల గౌరవం ప్రదర్శిస్తే ఫరవాలేదు! కానీ వాడికెందుకంత ప్రాధాన్యత యిస్తున్నారు? అందుకే ఇండియా వెనకబడిపోతోంది. ఈ జనం మారనంతకాలం అభివృద్ధి చెందటం జస్ట్ ఇంపాజిబుల్''

నెమ్మదిగా సీట్లో సెటిల్ అయ్యాడు జగదీష్.

విమానం రన్‌వేమీద పరుగెడుతోంది. ఆపైన వేగంగా మేఘాల్లోకి దూసుకుపోయింది.

ఆకాశంలో విమానంలో వున్నా జగదీష్ ఆలోచనలు, రన్‌వేకు దూరంగా నేలమీద వున్న జనం, వాళ్లలో వున్న ఆ యువకుడిచుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

అవును... ఆ యువకుడిని ఎక్కడో చూశాడు





తను. ఎక్కడ? ... నిజంగా ఆ యువకుడు తనకి గుర్తురావటంలేదా? ... గుర్తుకు రాకపోతే ఎందుకు ఆ యువకుడిని తిట్టుకోవడం?

గుర్తుతెచ్చుకోకూడదనుకున్నా ఆ యువకుడు విమానంతోపాటు వాయువేగంతో ఎగురుతున్న జగదీష్ మనసులో అంతకన్నా వేగంగా తిరిగే సుడిలాగా పరిభ్రమిస్తున్నాడు.

''డర్టీఫెలో...'' - అని అనేకసార్లు అనుకున్న జగదీష్‌కి గతం నెమ్మదిగా గుర్తుకువస్తోంది.

''అవును ఆ వ్యక్తే - యువకుడు''

''పనికిమాలినవాడు... జగదీష్ మనసులో పురుగులా తచ్చాడుతున్నాడు.

''వాడు... తనకు గుర్తున్నాడు'' - అనుకున్నాడు జగదీష్.

''కానీ గుర్తుకు తెచ్చుకోకూడదు... మరచిపోవాలి'' -

కానీ, జగదీష్ ఎంత బలవంతంగా ఆ యువకుణ్ణి గురించిన ఆలోచనలని తన మనసులోకి రానివ్వకూడదనుకుంటున్నాడో! అంతకుమించి మరింత బలంగా ఆ జరిగిన సంఘటన అతని మూసుకున్న కళ్ళముందు ఒక్కసారిగా, సముద్రంలోని అలలాగా ఎగసిపడివచ్చి ఒడ్డునవున్న బండరాళ్ళను చరచినట్లుగా కదలాడింది.

★ ★ ★

సికింద్రాబాద్ రైల్వేస్టేషన్ తెల్లవారకముందే హడావుడిపడటం ప్రారంభించింది. చీకట్లు విడిపోకుండానే వచ్చే నర్సాపూర్ ఎక్స్‌ప్రెస్ ఆపైన దక్షిణ, మద్రాస్ ఎక్స్‌ప్రెస్‌లు. ఆ వెంటనే గోదావరి, కాకతీయ రైళ్ళు వస్తాయి. అప్పుడప్పుడు ఎ.పి. ఎక్స్‌ప్రెస్ కంగారుపడుతూంటుంది. ఈలోగా గుంటూరు వెళ్ళే క్రిష్ణా ఎక్స్‌ప్రెస్ గొడవచేస్తుంది. ఇలా ఉదయం తొమ్మిదిన్నరవరకూ విపరీతమైన రద్దీతో హడావిడివడి ఆపైన కొంచెం ఊపిరిపీల్చుకొంటుంది. మళ్ళీ అంత హడావిడి సాయంత్రమే వుంటుంది. మద్రాస్ ఎక్స్‌ప్రెస్ మద్రాస్‌వైపు బయల్దేరటంతో ఆరంభమయ్యే సాయంత్రం రద్దీ రాత్రి దక్షిణ ఎక్స్‌ప్రెస్ సికిందరాబాద్ స్టేషన్ విడిచేవరకూ కొనసాగుతుంది. దాంతో స్టేషన్ నిద్రావస్థకు చేరుకుంటుంది. అప్పుడప్పుడు గూడ్స్ బళ్ళూ, లోకల్ రైళ్ళూ కూతలగోల చేస్తే బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూలేచి వాటివనిచూసి మళ్ళీ ఆవలిస్తూ నిద్రకు ఉపక్రమిస్తుంది.

ఈ కార్యక్రమం సికిందరాబాద్ స్టేషన్‌కి మామూలే.

కొందరికి ఏ రైలు టికెట్ ఏరకంగా సంపాదించాలనేది వెన్నతో పెట్టిన విద్య.

రైళ్ళు, రైలు ప్రయాణాలూ, టికెట్ అమ్మకాలూ, రిజర్వేషన్ కోసం పాట్లూ, టి.టిల దర్పప్రదర్శనలూ, రెండు పదిరూపాయల కాగితాలకు చిరునవ్వుతో ఒకసారి, కోపంతో మరొకసారి రిజర్వేషన్ యిచ్చే టి.టిల కరుగుదలలూ, టికెట్ లేకుండా ఎక్కే చిరిగిన చొక్కాల కుర్రాళ్ళూ, రిజర్వేషన్ లేకపోయినా రిజర్వుడ్ కంపార్ట్‌మెంట్‌లో బైఠాయించిన ప్రయాణీకులు... యివన్నీ మామూలే. సర్వసాధారణంగా ఇవి జరుగుతూ పోతున్నా ఒకోసారి ఒక్కొక్కరికి ఒకోరకమైన అనుభవాలు ఎదురై జీవితంలో మరచిపోలేని సంఘటనలుగా నిలిచిపోతాయి.

రిజర్వేషన్ చార్ట్‌లో తన పేరు వుందేమోనని చూస్తున్న అభిషేక్ అది లేకపోవటంతో కంగారుపడ్డాడు. మూడురోజుల క్రితం ఈ రిజర్వేషన్ కార్యాలయంలోనే గంటన్నరకి పైగా నుంచుంటే చివరికి గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో ఫస్ట్‌క్లాస్ టికెట్ కూడా వెయిటింగ్ లిస్ట్‌లో దొరికింది. ప్రయాణంనాటికి కన్‌ఫర్మ్ బర్త్ దొరుకుతుందనుకున్నాడు అభిషేక్. కానీ ఆ ఆశ నిరాశయిపోయింది.

అతను పోస్ట్‌గ్రాడ్యుయేట్. దేశంలో ఎంతో మంది ఆ చదువు చదివారు. అభిషేక్‌కి డిగ్రీ తర్వాత చదువు ఆపాల్సిన పరిస్థితులువున్నా అన్నగారి ప్రోద్బలంతో పి.జి. పూర్తిచేశాడు. చదివిన చదువుకి ఎలాంటి ఉద్యోగం దొరుకుతుందోనన్న దిగులు లేకుండా నాలుగు సంవత్సరాలుగా నిరుద్యోగపర్వం నడుస్తోంది.

రోజూ ఉదయమే వార్తాపత్రికలు తిరగేయటం, వార్తలకంటే ఉద్యోగ ప్రకటనల పేజీలనే ప్రధానంగా చూడటం...

ఎవరైనా ఎక్కడైనా ఉద్యోగం వుందని



చెబితేవరిగెత్తటం...

ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజ్‌లో పనిచేస్తున్న అటెండర్ విదిలిస్తూ మాట్లాడినా సహించటం...

అదే ఆఫీసులో రికమండేషన్‌మీద ఉద్యోగం సంపాదించిన గుమస్తా తానే స్వయంగా ఉద్యోగాలు అందించేవాడిలా ఫోజుకొడుతూ పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నా మౌనం పాటించటం...

ఇంటి పక్కనున్న కుర్రాడు కులం ప్రాతిపదికతో ఉద్యోగం సంపాదించి వీలున్నప్పుడు తనకేసి చూస్తూ పెద్దరికాన్ని మీద వేసుకొని అనవసర సలహాలు యిచ్చినా వినటం...

"మీ మరిదికి ఉద్యోగం లేదటగా! ఏం లేదు... మా బంధువుల పిల్లవుంది సంబంధం కుదురుతుందేమో అనుకున్నాను! ఉద్యోగమే లేకపోతే ఎలా?"

తన వదినతో పక్కింటి పిన్నిగారు అంటూండగా విని ఏమీచేయలేక తడబడటం...

ఉద్యోగంచేస్తున్న ప్రతివాడూ ఇతరత్రా పనికిమాలిన వెధవపనులు చేస్తూ కాలరెగరేసుకున్నా చూస్తూ వూరుకోటం... యిలాంటి అతి సాధారణ నిరుద్యోగ పర్వ ఘట్టాలన్నీ అనుభవించాడు అభిషేక్. నెలరోజుల కిందట ఓ పత్రికలో సేల్స్ మేనేజర్ పోస్టులు ఖాళీవున్నాయి అనే అడ్వర్టయిజ్ చూసి ఓ అప్లికేషన్ పడేశాడు. అదృష్టంకొద్దీ ఆ కంపెనీవాళ్ళు "ఇంటర్వ్యూకి రండి, ఫస్ట్‌క్లాస్ ట్రైన్ టికెట్ యిస్తా"మని ఆహ్వానం పంపారు. ఆ ఆహ్వానం ఆనందం కలిగించినా దాన్ని మన్నించి ఇంటర్వ్యూకి వెళ్లాలంటే మొదట తను డబ్బు పెట్టుకోవాలి. సర్లే సెకండ్‌క్లాస్‌లో వెళ్దామనుకుంటే "ఎందుకలా వచ్చావ్? మేం ఫస్ట్ క్లాస్‌లో రమ్మంటే మామాట వినలేదే? నువ్ అనర్హుండవు" అని ఆ కంపెనీవాళ్ళు అన్నా ఆశ్చర్యపడనక్కర్లేదు. ఏం... ఎన్ని ఇంటర్వ్యూలలో ఎన్నెన్ని వెర్రిసంఘటనలూ, వెధవవేషాలూ చూడటంలేదూ? అసలు ఇంటర్వ్యూల్లో సరైన ప్రశ్నలడిగే సాధుస్వభావులుండే రోజులు కావివి అని అనుకుంటూ అన్నగారిచేత అప్పుచేయించి మరీ ఇంటర్వ్యూకి బయల్దేరదామని మూడు రోజుల కిత్రం టికెట్ కొనుక్కున్నాడు.

అది కాస్తా కన్‌ఫర్మ్ కాకపోవటంతో నిరుత్సాహం ఆవరించి టెన్షన్ మొదలైంది.

"పోనీ ఆ టికెట్ కేన్సిల్ చేస్తే... అలాచేసి సెకెండ్‌క్లాస్ టికెట్ కొందామన్నా అందులో రిజర్వేషన్ దొరకటం మరీకష్టం... పోనీ జనరల్ కంపార్ట్‌మెంట్ ఎక్కితే?... కనీసం రాజమండ్రి వరకైనా నిలబడాలి, అంటే దాదాపు మొత్తం ప్రయాణం. అయినా అతడు వున్నది సికింద్రాబాద్ స్టేషన్‌లో, గోదావరీ ఎక్స్‌ప్రెస్ హైదరాబాద్ నుంచి బయల్దేరుతుంది. అక్కడే పూర్తిగా నింపేసుకుని వస్తుంది అరైలు. సికింద్రాబాద్‌లో జనరల్‌లో ఎక్కేవారికి నిలబడటానికి కూడా సరిగ్గా చోటుండదు". ఒక్క క్షణం ఆ ఆలోచనలన్నిటినీ అదిమిపట్టాడు అభిషేక్. వెంటనే బుర్రలో ఓ కొత్తవెలుగు మనసుని జివ్వమనిపించింది. గబగబా టికెట్ కౌంటర్ల దగ్గరకు వెళ్లాడు. సెకండ్‌క్లాస్ ఎ.సికి, ఫస్ట్‌క్లాస్‌కి తేడా కనుక్కున్నాడు. డెబ్బై రూపాయల వరకూ వుందనటంతో కొంచెం తేలికపడ్డాడు.

అంతలో గోదావరి ఎక్స్‌ప్రెస్ అరుచుకుంటూ స్టేషన్‌లోకి వచ్చింది. అభిషేక్ ఏ మాత్రం ఆలస్యం చేయకుండా సెకండ్‌క్లాస్ ఎ.సి టికెట్ కండక్టర్ కూడా పడ్డాడు. ఎలాగైనా బర్త్ ఒకటి యిప్పించమని ఇంగ్లీషు, తెలుగు, ఉర్దూ భాషలలో అర్థించటం మొదలుపెట్టాడు. టి.టి. మాత్రం అభిషేక్‌ని ఖాతరు చెయ్యటంలేదు. చివరికి రెండు వున్నాయనీ, ఎవరూ రాకపోతే యివ్వటానికి ప్రయత్నిస్తాననీ చెబుతూ యిక విసిగించకు అన్నట్లుగా చూశాడు ఆ కండెక్టర్. సర్వసాధారణ విషయాలు కూడా ఒకోసారి గడ్డు సమస్యగా మారిపోతాయి. టి.టి బెర్త్ యిస్తే అభిషేక్ తన సమస్య నుంచి తక్షణం బయటపడి హాయిగా ఊపిరి పీల్చుకుంటాడు. కండక్టర్ మాత్రం ఆ సమస్యని పట్టించుకునే అవసరం లేనట్లుగా వున్నాడు.

"ఒక్కసారి రైల్వేశాఖలో ఉద్యోగం దొరికితే చాలు అందులోనూ టి.టి. పోస్టు దొరికితే భలే వుంటుంది" అని మనసులో అనుకున్నాడు




అభిషేక్.

"ఒక్క టి.టినే ఎందుకనాలిలే. భారతదేశంలో ఎవరైనా సరే ముందు ప్రభుత్వ ఉద్యోగాల్లోకి దూరటానికి ప్రయత్నిస్తారు.

ఎలాంటి ఉద్యోగమైనా ఫరవాలేదు. ఆ ఉద్యోగం సంపాదించటానికి నానా తిప్పలూ పడతారు.

ఉద్యోగం దొరికితే అంతే! అక్కణ్నుంచి వారి ఆలోచనాసరళే మారిపోతుంది. ఉద్యోగంలేని వాడు వాడికి దండగగా కనిపిస్తాడు. అవసరంతో ఎవరైనా తమ దగ్గరికి వస్తే తామే ఉన్నతులమన్నట్లుగా ఫోజ్‌పెట్టి చిన్న సమాచారం చెప్పటానికి కూడా అనేకరకాల హావభావాలు ప్రదర్శిస్తుంటారు.

ప్రభుత్వం తరపున ప్రజలకు సేవచెయ్యాల్సిన ఉద్యోగులలో ఎక్కువశాతం మంది పై అధికారుల మెప్పుకోసమే ఉద్యోగం చేస్తున్నారనటంలో సందేహం అనవసరం. అధికారులు కూడా ఉద్యోగుల పనిని పర్యవేక్షించరు. ప్రభుత్వపరంగా ఉద్యోగులు ప్రజలపట్ల నిర్వర్తించాల్సిన బాధ్యతను ఏనాడూ పరీక్షించరు. ఎంతసేపూ తమ ఉద్యోగులు తమకు కావల్సిన పనులు చేస్తున్నారా లేదా, తమ మాట తు.చ. తప్పకుండా వింటున్నారా లేదా?— ఇదే వారి అధికారమవుతోంది.

ప్రజలంటే వీరికి ఏదైనా తేలికభావం వుందా? ఆ తేలికభావం ప్రబలుతున్న కాలంలో ప్రజలే ప్రభుత్వం అనటానికి ఆస్కారం ఎక్కడ నుంచి వస్తుంది? ఈ విధంగా ఆలోచించే అధికారులు ఎంతమంది వున్నారు? ప్రజలకు ఈ సంగతి పట్టించుకునే సమయమే వుండదనేది యధార్థమవుతోంది. దాంతో ఉద్యోగులూ, అధికార్లూ, వారిపైవున్న ఉన్నతాధికార్లూ ఏదోఒక ఒత్తిడి తెస్తేకాని పనులు చేయలేని స్థితికివచ్చారు. ప్రభుత్వ యంత్రాంగంపై ఒత్తిడి తేలేని స్థితిలోవున్న లక్షలాది, కోట్లాది ప్రజల మాటేమిటి? ఆ ప్రజల ప్రయత్నాలు అడవికాచిన వెన్నెల కావల్సిందేనా? కలలుగా, కల్లలుగా మారవల్సిందేనా! అని సర్దుకున్నాడు మళ్ళీ.

తనను పట్టించుకోటంలేదన్న విషయం గమనించిన అభిషేక్ టిటి మీద కొంచెం ఒత్తిడి తీసుకురావటానికి తన ఇంటర్వ్యూ విషయం చెప్పాడు. ఎలాగైనా బెర్త్ ఇప్పించమన్నాడు. రిజర్వేషన్ దొరక్కపోతే జనరల్ బోగీలో వెళ్ళాలనీ, అలా వెళితే ఆ బోగీలో కూరుకుపోయి, వైజాగ్ చేరేసరికి పచ్చడైపోయి, ఒళ్ళు హూనమైపోయి ఆ అలసిసొలసిన ముఖంతో ఇంటర్వ్యూకి వెళితే ఉద్యోగం తనకి యివ్వకపోవటం ఖాయమని కూడా ప్రకటించాడు.

ఇలా అభిషేక్ ప్రయత్నాలు సాగుతూండగా జగదీష్ హుందాగా ఆ టి.టి. దగ్గరికి నడుచుకుంటూ వచ్చాడు. జగదీష్‌తో పాటు వచ్చిన ఓ కుర్రాడు మూడువదుల కాగితాలు టి.టి చేతుల్లో పెట్టి బెర్త్ కావాలన్నాడు.

టి.టి జగదీష్‌కి ఏదో బెర్త్ నెంబర్ చెప్పి కూర్చోమన్నాడు.

అభిషేక్‌కి తను చేసిన తప్పేమిటో అప్పుడర్థమైంది. వెంటనే టి.టి.ని పట్టేసాడు. "సార్... మీకు పదో ఇరవయ్యో ఎక్కువ యిస్తాను, కానీ యిప్పటికే నలభైరూపాయలు ఎక్కువ ఖర్చు పెట్టాను. నేనో నిరుద్యోగిని సర్! మీకు నా దగ్గర నుంచి తీసుకునే పదో ఇరవయ్యో పెద్ద లెఖ్ఖలోనివి కావు. కానీ నాకవి చాలా అవసరం సర్.

అవి లేకపోతే వైజాగ్‌లో తినటానికి ఏం మిగలదు... నాకు బెర్త్ యివ్వటానికి అదే అడ్డమయితే నా దగ్గరున్న డబ్బులో మీకు కావల్సినంత తీసుకోండి. మీదగ్గర బెర్త్‌లుండీ ముందుగా వచ్చిన నాకు యివ్వకుండా వెనకవచ్చినవాళ్ళకి ఈరకంగా యివ్వటం ధర్మమా! ఆలోచించండి సార్? అయినా ఫర్వాలేదు. నా బాధలు నేను పడతాను. మీకెంత కావాలి సార్"

పట్టువదలని అభిషేక్ వాలకం చూసి, రైలు కదులుతుండగా మరెవరూ రాకపోవటంతో "ఎక్కు" అని బెర్త్ నెంబర్ చెప్పాడు టి.టి.

మొత్తానికి ఎ.సి కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కి తన సీటుచూసి కూర్చున్నాడు అభిషేక్. చేతిలోవున్న సూట్‌కేస్ పక్కనే పెట్టుకున్నాడు. భుజాన ఓ సంచీ, ఏనాడో కొన్న ఓ జీన్స్



ప్యాంట్, దానిమీద కాటన్‌షర్ట్ యిదీ అభిషేక్ వాలకం. కూర్చున్న అభిషేక్ తలఎత్తి ఎదురుగావున్న బెర్త్‌లో ఎవరున్నారో చూశాడు. తన కంటే ఆలస్యంగా వచ్చి, దర్జాగా బెర్త్ సంపాదించిన వ్యక్తి, ఎ.సి చల్లదనాన్ని అనుభవిస్తూ ఏదో ఇంగ్లీషు మ్యాగజైన్ తిరగేస్తూ కనిపించాడు. జగదీష్ కూడా అభిషేక్‌నీ, అతనిసూట్‌కేస్‌నీ, భుజానవేలాడే సంచీనీ చూస్తూ "వీడెవడ్రా... పొరపాటున ఎ.సి బోగీలో ఎక్కలేదు కదా?" అనుకున్నాడు.

అభిషేక్ సూట్‌కేస్‌లోంచి ఓ దుప్పటి తీసి తన బెర్త్‌మీద పరుచుకున్నాడు.

అదంతా గుచ్చిగుచ్చి చూస్తున్నాడు జగదీష్. అభిషేక్ జగదీష్‌ని కొంచెం కోపంగా చూశాడు. "డబ్బుతో లోకంలో అన్నిటినీ కొనెయ్యాలనిచూసే ఇలాంటి మనుషులంటే తనకి ఎందుకో అసహ్యం. ఎందుకో ఏమిటి తన దగ్గర అంత డబ్బు వుండదనేమో" ఆ ఆలోచనకు నవ్వుకున్నాడు అభిషేక్.

రైలు స్పీడందుకుంది.

జగదీష్ అభిషేక్ తనతో ఎక్కడ మాట్లాడటానికి ప్రయత్నిస్తాడా అనుకుంటూ అలాంటి అవకాశమే రాకుండా జాగ్రత్తపడుతున్నాడు. జగదీష్‌కి అభిషేక్ వాలకం నచ్చలేదు.

అభిషేక్‌కి జగదీష్ చూపులు అర్థమవుతున్నాయి. తన వస్తువులనీ, తననీ చూసిన చూపులు తనని కనీసం మనిషిగానైనా గుర్తించలేనివిగా వున్నాయి. ఆ చూపులు అభిషేక్‌ని కొంచెం కలవరపెట్టినా, తాను యిలాంటి చూపులెన్నో ఎక్కడెక్కడో ఎదుర్కొనే వున్నాడు. తనకంటే చాలాముందు పుట్టి, ఉద్యోగాలకు పోటీలేనికాలంలో ఉద్యోగాలు సంపాదించి ఆపైన అధికార్లయి, ఉన్నతాధికారులై నిరుద్యోగుల్ని మనుషులుగా గుర్తించక అధికారదర్పంతో ఇంటర్వ్యూల పేర మేథస్సు మీద జరుపుతున్న హింసాకాండని ప్రత్యక్షంగా అనుభవించాడు. బాధ్యతారాహిత్యం పెచ్చు పెరిగిపోతున్న ఈరోజుల్లో స్వార్థావసరాలకే పనులుచేస్తూ ప్రజలు మౌలిక, జీవన హక్కులనే మర్చిపోయేటట్టు ప్రవర్తించే అనేక మందిని చూశాడు. కానీ ఎ.సి. సెకండ్‌క్లాస్‌లో ధనం బలంతో తనకంటే ఆలస్యంగావచ్చినా ముందే సీటు సంపాదించిన ఈ ఘరానా మనిషి తనకేసి ఎందుకలా చూస్తున్నాడు?

తోటిమనిషిని మనిషిగా గుర్తించాలంటే డబ్బే ప్రామాణికమా లేక ఆడంబరం ప్రధానమా?

తనతో మాట్లాడకూడదన్నట్లుగా వుంది జగదీష్ ప్రవర్తన. కానీ "ఏమైనాసరే ఆ వ్యక్తితో మాట్లాడాలి" అనే నిర్ణయించుకున్నాడు తను.

మనిషిని మనిషిగా చూడాలేకానీ వేషభాషలు, ధనబలం ప్రమాణంగా ప్రవర్తించకూడదనే భావాన్ని ఆ వ్యక్తిలో కలిగించాలి" అనుకున్నాడు "హూ ఇజ్ దిస్ థర్డ్‌ఫెలో! వీడు నాకేసి చూస్తున్నాడే?..." అనుకున్నాడు జగదీష్.

తప్పనిసరి పరిస్థితుల్లో ఈ ట్రైన్ ఎక్కాల్సివచ్చింది. ఆ ఫ్లైట్ కేన్సిల్ కాకుండాఉంటే బావుండేది. అయినా ఫస్ట్‌క్లాస్ ఎ.సి టికెట్ తీసుకోవాల్సింది తను. ఎందుకులే ఫ్లయిట్ టికెట్ ఖరీదుపెట్టి రైల్లో ప్రయాణంచేయటం అని వూరుకున్నాడు. కానీ సెకండ్ క్లాస్ ఎ.సి.లో యిలాంటి అర్థమైనవాళ్ళు ఎక్కుతారనుకోలేదు. పోనీ యిప్పుడు ఫస్ట్‌క్లాస్ ఎ.సి.కి మార్చుకుంటే... నో నో... వీడి గురించి తనెందుకు మారాలి. వీడిని దూరంగా వుంచితే చాలు. ఇలా ఆలోచిస్తున్నాడు జగదీష్. కాజీపేట వచ్చేవరకూ కనీసం తన వైపు చూడటానికి కూడా అవకాశం ఇవ్వకుండా మాగజైన్ అడ్డంపెట్టుకున్నాడు జగదీష్. ఏమీ కనబడని ఎ.సి అద్దం కిటికీవైపు చూస్తూ కూర్చున్నాడు. కాజీపేట దాటి రైలు సాగగానే లైట్ ఆర్పేసి నిద్దర రాకపోయినా పడుకున్నాడు జగదీష్.

అవతలవ్యక్తి తనని పూర్తిగా విస్మరిస్తున్నాడనే భావనే అభిషేక్‌ని బాధిస్తోంది. ట్రైన్ మహబూబాబాద్ దాటేలోగా రెండుసార్లు తన బెడ్‌లైట్‌వేశాడు అభిషేక్. ఆ సమయంలో అసహనంగా కదిలాడు జగదీష్. పడుకుని వున్న జగదీష్ కదలికలోని భావాన్ని అర్థంచేసుకున్న అభిషేక్ లైట్ ఆర్పేసాడు. అలవాటులేని ఎ.సిలో నిద్రవెంటనే రాకపోయినా ఆ చల్లదనానికి అభిషేక్‌కి తెలియకుండానే నెమ్మ




దిగా నిద్రపట్టేసింది. అభిషేక్ నిద్రలేచేసరికి ఎక్స్‌ప్రెస్ గోదావరీ నదిని దాటేసి సామర్లకోట జంక్షన్‌లో ఆగివుంది. అప్పటికే జగదీష్ లేచి చాలాసేపయింది. టిప్‌టాప్‌గా తయారై కూర్చున్నాడు. అభిషేక్ లేచి మొహం కడుక్కునేలోగా రైలు పిఠాపురం పొలిమేర్లలోకి వచ్చేసింది. జగదీష్ సామర్లకోటలో వార్తా పత్రికలు కొనుక్కున్నాడు. దొరికిన అన్ని తెలుగు, ఇంగ్లీషు దినపత్రికలు తీసుకున్నాడు. ఆ వార్తా పత్రికలకేసి ఆశగా చూశాడు అభిషేక్. మరింత బిగుసుకుపోయాడు జగదీష్. జగదీష్ ఏదో తెలుగు పేపరు తిరగేస్తుండగా యిక ఆగలేని అభిషేక్ "హిందూ" అని మెల్లగా జగదీష్‌వైపు వినిపించేలా అన్నాడు. జగదీష్ అతనివైపు చూశాడు. "నువు ఇంగ్లీషు పేపరు చదువుతావా?" అన్నట్లు వున్నాయి ఆ చూపులు. మళ్ళీ "హిందూ ఓసారిస్తారా" అని కొంచెం గట్టిగా అడిగాడు అభిషేక్.

ఇవ్వకపోతే యింకా ఏం మాట్లాడిస్తాడో అన్న కంగారుతో "టేక్ఇట్" అని హిందూపేపర్ అభిషేక్‌కి యిచ్చాడు జగదీష్.

కానీ ఆ టేక్ ఇట్ అన్న పదప్రయోగం, అలా అంటూ చూసిన చూపులు ఏదోలావున్నాయి.

'ఇళ్ళల్లో పెంచుకునే కుక్కలకు కూడా అంతకన్నా సౌమ్యంగా బిస్కట్లు అందిస్తారేమో' - అనుకున్నాడు అభిషేక్.

పేపర్ అంతా తిరగేసి తిరిగి యిచ్చేస్తూ అన్నాడు అభిషేక్ "థాంక్స్". జగదీష్ దాన్ని అనహ్యించుకున్నట్లుగా రిసీవ్ చేసుకున్నాడు. అభిషేక్ మనసుకి దెబ్బ తగిలింది. కానీ పైకి ఏ మాత్రం చెక్కుచెదరలేదు.

"మీరు వైజాగ్ వరకూ వస్తున్నారా?" కావాలనే అడిగేడు అభిషేక్. "యా!" అన్నాడు జగదీష్ అభిషేక్ వైపు కన్నెత్తయినా చూడకుండా. నీకెందుకురా" అన్నట్లు వుంది ఆ "యా" అన్న విధానం.

అదలాగే వుంటుందని ముందే వూహించిన అభిషేక్ "మీకు వైజాగ్ బాగా తెలుసా?" మరో ప్రశ్నవేశాడు. జగదీష్ తలెత్తి అభిషేక్‌కేసిచూశాడు. వీడు నాతో మాట్లాడకుండా వుండేటట్టు లేడు. నా మౌనాన్ని వీడు తప్పుగా అర్థంచేసుకుంటున్నాడేమో! వీణ్ణి అసలు మాట్లాడకుండా చెయ్యాలంటే ఓసారి వాయించెయ్యాలి. మళ్ళీ నాతో మాట్లాడకుండా చెయ్యాలి అనుకున్నాడు మనసులోనే.

"నువ్వెక్కడికెళ్ళాలి?" అని అడుగుతూ నాకు వైజాగ్ తెలిస్తే నీకెందుకురా, నీ ఏడుపేదో నువ్వేడు అన్నట్లు చూశాడు జగదీష్.

జగదీష్ మాటనీ, చూపునీ లెక్కచెయ్యకుండా పక్కనేవున్న మరో ప్రయాణికుడిని "ట్రైన్ వైజాగ్ ఎన్నింటికి చేరుతుంది?" అని అడిగాడు అభిషేక్.

సమాధానం విన్న అభిషేక్ మళ్ళీ జగదీష్ వైపు తిరిగి "నేను వైజాగ్ ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లోవున్న జి.కె.కంపెనీకి వెళ్ళాలి మధ్యాహ్నం రెండు గంటలకి ఇంటర్వ్యూ. స్టేషన్ నుంచి ఆ కంపెనీకి ఎంత దూరం వుంటుంది?" అభిషేక్ మర్యాదపూర్వక పదాలైన "గారూ' 'అండి' 'మీరు' తీసేసి అడిగాడు. "నువ్వు, నన్ను 'నువ్వు' అన్న తర్వాత నిన్ను నేను 'అండి' అని గౌరవిస్తానా? నా సంగతి నీకు తెలీదు- గివ్ రెస్పెక్ట్ అండ్ టేక్ రెస్పెక్ట్' అని అన్నట్లుగానే అభిషేక్ జగదీష్ వైపు చూశాడు.

జగదీష్‌లో కొద్దిగా సంచలనం కలిగింది. 'జి.కె' అని ఒక్కసారి మనసులో అనుకున్నాడు.

"జి.కె అనే పేరుతో ఏ కంపెనీ లేదు. నువ్వు ఇంటర్వ్యూ కార్డు సరిగ్గా చూసివుండవ్"

అభిషేక్‌ని మరీ దారుణంగా 'నువ్వు' అనడమేకాకుండా 'నీకు ఇంటర్వ్యూ కార్డు చూడటం కూడా రాదురా ఫూల్' అన్నంత పోజు పెట్టాడు జగదీష్.

'నే...' బహుశా నీకు తెలీదేమో. జి.కె.ఎస్టేట్ అని క్లియర్‌గా మెన్షన్ చేశారు. అది చాలా ఫేమస్ అని కూడా కొందరు చెప్పారు" అభిషేక్ గ్యారంటీగా చెప్పాడు.

"ఓహో... అదా! జి.కె.ఎస్టేట్‌నాట్ జి.కె.కంపెనీ, అందులో చాలా ఫ్యాక్టరీలు వున్నాయి. అక్కడ నిన్నేం ఉద్యోగానికి పిలిచారు?" అని అడుగుతూ" జి.కె.ఎస్టేట్‌లో నీకు ఉద్యోగమా అన్నట్లు చూశాడు, జగదీష్.

అంతవరకూ ఓపికపట్టిన అభిషేక్‌కి చిరా

కువేసింది. వీడేదో డబ్బుతో మదించినట్లున్నాడు లేదా పేదరికాన్ని చూసి అసహ్యించుకునే బాపతుకావాలి. వీడెందుకు అనవసరంగా నన్ను హీనంగా, నీచంగా చూస్తున్నాడు? నేను వాణ్ణి ఇప్పటికీ మనిషిలాగే గుర్తిస్తున్నానే. వాడికి మర్యాద ఇస్తే 'అది తన హక్కు' అన్నట్లుగా ప్రవర్తించాడు. నాకు మర్యాద యివ్వకపోగా 'ఆ హక్కు నాకులేదన్నట్లుగా' వ్యవహరిస్తున్నాడు. ఏమిటి వీడి స్వభావం?" అని మనస్సులో అనుకుంటూ జగదీష్‌ని ఓసారి తీవ్రంగా పరికించాడు.

జగదీష్‌ది ఇంచుమించు తన వయసే! హెూదా వుంటే వుండొచ్చు. అయితేమాత్రం యిలా ప్రవర్తిస్తాడా? వీడి దృష్టిలో వాడి సమాన స్థాయిలో వున్నవాళ్ళు తప్ప మిగతావాళ్ళు పురుగులా? ,అభిషేక్ మనసంతా ఆవేశంతో



నిండిపోయింది.

"జి.కె.ఎస్టేట్ వాళ్ళకి సమర్థవంతులైన సేల్స్ ఎగ్జిక్యూటివ్స్ కావాలని, నాకు ఫస్ట్‌క్లాస్ ఫేర్‌కూడా యిస్తామని యింటర్వ్యూకి పిలిచారు" అని ముక్తసరిగా చెప్పి ఈ దేశంలో నాలాంటివాళ్ల సమర్థతవల్లే నీలాంటివాళ్ళు తయారవుతున్నట్లు చూశాడు అభిషేక్. ఒక్కసారిగా జగదీష్ వికటాట్టహాసం చేసినట్లు నవ్వాడు. అందులో హేళన, జుగుప్స, తేలిక భావం, మరెన్నో భావాలూ కనిపించాయి అభిషేక్‌కి.

తన నవ్వులోంచి అభిషేక్ తేరుకునేలోగా జగదీష్ విజృంభించాడు-

"వాళ్ళు ఫస్ట్‌క్లాస్ ఫేర్ యిస్తామంటే నువ్ సెకండ్‌క్లాస్ ఎ.సి.లో ఎక్కావా? పైగా సేల్స్ ఎగ్జిక్యూటివ్ పోస్ట్‌కి ఇంటర్వ్యూకి వెళుతున్నావ్? నీకా పోస్ట్‌గురించి తెలీదు కాబోలు. తక్కువఖర్చుపెట్టి ఎక్కువ లాభాలు కంపెనీకి చూపించాల్సిన పోస్ట్ అది. నువ్వు ఇంటర్వ్యూకి..." ఆగాడు జగదీష్.

అభిషేక్ యింకా తేరుకోలేదు.

"సరే... మరి నువ్వు ఆ ఉద్యోగానికి సరిపోతాననుకుంటున్నావా?" మళ్ళీ అడిగేడు జగదీష్.

జగదీష్ వేసిన ప్రశ్న అభిషేక్ చంపమీద ఛెళ్ళుమనిపించి ఈ లోకంలో పడ్డాడు.

"ఆ సందేహం నీకెందుకొచ్చింది?" అడిగాడు అభిషేక్.

"నిన్నుచూసిన ఎవడికైనా వస్తుంది. నీ అంత సమర్థులు లేరని ఆ కంపెనీవాళ్ళు నిన్ను పిలిచినట్లు మాట్లాడుతున్నావ్. నీలాంటి వ్యక్తులు లేకపోతే ఆ ఎస్టేట్‌కి నష్టం వస్తుందనుకుంటున్నావా? ఇంతవరకూ నువ్వు లేకుండానే ఆ కంపెనీ నడుస్తోంది. అయినా ఈరోజుల్లో ప్రతివాడూ నా అంతవాడు లేడనుకుంటున్నాడులే" జగదీష్ విదిలించినట్లుగా మాట్లాడుతున్నాడు.

"అలాంటివాళ్ళల్లో నువ్వూ ఒకడివని నేనంటాను. కంపెనీలు, సంస్థలు, వ్యక్తుల మీద ఆధారపడుతుంటాయి అలాగే వ్యక్తులు కూడా వాటిమీదే ఆధారపడతారు! అభిషేక్ జగదీష్‌ని అవుతూ ఆవేశంగా అన్నాడు "నా సమర్థత తేల్చాల్సింది కంపెనీవాళ్ళు, నువ్కాదు" కొట్టినట్లుగా చెప్పాడు అభిషేక్.

"నీ మాటలధోరణిబట్టిచూస్తే చెప్పచ్చు నీకు ఉద్యోగం రాదని. అయినా నీతో వాదనేమిటిలే" నేరుగానే అనేశాడు జగదీష్ అభిషేక్‌ని సూటిగా చూస్తూ.

"ఛీ... ఛీ నీతో మాత్రం నేను వాదిస్తానా! మనిషిని మనిషిగా చూసే సంస్కారంలేని నీతో నాకేమిటి" అభిషేక్ వెంటనే జవాబు చెప్పాడు. అందులో 'నోర్మూసుకొని కూర్చో' అనే అర్థం వచ్చేట్లుగా అన్నాడు.

జగదీష్ ముఖంలో కోపం తాండవించింది. మనిషి అసహనంగా కదిలాడు. "ఆఫ్టాల్! ఒక ఎడ్రస్‌లేనివాడు నన్ను ఇంతమాట అంటాడా! ఛ... చీప్ మనుషులు! వీళ్లు ఎంతకయినా తెగిస్తారు! ఇలాంటి చీప్ ఫెలోస్‌ని పట్టించుకోకూడదు" దృఢంగా నిర్ణయించుకొన్న జగదీష్ వైజాగ్ స్టేషన్ వచ్చేవరకూ కోపాన్నీ ఆవేశాన్నీ కళ్ళతోనే కక్కుతూ కూర్చున్నాడు.

వైజాగ్ స్టేషన్‌లో రైలు ఆగగానే అభిషేక్ జగదీష్‌వైపు ఓ అసహ్యకరమైన చూపు చూసి దిగిపోయాడు. ప్యూన్లు, మరెవరో వచ్చి జగదీష్ సూట్‌కేస్, బ్రీఫ్‌కేస్‌లను అందుకొన్నారు. ఠీవిగా స్టేషన్ దాటి బయటికి వచ్చేటప్పటికి కారు రెడీగా ఉంది జగదీష్‌కి. డ్రైవర్ డోర్ తెరచి నుంచుంటే జగదీష్ కూర్చున్నాడు. కారు సాగిపోయింది.

విశాఖపట్నం ద్వారకానగర్‌లో ఎవరో దూరపు బంధువులు ఉంటే వాళ్లింటికి రిక్షా కట్టించుకున్నాడు అభిషేక్.

కార్లో వెళుతున్న జగదీష్‌కి అభిషేక్ పదేపదే గుర్తుకొస్తున్నాడు.

అభిషేక్‌కిమాత్రం అలాంటి వ్యక్తులూ... అలాంటి ప్రవర్తనలూ మామూలే. తాత్కాలికంగా కొంత బాధపడినా వెంటనే మరచిపోతాడు. అవన్నీ మరచిపోకపోతే ముందుకు సాగలేమనే నమ్మకం అభిషేక్‌ది.

రిక్షా ఓ యింటిముందు ఆగింది. ఆ దూరపు బంధువులు వెంటనే గుర్తుపట్టడంతో తేలికపడ్డాడు అభిషేక్. స్నానం ముగించేసరికి




పదిన్నర దాటుతోంది.

మొహమాటపడి ఏదో భోజనం చేశానని పించాడు అభిషేక్. ఆ మాటా ఈ మాటా మాట్లాడి బయటపడ్డాడు.

ఇంటర్వ్యూ స్థలం ఎడ్రస్ కనుక్కుని రెండు బస్సులు మారి ఆ ఎస్టేట్‌లోకి అడుగు పెట్టేసరికి మధ్యాహ్నం ఒంటిగంటయింది.

అప్పటికే కొంతమంది ఎక్కడ ఈ ఉద్యోగం ఇంకెవరికైనా పోతుందేమోనన్న కంగారుతో కాబోలు ముందే వచ్చేశారు. వారిలో ఒకరిద్దరితో అభిషేక్ కబుర్లలోపడ్డాడు. పది పోస్టులున్నాయట. యాభైమందిని పిలిచారట. కనీసం ముప్పైమందైనా రావచ్చు.

వాళ్ల అంచనాలు, ఆ లెక్కలూ చూసి ఆశ్చర్యపడలేదు కానీ జాలిపడుతూ కూర్చున్నాడు అభిషేక్.

ఇద్దర్లో ఒకడు అభిషేక్‌ని కాఫీ తాగుదాం రండి అంటూ పిలిచాడు. ముగ్గురూ కలిసి కంపెనీ కేంటిన్‌లో కూర్చుని కాఫీ తాగారు. ఇక అక్కడ చర్చ ప్రారంభమైంది. ఉద్యోగం వస్తే జీతాల వివరాలూ, ఇంటర్వ్యూలో అడిగే ప్రశ్నల వైనాలు, రికమండేషన్ల గోలలు, గతంలో తమ ఇంటర్వ్యూలు, వాటిల్లో జరిగిన అన్యాయాలూ చెప్పుకున్నారు.

ఎక్కడ ఏ ఇంటర్వ్యూ జరిగినా దానికి హాజరయ్యే అభ్యర్థుల ఇంటర్వ్యూకి ముందు బ్యాచ్‌లుగా గుమిగూడటం, ఇంచుమించు ఒకేరకమైన అంశాలను మాట్లాడటం సర్వసాధారణం.

సరిగ్గా రెండుగంటలకి ఇంటర్వ్యూలు ఆరంభమయ్యాయి. అభ్యర్థులు లోపలికి వెళుతున్నారు, వస్తున్నారు. బయటకు వచ్చినవారిని వెళ్లబోయేవాళ్లు చుట్టుముట్టి ఎలాంటి ప్రశ్నలడుగుతున్నారో కనుక్కొంటున్నారు. ఇవన్నీ దూరంనుంచే పరిశీలిస్తున్న అభిషేక్ సన్నగా నవ్వుకొన్నాడు. అతను అలా మందకొడిగా ఉండటం చూసి కొందరు జాలిపడుతున్నారు.

"ఏ రికమండేషనో పట్టివుంటాడు! అందుకే అలా దూరంగా కూర్చున్నాడు. ఇలాంటివాళ్లే గురూ కామ్‌గా వచ్చి ఉద్యోగాలు కొట్టేస్తారు" తనకు ఉద్యోగం దొరకదేమోననే కోపంలాంటి బాధతో అన్నాడు ఒకతను.

"తనూ వాళ్లల్లో ఒక్కడే" అని అరవాలనిపించింది అభిషేక్‌కి. వాళ్లకి అలా అనిపించినందుకు నవ్వుకొన్నాడు. ఎలాగైనా ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకోవాలనే తనలాంటి అనేకమంది ఎలా తంటాలు పడుతున్నారో, ఎలా ఆలోచిస్తున్నారో తలచుకొని బాధగా నవ్వుకున్నాడు.

అంతలో "అభిషేక్... అభిషేక్ ఎవరయ్యా?" కోర్టులో ముద్దాయినో, నిందితుడినో పిలిచినట్టు అరిచాడు ఓ ప్యూను.

అభిషేక్ సీటులోంచి లేచి అందరికేసి నవ్వుతూ చూస్తూ ఇంటర్వ్యూ గది తలుపు నెమ్మదిగా తోసుకుని లోపలకి అడుగుపెట్టాడు.

అంతే...

అభిషేక్ నెత్తిమీద పిడుగుపడ్డట్టు అనిపించింది.

ఆ గది ముక్కలై ఎగిరిపోయినట్టనిపించింది.

ఇంటర్వ్యూ చెయ్యటానికి వచ్చిన మిగతా వాళ్లు కనుమరుగయ్యారనిపించింది.

అభిషేక్ కళ్లముందు ఒకే ఒక వ్యక్తి ఓ భారీ సింహాసనంమీద కూర్చున్నట్టనిపించింది.

ఆ వ్యక్తి చేతిలో యమపాశంలా, చిత్రగుప్తుని చిట్టాలా ఓ ఫైలుంది.

ఆ వ్యక్తి అభిషేక్‌ని చూసిన మొదటి చూపుకే ఆ ఉద్యోగం తనకు రాదని నిర్ణయించేసుకున్నాడు అభిషేక్.

దానిక్కారణం ఆ వ్యక్తి జగదీష్ కావడమే.

"నీపేరు అభిషేకా?" జగదీష్ కంఠం మోగింది.

"యా"

"నువ్ ఎం.ఎ చదివావా?" అది చదివే శక్తుందా నీకు అన్నట్లుంది ఆ ప్రశ్నించిన తీరు.

"ఆ... అవును" అదో లెక్కలోనిది కాదులే అన్నట్లుంది అభిషేక్ సమాధానం.

"ఇంతకాలం ఉద్యోగం లేకుండా ఎలా

వున్నావ్?''

"నిరుద్యోగిలా"! అభిషేక్ సమాధానం సూటిగా వుంది.

"అది నీఫైలు చూస్తూనే తెలుస్తోందిలే! నీకు ఉద్యోగం ఎందుకు రాలేదు?'' కొంచెం కటువుగా అడిగాడు జగదీష్.

"ప్రతీ ఇంటర్వ్యూలోనూ ఇలాంటి ప్రశ్నే వేస్తున్నారు కనుక''

"మరిలా సమాధానాలు చెపితే నీకు ఉద్యోగం ఎవడిస్తాడు! అందుకే ఎక్కడా పనిదొరక్క ఎవడైనా రైలు ఖర్చులిస్తే ఇంటర్వ్యూలకి ఎగబడతావేమో... అసలు నీది కాదు తప్పు! ప్రతివాడికీ డిగ్రీలు, పోస్ట్‌గ్రాడ్యుయేషన్లు పంచే యూనివర్శిటీని అనాలి''. జగదీష్ ఆగాడు.

"నా చదువు... నీ చదువు... ఎవరిదైనా ఒకటే! నా చదువుకీ, నీ చదువుకీ పనికివచ్చే ఉద్యోగాలు మనదేశంలో లేవు! చదువుతో సంబంధంలేని ఉద్యోగాలు చేస్తున్నారు నూటికి ఎనభై శాతం!.... నా చదువు ఎలాంటిదైనా - ఇంటర్వ్యూలో అది నీకెలా పనిచేస్తుందో తెలుసుకో! తెలుసుకుని.... నీ దగ్గరున్న ఉద్యోగానికి సంబంధించిన ప్రశ్న వెయ్యి''. అభిషేక్‌కి ఉద్యోగం ఎలాగోరాదని తెలిసి ఛాలెంజ్ చేశాడు.

"షటప్! నేను నిన్ను... ఏం అడగాలో... నాకే చెబుతున్నావా? నీ తలపొగరు నా దగ్గరకాదు! ఇది గవర్నమెంట్ ఉద్యోగం అనుకున్నావేమో... చూడు మిష్టర్ ప్రయివేట్ కంపెనీలో సామర్థ్యం ముఖ్యం! నీలాంటి పనికిమాలిన వాదనలతో కాలం గడిపేవాణ్ణి తీసుకుని, కంపెనీ పేరు పాడుచేసుకోదల్చుకోలేదు''. జగదీష్‌లోని ఆవేశం కట్టలు తెంచుకొంది.

"యూ ఆల్‌సో షటప్!... హు... నాకు తెలుసు!... నువ్వీ కుర్చీలో కూర్చున్నప్పుడే అనుకున్నాను నువ్వే విధంగా ప్రవర్తిస్తావో! నీలాంటివాళ్ళ సంస్కారం ఎలా వుంటుందో నేను రీసెర్చి చేశాను! చూడు... నాలాంటివాడు నీకు నే ఒక్కణ్ణే తగిలుండచ్చు! కానీ... నీలాంటివాళ్ళని నేను చాలామందిని ఫేస్ చేశాను''.

"యూ డర్టీ ఫెలో గెటౌట్! గో అండ్ టేక్ ఫస్ట్‌క్లాస్ ఫేర్స్! ఎవడో అడుక్కుతినేవాడికి వేశాను అని అనుకుంటాను! డోంట్ షో యువర్ డర్టీ ఫేస్ ఎనీ మోర్!''. జగదీష్ ఆవేశంతో అరిచాడు.

"యస్! సేమ్ ఫేస్'' విమానంలో కూర్చుని వున్న జగదీష్ అనుకున్నాడు. విమానం మేఘాలలో కలసిపోయింది.



ఎయిర్‌పోర్ట్ నుంచి యింటికి కార్లో వస్తున్న అభిషేక్‌కి కూడా పాత సంఘటనలు గుర్తుకొచ్చాయి.

ఆరోజు... తనని ఇంటర్వ్యూ రూంలోంచి గెంటేసిన రోజు. మనసులో ముళ్ళు, కళ్ళల్లో నీళ్ళు తిరుగుతూండగా చివాలున లేచి బయటికి వచ్చేశాడు. గుండెల్లో బాధ కార్చిచ్చులా మండింది. ఆవేశం మాట్లాడనివ్వలేదు.

ఆ సంఘటన! ఆ అనుభవం! అభిషేక్ జీవితంలో మొదటిసారిగా ఎదురైంది. ఎన్నో ఇంటర్వ్యూలలో ఎన్నెన్నో ఈసడింపులూ, హేళనలు, హింసలు చూశాడు. కానీ ఆ ఇంటర్వ్యూలో ధనమదం తాలూకు అనవసరమైన ఆవేశానికి తాను బలయ్యాడు.

ధనికుడికి పేదవాడు, పేదవాడికి ముష్టివాడు, ముష్టివాడికి మరో ముష్టివాడు అసహ్యంగానే కనబడతారు. ఈ దేశంలో ఎవరు మరొకర్ని ఎందుకు ద్వేషిస్తారో చెప్పలేం. మతమని, కులమని, శాఖోపశాఖలని వ్యక్తుల్ని విడివిడిగా విభజించి అనవసరంగా ద్వేషించడం అనవాయితీ అయిపోయింది.

జగదీష్ కేవలం ధనమదంతోనే తనని ద్వేషించి అసహ్యించుకున్నాడా?





కాదు... అదొకటే కారణం కాదు.

మరేమిటి?

తన వాదనలా?

అంటే జగదీష్ మాటకు ఎవరూ ఎదురు చెప్పకూడదా?

సమాధానం చెప్పినవాడు పనికిమాలిన వాడా?

ఎక్కడో బ్రెయిన్‌లో తలవనితలంపుగా కలసి తనెవరో, ఏమిటో తెలియకుండానే అసహ్యాప డి, తను మాట్లాడితేనే తప్పుగా భావించి ఆపైన ఇంటర్వ్యూలో ఈ విధంగా దారుణ అవమానానికి గురిచేస్తాడా? హు!

ఫస్ట్‌క్లాస్ ఫేర్ ముష్టిట! ఆ వెధవ డబ్బు తీసుకోకూడదనుకున్నాడు... కానీ... వాడి పొగ రుబోతు మాటలకి తాను ఆవేశపడి డబ్బు తీసుకోకుండా వెళితే తన అన్నగారు?...

తన దగ్గర డబ్బులేకపోయినా తమ్ముడికి ఉద్యోగం వస్తుందేమోనన్న ఆశతో అప్పుచేసి ఇంటర్వ్యూకి పంపించాడు. అలాంటి అన్న గారి దగ్గరికి వెళ్ళి జరిగిన విషయం చెపితే పైకి ఏమీ అనకపోయినా మనసులో ఎంత బాధ పడతాడో!

తన చదువు వ్యర్థమని అనిపించింది అనా డు అభిషేక్‌కి. తెలివితేటలు చెల్లని చిత్తు కాగితాలనిపించింది. ఉద్యోగం లేని తను ఏంమాట్లాడినా లోకం అతితెలివంది. ఇంట ర్వ్యూల్లో జరుగుతున్న దారుణాలు చెప్పినా చేతకాని మాటలన్నారు. కనీసం అడ్డదారి తొక్క డానికి కూడా నోచుకోలేకపోయాడతడు.

ఆరోజు మాత్రం అతను అవమానభారంతో, ఆలోచనల బరువుతో కుచించుకుపోయాడు. తనని ఎవరో పాతాళంలోకి బలవంతంగా తొక్కేసినట్లయింది.

అందుకే...

ఎన్ని ఆలోచనలు అతని మస్తిష్కాన్ని దొల చినా, అవమానం ఎంతగా కృంగదీసినా, ఆవేశం మనసుని ఒక ఊపు ఊపినా, ఆ డబ్బు తీసుకున్నాడు అభిషేక్! అతని హృద యంలో చెలరేగిన బాధా, ఆవేశపు కెరటాలు సముద్ర కెరటాలని మించిపోయినట్లు వున్నా హృదయంలో బడబాగ్ని రేగినా! అవన్నీ అనుభవిస్తూ ఏం చేయలేని దిక్కుతోచని స్థి తిలో తిరిగి వచ్చేశాడు భాగ్యనగరానికి.

'దిగండి సార్... యిల్లు వచ్చేసింది" - అన్న కారుడ్రైవర్ పిలుపుతో పాత జ్ఞాపకా ల్లోంచి బయటపడ్డాడు అభిషేక్.

* * *

భాగ్యనగరంలోని పంజాగుట్ట నుంచి వస్తూ బేగంపేట ఓవర్‌బ్రిడ్జి ఎక్కేముందు కుడి చేతి వక్కకు తిరిగితే కుందన్‌బాగ్ వస్తుంది. కుంద న్‌బాగ్‌లోని ఆధునికమైన మేడలు మంత్రుల వసతిగృహాలు.

ఆ మేడల్లోని ఒకదాంట్లో రాష్ట్ర నూతన మంత్రివర్గంలో స్థానం సంపాదించిన ఆర్.పి. రాయలు వున్నాడు. రాయలుకి కార్మికవర్గంలో నూ, పారిశ్రామికవేత్తల దగ్గర వున్న పలుకుబ డిని చూసి పరిశ్రమల శాఖను అప్పగించారు. ఆ జిల్లాలోని అధికారపార్టీఎం.ఎల్.ఏ.లు తమ కే మంత్రి పదవి కావాలని వర్గాలుగా విడిపో వటం గమనించి అందరికీ ఇష్టుడూ, నమ్మ తుడూ అయిన రాయలుని మంత్రిగా చేశారు.

హైదరాబాద్ వచ్చిన మర్నాడే పరిశ్రమల శాఖామంత్రిగా పదవీ బాధ్యతలను చేపట్టిన రాయల్ని చూసి అభినందించటానికి అనేక మంది ఆ అధికార వసతిగృహానికి వస్తూనే వున్నారు. కార్లతో యింటిబయటా, జనంతోనూ, పూలదండలతోనూ యింటి లోపలా నిండిపో యింది.

తను మంత్రవుతానని ఏనాడూ ఊహించలే దు రాయలు.

వయసూ, రాజకీయ అనుభవం వున్నా మంత్రిగా తనని ప్రజలూ, ప్రముఖులూ చూసే చూపులు కొత్త అనుభవాలను కలిగిస్తున్నాయి. ఎందరో ప్రముఖులు, ఎన్నెన్నో ఆహ్వానాలు, ఏ ఆహ్వానాన్ని మన్నించాలో, ఎవరితో ఏం మాట్లా డాలో, ఏ రకంగా ఎవరిని సంతృప్తిపరచాలో, ఈ హోదాలో ఎవరితో ఎలా ప్రవర్తించాలో... యిలాంటివి ఆలోచిస్తున్నాడు రాయలు.

అప్పటికే అభిషేక్‌ని రమ్మని రెండుసార్లు ఫోన్ చేశాడు. యింకా రాలేదు. అతనిమీద కోపం వస్తోంది రాయలుకి. ఫోన్‌లో వైజాగ్‌లైను కలపమన్నాడు. లైన్ కలవట్లేదనే చిరాకు మన

నులో వున్నా అభినందనల పరంపరలు అందించే జనాలని సాదరంగా ఆహ్వానిస్తూ, సంతోషంగా మాట్లాడుతూనే వున్నాడు రాయలు.

రాయల్ని అభినందించటానికి ప్రముఖ పారిశ్రామికవేత్త చంద్రశేఖర్, ఆయన కుమారుడు జగదీష్ వచ్చారు. వారిని సాదరంగా ఆహ్వానించాడు రాయలు. తండ్రీకొడుకులు రాయలకి ఎదురుగా కూర్చున్నారు.

అంతలో ఫోను మోగటంతో రాయలు అందుకునేలోగా పి.ఎ. కాబోలు అందుకుని "సార్... అభిషేక్, సర్" అంటూ వినయంగా రిసీవర్ని అందించాడు.

రాయలు ఆత్రంగా ఆ ఫోను అందుకున్నాడు. "ఏమిటయ్యా... వెంటనే రమ్మన్నానుగా! అక్కడ ఏం చేస్తున్నావ్? ఇదిగో ఈ మధ్యాహ్నం ఫ్లైట్కి వచ్చేసెయ్. ఇక్కడ చాలావనులు చూసుకోవాలి! వెంటనే బయల్దేరిరా" గబగబా ఆజ్ఞాపించాడు.

"అది కాదు సర్... మనవాళ్ళంతా మీ పేర సింహాచలంలో ఈ మధ్యాహ్నం పూజలు జరిపిస్తున్నారు. నేను తప్పకుండా వుండాలి. సాయంత్రం గోదావరికి బయల్దేరి వస్తాను" అవతలనుంచి అభిషేక్ కంఠం.

"పూజలుంటే నువ్వు బయల్దేరటానికి ఏమిటి అడ్డం?" రాయలు గట్టిగా అడిగాడు.

"మీరే అలాగంటే ఎలా సార్? మీరుండాల్సింది... కనీసం నేను కూడా లేకపోతే వాళ్ళంతా బాధపడతారు. నేను ప్రసాదం పట్టుకుని రేపు ఉదయం మీ దగ్గరుంటాను. దేవుడి కార్యం కదా సార్ ! మీరు కాదూ కూడదంటే వెంటనే బయల్దేరతాను"

"భలే ఇరకాటంలో పెట్టావయ్యా- ఊ... సర్లే పూజలు కానీ. నువ్ మాత్రం సాయంత్రం గోదావరిలో బయల్దేరిరా - రేపు ఉదయానికల్లా యిక్కడుండాలి... ఒకే" - రాయలు ఆగాడు.

"సరే - సార్" అభిషేక్ చెప్పాడు.

ఫోన్ క్రెడిల్ అయింది.

జగదీష్ కొంచెం అసహనంగా కదిలాడు- 'వీడు మంత్రయినా వాణ్ణి వదిలేటట్లు లేదు. వాడు లేకుండా వీడు మంత్రిగా పనిచెయ్యలేడా? ఛ ఛ... ఏం మంత్రులయ్యా వీళ్ళు' ! మనసులోనే అనుకున్నాడు జగదీష్.

"ఎవరండీ ఈ అభిషేక్?" చంద్రశేఖర్ రాయల్ని అడిగాడు.

"అభిషేకా"... చిన్నగా నవ్వాడు రాయలు. "విశాఖపట్నం యువనాయకుడు. చాలా తెలివైనవాడు. అసలు అలాంటివాళ్ళు జిల్లాకొకరుంటే మనరాష్ట్రం ఎంతో ముందుకుపోతుంది" రాయలు చెప్పుకుంటూ పోయాడు.

అది జగదీష్ వినకూడదనే వినలేదు.

కాని, ఎంత వినకూడదనుకున్నా అభిషేక్ని ప్రశంసిస్తున్న రాయలు మాటలు జగదీష్ చెవిని సోకి కర్ణకఠోరంగా ఫీలయ్యాడు. రాయలు తెలివితక్కువతనాన్ని తిట్టుకుంటూ "ఎందుకొచ్చాన్రా?" అని ఆలోచిస్తున్నాడు. మంత్రయిన రాయలు ఆవిధంగా ప్రవర్తించటం చూసి జగదీష్, రాయలుకు మంత్రి పదవి ఇచ్చినవాళ్ళని మనసులోనే దుయ్యబడుతున్నాడు.

ఎందుకో ఆ సంభాషణ ఆపిన రాయలతో అన్నాడు చంద్రశేఖర్

"మీరు మా యింటికి విందుకి రావాలి సార్"

"ఓయస్ తప్పకుండా... కానీ... ఒకటి... చాలామంది డిన్నర్కి పిలుస్తున్నారు. సమస్య ఎక్కడ వచ్చిందంటె 'లైన్అప్' చెయ్యాలి. రేపో ఎల్లుండో మీకు నేనెప్పుడు డిన్నర్కి వచ్చేది కబురుపెడతాను. వైజాగ్కే హైలైట్ అయిన మీరు రమ్మంటే రాకపోవటం జరగని పని. అసలు అభిషేక్ వుంటే యివన్నీ చక్కగా చూసుకునేవాడు. అతను వచ్చాక అతనే మీకు ఫోన్చేసి చెపుతాడు నేనెప్పుడొచ్చేదీ!... మీరు మరోలా భావించకండి! నాకు తెలుసు... మీరు నన్నర్థం చేసుకోగలరు"- రాయలు అర్థించినట్లుగా అన్నాడు.

"అంతమాటనకండి రాయలుగారూ... మీరింతలా చెప్పాలా. నేనే అభిషేక్కి ఫోన్చేసి కనుక్కుంటాను" చంద్రశేఖర్ అనునయంగా అన్నాడు.

"నీకేమయింది? ఇంతలా మాట్లాడుతున్నావ్. నీలెవెల్ అంతగా దిగిపోయిందా?"





అన్నట్లుగా తండ్రికేసి చూసి తీక్షణంగా కళ్ళు తిప్పాడు జగదీష్. చంద్రశేఖర్ అది పట్టించుకోలేదు.

అంతలో మళ్ళీ ఫోన్ మోగింది.

"చీఫ్ మినిష్టర్ గారింటి దగ్గర్నుంచి సర్" అంటూ మంత్రి వక్కన వినయంగా నిలబడిన వ్యక్తి రిసీవర్ మరోసారి తుడిచి రాయలకి అందించాడు.

రాయలు ఫోన్ అందుకుని- "హలో యస్ సర్... రాయలు స్పీకింగ్" అన్నాడు.

"--------"

"ఇప్పుడే బయల్దేరి వస్తున్నానని చెప్పండి సర్" అని ఫోన్ పెట్టేస్తూ "చంద్రశేఖర్‌గారూ... ముఖ్యమంత్రిగారు ఎందుకో పిలిచారట! నేనర్జెంట్‌గా వెళ్ళాలి. మీరేం అనుకోవద్దు. మీ యింటికి తప్పకుండా వస్తాను" యింకా పూర్తిగా అనకుండానే చంద్రశేఖర్ మధ్యలో అందుకుని- "తప్పకుండా రాయలు గారూ... మరి మేం సెలవ్ తీసుకుంటాం" - అని అంటూండగానే రాయలు హడావిడిగా లేచి కారెక్కటం కోసం పోర్టికోలోకి బయల్దేరాడు.

నిముషాలమీద కారు రావటం, రాయలు ఎక్కటం, కారు దూసుకుపోవటం జరిగిపోయింది.

"ఈయనేం మంత్రండీ? డిన్నర్‌కి పిలిస్తే వైజాగ్ నుంచి ఎవరో రావాలంటాడు... అసలు మంత్రి? వీడా వాడా? ఛీఛీ!... ఇలాంటివాళ్ళని మంత్రులలాగా ఎందుకు తయారుచేస్తున్నారో"... జగదీష్ కుర్చీలోంచి లేస్తూ తనలో అనుకున్నమాటలు, తన అసహనంచేత కొంచెం గట్టిగా వినిపించాయి.

"నువ్వుండరా... మంత్రి అయిన తర్వాత ఎవరైనా మంత్రే! మన జిల్లాలో మిగతావాళ్ళకన్నా రాయలు చాలా బెటర్. మనమాట వింటాడు. ఆ కొత్త ఫ్యాక్టరీ లైసెన్స్ తప్పనిసరిగా యిప్పిస్తాడు. ఇప్పటికే మూడేళ్ళు పెండింగ్‌లో వుంది. మనం ఆ చెత్తంతా ఆలోచించకూడదు, మనపని ఎలాచేసుకోవాలో చూసుకోవాలి, అంతే!" కొడుక్కు చెప్పాడు చంద్రశేఖర్.

"ఏమైనా డాడీ ఈయన మంత్రిలా ప్రవర్తించటంలేదు. అసలు ఆ అభిషేక్‌కీ ఈయన డిన్నర్‌కీ సంబంధం ఏమిటి? వాడొచ్చి మనకి డిన్నర్ డేట్ యిస్తాడట" జగదీష్ కోపంతో అన్నాడు.

"పోనీరా... అతనెవరో చాలా సమర్థుడనుకుంటాను. లేకపోతే మనం మాట్లాడుకున్న రెండుగంటల్లో ఓ ఇరవైసార్లన్నా అతని మాట తీసుకువచ్చారు రాయలుగారు. మంత్రులకి అలాంటివాళ్ళు వుండాలిలే. లేకపోతే ఇవన్నీ సంభాళించుకోవటం కష్టం"

చంద్రశేఖర్ చెపుతూండగానే మధ్యలో జగదీష్ అందుకొన్నాడు. "వాట్ డాడీ? మీరు కూడా వాడెవ్వడినో పొగుడుతున్నారు? అసలు వీడే ఒక పనికిమాలినవాడు. వాడు వీడికన్నా పనికిమాలినవాడు! యూ డోంట్‌నో... దీసీజ్ ఆల్ నాన్సెన్స్"

జగదీష్‌లో ఆవేశాన్ని చూసి చంద్రశేఖర్ అతన్ని అనవసరంగా మాట్లాడవద్దనీ, అది సమయం, సందర్భం కాదనీ నచ్చచెప్పాడు.

ఇద్దరూ బయల్దేరారు.

అంతసేపూ అక్కడే ప్రక్కనవుండి వాళ్ళ మాటలన్నీ విన్న రాయలు బావమరిది వాళ్ళకి ఎదురుపడ్డాడు.

"మీకు అభిషేక్ తెలుసా?" అన్నాడు జగదీష్ దగ్గరికి వచ్చి.

అప్పటివరకు అభిషేక్ గురించి కొడుకు ఎందుకు అంతలా మాట్లాడుతున్నాడో, అసలు అభిషేక్ గురించి జగదీష్‌కి తెలుసా? వాడికీ వీడికీ సంబంధం ఏమిటబ్బా! అన్న ఆలోచన వచ్చింది చంద్రశేఖర్‌కి. జగదీష్‌కేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"నాకు వాడెవడో తెలీదు. ఐ డోంట్‌నో దట్ ఫెలో... బట్ ఎవరో చెప్పారు. వాడొక గూండా అనీ, వైజాగ్‌లో పదిమంది అలాగ జనాన్ని వెంటేసుకుని తిరుగుతాడనీ చెప్పుకుంటారట! అలాంటి గూండాని రాయలు చేరదియ్యటం ఆయనకే దెబ్బ. వాడో ఫూల్! వాడిని చేరదీసేవాళ్ళు..." ఆగాడు జగదీష్.

ఓసారి ఆ కొత్తఅతన్ని చూసి అడిగాడు జగదీష్ "ఇంతకీ మీరెవరూ?"

... అభిషేక్ దగ్గరివాణ్ణి. ఐ విల్ టెల్‌యూ వన్‌థింగ్... మీరు అభిషేక్ గురించి తప్పుగా విన్నారు. ఎవరో ఏదో చెపితే ఇలా తిట్టటం పెద్దమనిషి తరహాకాదు! అతను చాలా సౌమ్యుడు. రాయలుగారికి కావల్సిన వాడు. అతనితోపాటు తిరిగేవాళ్ళు అలగా జనం కాదు! వాళ్ళే రాయలుగారిని గెలిపించిన ఓటర్లు. అభిషేక్ గూండా అని ఎవరి దగ్గరైనా అంటే అలా అన్నవాళ్ళ పని పట్టే పది పదిహేను కార్మిక సంఘాలకి నాయకుడు అభిషేక్. వీటన్నింటినీ మించి పదిమందికి సాయపడే మంచివ్యక్తి". జగదీష్‌ని చిత్తరువు చేసేవిధంగా రాయలు బావమరిది చెప్పుకుపోయాడు.

అంతా విన్న చంద్రశేఖర్ 'సారీ అండీ' అని జగదీష్ తరపున రాయలు బావమరిదితో చెప్పాడు.

అది సరిగ్గా వినకుండానే ఆ వ్యక్తి వేరే గదిలోకి వెళ్ళిపోయాడు.

"మీరెందుకు సారీ చెప్పారు" అని మళ్ళీ విజృంభించబోయాడు జగదీష్.

చంద్రశేఖర్ జగదీష్‌ని ఆపి, అక్కడనుంచి వెంటనే బయటపడ్డారు.

కార్లో కూర్చున్న జగదీష్ యింకా రాయల్ని, అభిషేక్‌నీ తిట్టడం మానలేదు. తనకున్న ఇంగ్లీషు పరిజ్ఞానంతో రాయల్ని ఉతికేశాడు. కొడుకు జగదీష్‌లో అలాంటి ప్రవర్తన ఎప్పుడూ చూడని చంద్రశేఖర్ అతనెందుకు అకస్మాత్తుగా అలా మారిపోయాడో అర్థంకాక ఆలోచనల్లోకి వెళ్ళాడు.

★ ★ ★

"అభిషేక్... ఆ నర్సయ్యగారి ఫైల్ కనిపించటం లేదట చూడు. ఈ రోజు ఆయన పని అయిపోవాలి. ఆ ఆర్డర్స్ ఇవ్వాళ యివ్వకపోతే పరువు వుండదు. నువ్వు కల్పించుకుని ఆ పని చూడు". రాయలు కోపంగా అన్నాడు.

"నరేసర్! ఆ ఫైల్ గంటలో మీ ముందుంటుంది. నో ప్రాబ్లెబ్‌సర్! ఇవాళ ఆర్డర్స్ ఋప్పించే ఏర్పాటు చేస్తాను". అభిషేక్ వినయంగా చెప్పాడు.

రాయలుకి ఎప్పుడు కోపం వచ్చినా ముందు మాటయిస్తేచాలు అతన్ని కూల్ చెయ్యొచ్చన్న విషయం అభిషేక్‌కి తెలుసు. ఇప్పుడూ అదే చేశాడు.

"సరే... నువ్ టిఫిన్ చేసావా?" అడిగాడు రాయలు.

"అయింది సర్... సార్... వైజాగ్ కెమికల్స్ వాళ్ళు వచ్చారు. ఇప్పుడు మాట్లాడతారా ? అభిషేక్ రాయలుకేసి చూశాడు.

"నేను మాట్లాడేదేముంది, నువ్వే ఏదో చెప్పు. ఎలాగైనా ఆ పని కనీసం ఓ నెలపట్టవచ్చు". రాయలు కళ్ళలో ఆ పని "నువ్వే చూసుకోవయ్యా" అన్నభావం కనబడింది.

"మరీ... ఆ పేపర్ ఇండస్ట్రీ బాపతు ఫైల్ క్లియర్ చేశారా?"

"అదీ... ఆ... ఏదో ఎక్స్‌ప్లనేషన్ అడిగారు అధికారులు. అదోసారి చూసి మళ్ళీ వస్తా"

"ఓకే సర్"

అప్పటికి అభిషేక్ హైదరాబాద్ వచ్చి 48 గంటలు అయింది. ఆ నలభై ఎనిమిది గంటలలో కనీసం 40 గంటలుగా రాయలు పనులే చూస్తున్నాడు. అభిషేక్‌లో చురుకుగా, తెలివిగా ఆలోచించే లక్షణమే రాయల్ని అమితంగా ఆకట్టుకుంది. అంతేకాదు ప్రమాదం కానీ, వివాదం కానీ తలెత్తే సూచనలుంటే ముందుగానే చెప్పేస్తాడు అభిషేక్. రాయలు దృష్టిలో అభిషేక్ ఓ కంప్యూటర్.

రాయల కళ్ళ సైగలనిబట్టి క్షణాలమీద విషయం గ్రహించేస్తాడు అభిషేక్. అనేకరకాల పనులమీద వచ్చే జనాన్ని ఓసారి చూస్తే చాలు వాళ్ళగురించి, వాళ్ళ ప్రవర్తన ఇట్టే చెప్పేస్తాడు. ఇది అభిషేక్ ఏ బడిలోనూ చదవలేదు. రాజకీయాన్ని రాజకీయంగా నడిపిస్తాడు. అభిషేక్ పక్కనుంటేచాలు ఏపనైనా అయిపోతుంది అనుకుని ఊపిరి పీల్చుకుంటూ వుంటాడు ఒక్కొక్కప్పుడు రాయలు. ఎంత గడ్డు సమస్యైనా సరే, క్షణాలమీద పరిష్కరించే అభిషేక్ తనకో ఎస్సెట్‌గా రాయలు భావిస్తాడు. అలా భావించటంలో ఏమాత్రం సిగ్గుపడడు. అభిషేక్ తననితప్ప మరెవరినీ ఆశ్రయించకూడదనే ఉద్దేశ్యంతో, అనవసరమని తెలిసినా, అతని విషయాలనీ, అతని సాకర్యాల గురించి అడిగి మరీ తెలుసుకుంటూ

వుంటాడు రాయలు.

రాయలకి అభిషేక్‌పట్ల వున్న అభిప్రాయం బాహాటంగా వ్యక్తం అవుతుంది. కానీ అభిషేక్‌కి రాయలపట్ల వున్న అభిప్రాయం మాత్రం ఎప్పుడూ బయటపడదు. రాయలు స్వభావాన్ని పూర్తిగా ఆకళింపు చేసుకున్న అభిషేక్ రాయలుకి ఎలాంటి నొప్పి కలగకుండా చెయ్యాల్సిన పనులుచేస్తూ, వీలులేని, చెయ్యకూడని పనులను జాగ్రత్తగా వేరేచోటికి బదిలీ చేస్తూంటాడు. ఎవరినీ నొప్పించకుండా అతిజాగ్రత్తగా తప్పించుకొనే అభిషేక్ అంటే రాయలకే కాదు, రాయల దగ్గరికి వచ్చేవారికి కూడా అభిమానం.

రాయలు మంత్రి అయిన మరుక్షణం నుంచే అతను మంత్రిగా మంచిపేరు తెచ్చుకోవటానికి తగిన పథకాలను తయారుచేస్తున్నాడు అభిషేక్. అది గమనిస్తూనే వున్నాడు రాయలు.

ఆరోజు చంద్రశేఖర్‌గారింట్లో డిన్నర్ అటెండ్ చెయ్యాలని గుర్తుచేసి, అభిషేక్ "నాకు పనుందంటూ" జారుకోవటానికి ప్రయత్నించాడు. రాయలు "సర్లే" అని ఊరుకొన్నా రాయలు బావమరిది మాత్రం అభిషేక్‌ని కూడా తీసుకెళ్ళాలని పట్టుపట్టాడు.

కార్మిక సంఘాల నాయకుడైన అభిషేక్, చంద్రశేఖర్‌లాంటి పారిశ్రామికవేత్తలను కలుసుకోవాలనీ, అందువలన వైజాగ్‌లో పలుకుబడి పెరిగి మరిన్ని కార్మిక సంఘాలు తమ చేతిలోకి వస్తాయనీ రాయలు బావమరిది ఉద్దేశం. ఆమాటే చెప్పాడతను.

రాయలకి అదీ నిజమే అనిపించింది. తానెలాగూ మంత్రి హోదాలో హైదరాబాద్‌లోనే కూర్చుంటాడు- అలాంటప్పుడు అక్కడి, తన నియోజకవర్గంలోని కార్మిక సంఘాలు వేరేవాళ్ళపరమైతే...? అలా కాకూడదు! అందుకే అభిషేక్‌ని తిరుగులేని నాయకుడిగా అక్కడి కార్మికసంఘాలకి చేస్తే తనకు ఏ విషయంలోనూ ఢోకా వుండదు. ఇలాంటి దూరాలోచన చేసిన రాయలు అభిషేక్‌ని కూడా తన వెంట రమ్మన్నాడు. అభిషేక్‌కి మరి తప్పలేదు.

రాయిలు ఒ కార్లను, [illegible] బావమరిదీ మరో కార్లోనూ బయల్దేరారు. బంజారాహిల్స్‌లోని ఒక ఎత్తైన ప్రదేశంలో కట్టిన భవంతిలోకి ఆ రెండు కార్లూ ప్రవేశించి పోర్టికోలో ఆగాయి.

అన్ని ఆధునిక సదుపాయాలతో అందంగా వున్న ఆ భవనం మంత్రి రాయల్ని ఆహ్వానించింది.

చంద్రశేఖర్ అప్పటికే అక్కడ వేచివున్న కొందరు పారిశ్రామికవేత్తలను రాయలకి, అభిషేక్‌కి, మిగతావారికి పరిచయం చేశాడు.

పరిచయాలు సాగుతున్నాయి. చంద్రశేఖర్ రాయలుతో మాట్లాడుతున్నాడు. మరెవరో రాయలు దగ్గరికి రావటంతో చంద్రశేఖర్ అభిషేక్‌తో మాట్లాడసాగాడు.

మంత్రి రాయలు, మధ్యలో చంద్రశేఖర్, పక్కన అభిషేక్. ఆ దృశ్యాన్ని దూరాన్నుంచి చూసిన జగదీష్ గిర్రున వెనక్కి తిరిగాడు.

జగదీష్‌ని గమనించాడు అభిషేక్. అది గమనించలేదు చంద్రశేఖర్. గమనించి కూడా గమనించనట్లున్నాడు రాయలు బావమరిది.

జగదీష్ మనసంతా వేడెక్కిపోయింది. "తన ఇంట్లో, తన తండ్రి హోదాకు కనీసం కాళ్ళ దగ్గర నిలబడటానికి కూడా అర్హతలేని ఒకడు, తన ఎదురుగా ఒక మంత్రి పక్కన నిలబడి, తన తండ్రితో కులాసాగా మాట్లాడటమా" జగదీష్ మెదడు మొద్దుబారిపోతోంది.

గబగబా బయటికి వచ్చాడు.

కారులో ఎక్కి కూర్చున్నాడు. స్టార్ట్ అయిందో లేదో స్పీడ్ అందుకుంది. మరు నిమిషంలో ఆ ప్రాంతం వదలిన ఆ కారు నగరంలోని అతి ఖరీదైన హోటల్ ముందు ఆగింది.

కారు పార్క్‌చేసి హోటల్‌లో అడుగుపెట్టిన జగదీష్ రిసెప్షన్ దగ్గరికెళ్ళి ఫోన్ చేశాడు. తన ఫ్రెండ్స్ జాన్, గోవింద్‌లను వెంటనే అక్కడికి రమ్మన్నాడు. వాళ్ళిద్దరూ వచ్చేసరికి అరగంట దాటింది. అప్పటికే జగదీష్ మూడు పెగ్గులు స్కాచ్ పూర్తిచేశాడు.

జగదీష్ అలా తాగటం ఎన్నడూ చూడని ఆ ఫ్రెండ్స్ కొంచెం కంగారుపడినా వెంటనే సర్దుకొని అసలు విషయం ఏమిటని జగదీష్‌ని కదిలించారు. మరో 15 నిముషాల్లో




వాళ్ళు ఆ త్రాగుడు కంపెనీలో జగదీష్‌తోపా టూ సభ్యులయిపోయారు. అప్పటికే జగదీష్ బాగా తాగాడనటం కంటె వోవర్‌గా తాగాడంటే బాగుంటుంది. విపరీతంగా తాగిన జగదీష్‌ని, "ఎందుకంత రెచ్చిపోయి తాగావ్"- అని ఫ్రెండ్స్ అడిగేసరికి, 'బరస్ట్' అయ్యాడు జగదీష్.

"ఐ హేట్ దట్ బాస్టర్డ్! ఐ హేట్ దట్ ఇడియట్!"- ఇంగ్లీషు మొదలైంది. స్నేహితులకి మాత్రం ఆ ఇడియట్ ఎవరో అర్థంకాలేదు. అదే అడిగారు.

ఆ ఇడియట్ ఎవరో డైరెక్ట్‌గా చెప్పలేదు జగదీష్. చీఫ్ మినిష్టర్ దగ్గర్నుంచి చెప్పుకుంటూ వచ్చాడు. ఆ తర్వాత అధికార పార్టీని, ప్రజల్ని రాయల్ని ఎన్నుకున్న ఓటర్లని రాయలు ఎన్నికని, అతని మంత్రి పదవిని, దారుణంగా ఇంగ్లీషులో తిట్టుకుంటూ వచ్చాడు. చివరికి అభిషేక్‌ని తెలుగులో తిట్టటం మొదలెట్టాడు. ఒకవైపు అతి ఖరీదైన హోటల్లోని బార్‌లో, అంతకన్నా ఖరీదైన వ్యక్తి జగదీష్ అభిషేక్‌ని యిష్టం వచ్చినట్లు తిడుతున్నాడు. మరొకవైపు ఈ ఖరీదైనవ్యక్తి తండ్రి చంద్రశేఖర్, తన కొత్త ఫాక్టరీ తాలూకు కాగితాలు క్లియర్ చేయించాలనే తాపత్రయంతో, అభిషేక్‌తో అతిమర్యాదగా మాట్లాడుతున్నాడు.

అక్కడ తన స్వంత భవనంలో తనకు ఏమాత్రం ఇష్టంలేనివ్యక్తి ఎంతో మర్యాద చేయబడుతున్నాడనే వాస్తవాన్ని సహించలేని జగదీష్ ఆ పరిస్థితిని ఏమాత్రం తట్టుకోలేక ఉపశమనం కోసం చిత్తుగా తాగి అంతకన్నా చిత్తుగా అభిషేక్‌ని నానాదుర్భాషలాడుతున్నాడు. అదంతా సీరియస్‌గా వింటున్నారు జాన్, గోవింద్‌లు. వాళ్ళిద్దరూ చాలా తెలివైనవాళ్ళు. అంత గొప్పవ్యక్తి అయిన జగదీష్ తిడుతున్న అభిషేక్ ఎవరని ఆలోచించటం మొదలెట్టారు. ఏనాడూ అలాంటి పేరుగల వ్యక్తి గూర్చిన సంభాషణ తమ మధ్య రాలేదు. జగదీష్ దారుణంగా తాగేసి అంత దారుణంగా అభిషేక్‌ని ఎందుకు తిడుతున్నాడో అర్థం కాలేదు వాళ్ళిద్దరికీ.

"అభిషేక్ ఎవరని?" అడిగారు జగదీష్‌ని.

"మంత్రి రాయలు కాలు కింద చెప్పు" జగదీష్ ఆవేశంతో అన్నాడు "దే ఆర్ ఇంపార్టెంట్స్"

జగదీష్ అభిషేక్‌ని తిడ్తూ అనేకరకాలుగా చేసిన వ్యాఖ్యలు ఆ స్నేహితులిద్దరినీ ఆలోచింపచేశాయి. అభిషేక్ అనేవాడి గురించి, తన తిట్లద్వారా తన స్నేహితులు గుర్తించి ఆలోచిస్తారనేది జగదీష్‌కు ఊహకందని విషయం కాని అదే జరిగింది.

జగదీష్‌తోపాటూ అక్కడ కూర్చున్న ఆ ఇద్దరూ కూడా యించుమించు అదేస్థానంలో వున్న వాళ్ళు. వాళ్ళకీ పరిశ్రమలున్నాయి. వాటితోపాటూ పరిశ్రమలశాఖమంత్రి రాయలుతో పనులు వున్నాయి.

'విశాఖకు చెందిన రాయల్ని ఎలా పట్టాలా'! అని ఎన్నోరోజులనుంచి ఎదురుచూస్తున్న వాళ్ళిద్దరికీ అభిషేక్‌ని పరిష్కారమార్గంగా చూపించాడు జగదీష్.

"అభిషేక్‌ని అంతలా తిట్టాడంటే ఆ అభిషేక్ రాయలుకి చాలా సన్నిహితుడయ్యుంటాడు" అనుకున్న వాళ్ళిద్దరూ నెమ్మదిగా అక్కణ్ణుంచి తప్పుకున్నారు.

బయటకు వచ్చిన వాళ్ళిద్దరూ మళ్ళీ వెళ్ళి యింకో హోటల్‌లో కూర్చున్నారు. ఎలాగైనా అభిషేక్‌ని పట్టాలన్న ఉద్దేశంతో అప్పటికప్పుడే వ్యూహరచన చేయటం ప్రారంభించారు.

"జాన్ వైజాగ్‌లో మా అంకుల్ కోటయ్యగారు వున్నారు. పొలిటికల్ కాంటాక్ట్స్ వున్నవాడు. మంచి ఘటికుడు. ఏ పనైనా సాధిస్తాడు. బహుశా ఈ అభిషేక్ ఆయనకు తెలిసివుండచ్చు. రేపే నేను ఫోన్‌చేసి కనుక్కుంటాను. ఆయనద్వారా అభిషేక్‌తో నీ పని పూర్తిచేసుకుందాం" అన్నాడు గోవింద్.

"థాంక్యూ వెరీమచ్! ప్లీజ్! ఆ పనిచేసిపెట్టు!... జగదీష్‌గాడికేంటి... వాడెవడినైనా తిట్టగలడు, కానీ మనకి మన పని కావాలి. నాకెందుకో ఆ అభిషేక్‌ని పట్టుకుంటే మన పని తప్పకుండా అవుతుందనిపిస్తోంది. జగదీష్ మాటలనిబట్టిచూస్తే వాడు చాలా సమర్థుడులాగున్నాడు" జాన్ అంచనా వేశాడు.

"యు ఆర్ కరెక్ట్! రేపు ఫోన్ చేస్తానన్నాగా. ఈ విషయం మాత్రం జగదీష్‌కి తెలీకూడదు.

తెలిస్తే మనల్ని కూడా వాడు ఆ అభిషేక్‌ని తిట్టినట్టు తిడతాడు. నో డౌట్ ఎబౌట్ ఇట్''- గోవింద్ తెలివిగా మాట్లాడాడు. జాన్ నవ్వుతూ గోవింద్‌తో చెయ్యి కలిపాడు.

ఇక్కడ జగదీష్ బార్‌లో తాగటం ఆపేయాల్సిన సమయం వచ్చేవరకూ చిత్తుగా తాగి ఇల్లు చేరాడు.

అప్పటికే డిన్నర్ అయిపోయి చాలాసేపవటంతో నౌకర్లు కూడా నిద్రకు ఉపక్రమిస్తున్నారు. జగదీష్ రాకను గమనించిన చంద్రశేఖర్ గది బయటకు వచ్చాడు.

"డిన్నర్ వదిలిపెట్టి ఎక్కడికెళ్ళావ్?"

వహించాడు.

అదే సమాధానం వస్తుందని గ్రహించిన చంద్రశేఖర్

"చూడు జగదీష్... మన ఫాక్టరీకి ఇక క్లియరెన్స్ దొరికినట్టే! ఆ అభిషేక్ చాలా ఫెయిర్ ఫెలో, వెరీ ఇంటెలిజెంట్. రాయలు వాడిని ఎందుకు చేరదీశాడో ఈవేళ నాకర్థమైంది" అన్నాడు. జగదీష్ తలెత్తి తండ్రికేసి చూశాడు.

చంద్రశేఖర్ చెప్పుకుపోతున్నాడు.



"మన ఫైల్ వారంరోజుల్లో క్లియర్ చేస్తానన్నాడు. హీ ఈజ్ వెరీ ఎఫీషియెంట్! ఐ అబ్జర్వ్‌డ్ హిమ్ కీన్లీ!"

ఆవేశాన్ని అణుచుకున్న జగదీష్ మరోసారి తండ్రికేసి చూసి "ఇడియట్! దట్ ఫెలో ఈజ్ ఎన్ ఇడియట్" అనుకుంటూ బెడ్ రూంలోకి వెళ్ళిపోయాడు.

చంద్రశేఖర్‌కి జగదీష్ వ్యవహారం అర్థంకాలేదు.

" డ్రింక్ వోవర్ అయినట్లుంది" అనుకుంటూ తన రూంలోకి దారితీశాడు చంద్రశేఖర్.



ఆ త్యాధునికమైన, పెద్ద హొటల్స్‌లో 'మయూరి' ఒకటి. విశాఖ నడిబొడ్డున వున్న ఆ హొటల్ సామాన్యులకు అందుబాటులో వుండదు. మధ్యతరగతివారు అప్పుడప్పుడు సరదాగా వెళ్లాల్సిందేతప్ప దాన్ని భరించలేరు. క్లాస్ జనానికి మాత్రం ఎప్పుడూ సుస్వాగతం పలుకుతూంటుందా హొటల్.

'క్లాస్', 'టాప్' అన్నవి అసాధ్యమైన పదాలేమీ కావు. 'ఒకరికి తగిలించకూడదు' అనే లాంటి నిషిద్ధమైనవీ కావు. బాగా డబ్బు సంపాదిస్తే ఆ పదాలేకాదు, మరెన్నో పదాలు ఆ డబ్బుమనుషులు తగిలించుకోవచ్చు. అలా కొన్ని పదాలు తగిలించుకున్న డబ్బుమనుషులు ఎలాంటి అసందర్భపు ప్రేలాపన జరిపినా "ఆహా"! "ఓహో"! అని మెచ్చుకునే భజనపరులున్న సమాజమిది.

అలాంటి భజన బృందాలు రానురాను ఎక్కువైపోతున్నాయి. ఈ భజనల సంగతి తెలుసున్నవారు కూడా అప్పుడప్పుడు తమకు తెలియకుండానే వాటి ప్రభావంలో పడిపోతుంటారు.

అధికార్ల ముందు ఉద్యోగులు...

కంపెనీ, ఫ్యాక్టరీ యజమానులముందు పనిచెయ్యని మేనేజర్లు...

పాఠశాల ప్రధానోపాధ్యాయుడి ముందు పిల్లలకు పాఠాలు చెప్పని టీచర్లు...

ఉన్నతాధికారుల ముందు ప్యూన్లకంటె పది రెట్లు స్థాయిదిగి కాళ్ళు పట్టడానికైనా వెనుతీయని అసమర్థ అధికార్లు...

మంత్రిపదవిలో వున్న రాజకీయనాయకుడి ముందు ఉన్నత చదువులు చదివాం అనుకుంటున్న ఉన్నతాధికారులు...

ముఖ్యమంత్రి కన్నుల్లో పడాలని ఆయన కటాక్షవీక్షణాలు పడితేచాలు జన్మధన్యమైపోతుందని భ్రమించే మంత్రులు, మంత్రులు కావాలనుకునే ఎం.ఎల్.ఏలు...

ఇలా ఒకవర్గం, ఒక రంగం అని కాకుండా, అన్నిరంగాలకూ, అన్ని వర్గాలకూ చెందిన పెద్దల దగ్గర్నుంచి అతి సామాన్యులదాకా కూడా ఆయా స్థాయిలలో భజనపరులై, ఒక దారుణమైన మానసికరోగానికి లొంగిపోతున్నారు.

అలాంటి బాపతులోవాడే కోటయ్యా. దారుణమైన భజన కార్యక్రమాన్ని సాగిస్తూ చిన్నా పెద్దా అనే తేడా లేకుండా అందర్నీ తన అవసరార్థం ఆకట్టుకుని పనులు జరిపించుకోవటం అతని వృత్తిగా స్వీకరించాడు. కోటయ్యా గారిది భారీ విగ్రహం. దానికితోడు జనం బలహీనతలమీద అతను కొట్టే భజన. దెబ్బ జిల్లాలో ఏపనినైనా సాధించగలడనే కీర్తిని అతనికి ఆపాదించాయి. మయూరి హొటల్ యాజమాన్యంలోని ఒక వర్కింగ్ పార్ట్‌నర్ అనిల్. అనిల్‌నీ, అతని కృషినీ, మయూరి హొటల్ గొప్పతనాన్నీ పొగుడుతూన్న కోటయ్యా హొటల్‌లో కూర్చునివున్నా మాటిమాటికీ ప్రవేశద్వారంకేసి చూస్తున్నాడు.

అంతలోనే అభిషేక్ వచ్చాడు. అభిషేక్‌ని అనిల్‌కి పరిచయం చేశాడు కోటయ్యా.

అభిషేక్ మొహంలో చిరునవ్వు మెదిలింది.

"ఎలా వున్నావ్ అభిషేక్?" కోటయ్యా





"ఏదో మీ దయవల్ల బాగానే వున్నాను" అభిషేక్ చెప్పాడు.

ఏమిటీ వీళ్ళిద్దరికీ ముందునుంచే పరిచయముందా? కోటయ్యా ఊహకందక మనసులోనే ప్రశ్నించుకున్నాడు.

అది గ్రహించిన అభిషేక్, అనిల్ నవ్వుకున్నారు. ఆ నవ్వుల్లో అర్థాలు అంతుచిక్కలేదు కోటయ్యకు.

అంతలోనే కోటయ్యాగారూ అని ఎవరో పిలిచారు. అటువైపు చూశాడు కోటయ్య. అతని ఫైనాన్సర్ రావు కనిపించాడు.

"ఇప్పుడే వస్తా అభిషేక్! అనిల్‌తో మాట్లాడుతూండు! ప్లీజ్ వెయిట్ ఫర్ మీ! ఇఫ్ యూ డోంట్ మైండ్?" అని అక్కడినుంచి లేచి పక్కకి వెళ్లాడు కోటయ్య.

అనిల్‌కి అభిషేక్‌తో మాట్లాడటానికి మనసు ఒప్పటంలేదు. అభిషేక్‌ని సూటిగా చూడలేకపోతున్నాడు.

అది గమనించిన అభిషేక్ అడిగాడు. "సార్... ఇప్పుడైనా చెప్పండి! ఆరోజు నన్ను ఉద్యోగంలోంచి అంత అకస్మాత్తుగా తీసేశారు కదా? కారణం ఏమిటో చెప్పండి సర్! దానికి కారకులు ఎవరు?

అనిల్ మౌనంగానే అభిషేక్‌వైపు చూశాడు. "మరేం ఫర్వాలేదులే... నేనేం అనుకోను"- అభిషేక్ ఆనాటి ఉద్యోగిలాగానే అభ్యర్థిస్తున్నాడు.

అభిషేక్ దాదాపు నాలుగున్నర సంవత్సరాల క్రిందట ఈ హోటల్లోనే పనిచేశాడు.

అంతలో ఆ హోటల్‌వర్కర్లు అభిషేక్ వచ్చాడన్న వార్తవిని అతన్ని కలవటానికి వచ్చారు. వాళ్ళతోపాటూ పక్కకి వెళ్ళిపోయాడు అభిషేక్.

అనిల్‌మాత్రం గిల్టీ ఫీలవుతున్నాడు. అభిషేక్ అడిగినదానికి సమాధానం చెప్పాలనే వుంది. అభిషేక్ సమర్థతమీదా, మాటమీదా పరిపూర్ణ నమ్మకంవుంది. కానీ ఆనాటి విషయాన్ని ఈనాటికైనా అభిషేక్‌ముందు ఉంచలేకపోతున్నాడు. అనిల్ ఆలోచనలు నెమ్మదిగా వెనక్కు మళ్ళుతున్నాయి.

"అభిషేక్ నిజంగా చాలా గొప్పవాడు. ఆనా... అతడు ఈరోజు అదే హోటల్‌వర్కర్ల యూనియన్‌కేకాకుండా మొత్తం హోటళ్ళ సిబ్బందికే తిరుగులేని నాయకుడు. ఎన్నో కార్మికసంఘాలకు అధ్యక్షుడు. రాజకీయంగా పైకి మెట్టుమీద మెట్టు ఎక్కివెళ్తున్న అభిషేక్ ఒక మామూలు హోటల్ కార్మికుడిలాగే తనని అడిగాడు అతన్ని ఎందుకు ఉద్యోగంలోంచి తీసేశారని" మనసులోనే అనుకున్నాడు అనిల్.

అనిల్ కళ్ళముందు, నాలుగున్నర సంవత్సరాలక్రితం, తనవద్ద అభిషేక్ ఉద్యోగంకోసం ప్రాధేయపడ్డ సంఘటన మెదిలింది.

★ ★ ★

"ఎం.ఎ. చదివినా ఈ ఉద్యోగానికి ఎందుకు వచ్చానంటే, ప్రస్తుతం నా అన్నయ్యకు చేదోడుగా వుండాలనే సర్. నాకు బంగారు భవిష్యత్తు వుంటుందనే నమ్మకంతో, భ్రమతో నన్ను చదివించాడు మా అన్నయ్య. ఎంతో అప్పుచేశాడు. ఎన్నో ఇంటర్వ్యూలకు పంపాడు. ఇప్పుడు ఆయన్ని హైదరాబాద్‌నుంచి వైజాగ్‌కి ప్రమోషన్‌మీద బదిలీచేసినా పాతఅప్పులు ఆయన్ని వెంటాడుతూనే వున్నాయి. సార్... మా వదినకి ఏనాడూ ఓ మంచి చీర కొనాలనికూడా అనుకోలేదు మా అన్నయ్య. ఆయన ఆశలమేరకు నేను బాగా చదివి మంచి ఉద్యోగం సంపాదించాలనే మా వదిన ఆశించింది. కన్నతల్లికంటే మిన్నగా నన్ను ఆదరించిన ఆవిడ ఈరోజున జబ్బుతో బాధపడుతోంది. నా ఎం.ఎ. డిగ్రీని మర్చిపోండి. ఈ ఉద్యోగం నా కివ్వండి. నా పనిలోకనుక తేడావస్తే ఏ క్షణంలోనైనా మీరు నన్ను బయటికి పంపించండి. మీకు నమ్మకం లేకపోతే ముందే బ్లాంక్ రాజీనామా యిస్తాను. కానీ నాకు చదువు ఎక్కువవుందని ఈ ఉద్యోగం యివ్వడం మానకండి." అభిషేక్ దాదాపు అనిల్ కాళ్ళు పట్టుకున్నట్లే అడుగుతున్నాడు.

అభిషేక్ మాటలకి, అతని నమ్మకానికీ, ధైర్యానికీ అనిల్ మెత్తబడ్డాడు. ఫలితంగా అభిషేక్ హోటల్లో రిసెప్షన్‌లో ఉద్యోగం సంపాదించాడు. త్వరలోనే అసిస్టెంట్ మేనేజరయ్యాడు. రాత్రింబగళ్ళు శ్రమించాడు. హోటల్‌కి



వచ్చే అతిథులకి అభిషేక్ ఓ అవసరంలా కనిపించాడు. యాత్రికులు, వివిధపనులమీద వచ్చే పెద్దలు, నాయకులు, ఉన్నత అధికారులు, బిజినెస్‌మాగ్నట్లు, అన్నిరకాలవారూ అభిషేక్‌నీ, తమపట్ల అతను చూపించిన శ్రద్ధనీ ప్రశంసించారు. ఎవరికి ఏ సదుపాయం కావాలన్నా స్వయంగా పర్యవేక్షించేవాడు అభిషేక్. ఒకసారి ఆ హొటల్లో బసచేసినవాళ్ళు మళ్ళీ ఎప్పుడైనా వస్తే ఆ హొటల్లోనే దిగాలనుకునేవారు.

అనతికాలంలోనే హొటల్‌పేరు చెపితే చాలు అభిషేక్‌పేరు కూడా కలిపి చెప్పటం అనవాయితీ అయిపోయింది. అలా హొటల్‌కి హైలైట్‌అయిన అభిషేక్ దురదృష్టంకొద్దీ ఓ సదస్సు అక్కడ జరిగింది.

ఆ సదస్సు రాష్ట్ర పారిశ్రామికవేత్తలకోసం ఏర్పాటుచేశారు. రాష్ట్రంలోని అనేకమంది ప్రముఖ పారిశ్రామికవేత్తలు ఆ హొటల్లో దిగారు.

అభిషేక్ చాలా ఉత్సాహంగా ఆ సదస్సు ఏర్పాట్లు చూస్తున్నాడు. క్షణం తీరికలేకుండా, ఏలోటూ రాకుండా ఆ పెద్దల కనుసంజ్ఞలనే ఆజ్ఞలుగా వర్తించే ఏర్పాటుచేశాడు. ఒక్కరుకాదు... ఇద్దరుకాదు... అందరికీ... అక్కడికి విచ్చేసిన ప్రతిఒక్కరిముందూ అభిషేక్ ప్రత్యక్షమవుతున్నాడు. చిన్నపనికికూడా అభిషేక్‌నే పిలుస్తున్నారు. అందరినీ చిరునవ్వుతో పలకరిస్తూ, అలరిస్తూ, అభిషేక్ అలుపనేదే లేకుండా చురుగ్గా, చలాకీగా వ్యవహరిస్తున్నాడు. ఆ పెద్దలందరికీ మనోల్లాసంకోసం, భీమ్లీ బీచ్‌లో నైట్ పిక్నిక్ ఏర్పాటుచేశారు. బస్సుల్లో ఆ పెద్దల్ని బీచ్‌కి తీసుకెళ్ళి, ఆ చలికాలంలో సముద్రానికి కొంచెం దూరంగా మంటలువేసి వారి కోర్కెల మేరకు వాళ్ళకి డ్రింక్స్ ఏర్పాటుచేశాడు అభిషేక్.

ఆ రాత్రిలో, ఆ మంటల మధ్య వేడినీ, శీతాకాలపు చలినీ, వింతవింతగా అనుభవిస్తూ వేడి మద్యాలతో శరీరాన్ని తన్మయత్వం చెందించుకుంటూ అక్కడే వంటగాళ్లు వేడి చేసిన పదార్థాలను ఆరగిస్తూ ఆనందంతో తమ స్థాయినీ, డబ్బుతో వచ్చిన హొదానీ మరచిపోయి ఆ పెద్దలు నవయువకుల్లా మారిపోయినట్లు కొద్దిసేపు నృత్యాలు చేశారు. వాళ్లల్లో ఒకడైపోయిన అభిషేక్ వారందరికీ చిరకాల అనుభూతిగా మిగిలేటట్టు తనూ డాన్స్ చేశాడు. నవ్వుల్తో, కేరింతలతో, నాట్యాలతో ఆ నైట్ పిక్నిక్ అద్భుతంగా వుందనీ ఏకగ్రీవంగా అందరూ హొటల్ యాజమాన్యాన్నీ ముఖ్యంగా అభిషేక్‌నీ తెగపొగిడారు. ఇందంతా సదస్సు తెల్లారితే వుందనగా ముందురోజు రాత్రి జరిగిన ఆనందోత్సవం.

అయితే సదస్సురోజున ప్రశంసాపూర్వకమైన ఎన్నో కళ్లమధ్య, చలాకీగా తిరిగే అభిషేక్ మీద రెండు ఎర్రని కళ్లు పడ్డాయి. ఆ కళ్ల దృష్టిలో పెద్దలతో అభిషేక్ చనువు, వారి ప్రేమ పిలుపులు, చెరగని ఆ చిరునవ్వూ మరింత ఆజ్యం పోశాయి.

అంతే...

ఉదయం సదస్సు ముగిసింది.

మధ్యాహ్నం ఓ ఫోన్ అందుకున్నాడు అనిల్.

ఆ ఫోను జగదీష్‌ది.

"నువ్ ఉద్యోగం యింక చెయ్యక్కర్లేదు. కారణాలు మాత్రం అడక్కు. నేనేం చెప్పే పరిస్థితుల్లో లేను. ఈ హొటల్ నా ఒక్కడిది కాదు. నేను ఒక పార్టనర్‌ని. ఈ హొటల్‌లో ఆరుగురికి భాగస్వామ్యం వుంది. అందులో యిద్దరు ముఖ్యులు. నేను యాజమాన్య ప్రతినిధిగా వ్యవహరించాలి. వాళ్లని ప్రతిఘటించే అవకాశం లేదు. నువ్ కష్టపడి పనిచేస్తున్నావనేది అందరికీ తెలుసు. నీ తప్పులేదని కూడా నాకు తెలుసు. ఇంతకన్నా నిన్ను ఎందుకు రాజీనామా చెయ్యమంటున్నానో చెప్పలేను" అనిల్ అభిషేక్‌ని చూడకుండానే చెబుతున్నాడు.

అభిషేక్ మాత్రం మొహంలో ఎలాంటి భావం లేకుండా అనిల్‌నే చూస్తున్నాడు. అనిల్ చెప్పుకుపోతున్నాడు.

"బట్... ఓ సహాయం మాత్రం నీకు చెయ్యగల్ను. ఓ మూడు నెలలపాటు నీకు ఇబ్బంది కల్గకుండా నా వ్యక్తిగతమైన అభిమానంతో మూడు నెలల జీతం యిస్తాను ప్లీజ్ అభిషేక్... నన్నర్థం చేసుకో. నీకు ఎక్కడయినా మంచే జరుగుతుంది. ఐ సిన్సియర్లీ విష్





యూ ఆల్ సక్సెస్ ఇన్ యువర్ లైఫ్. ఎప్పు డైనా ఎలాంటి ఆర్థిక ఇబ్బంది వచ్చినా నన్ను కలుసుకో' అనిల్ ఎంతో బాధపడుతూ చెప్పిన ఆ మాటలకు అభిషేక్ ఆశ్చర్యపడలేదు; అవా క్కయిపోనూ లేదు.

"సార్... మూడు నెలల జీతం యిస్తు న్నందుకు థాంక్స్ కానీ... మీరు ఏదో దాచిపెడు తున్నారు. ఫలానా తప్పు- ఎంత చిన్నతప్పు యినా సరే, అందువల్ల తీసేశాం అని అనండి. అంతే చాలు. తృప్తిగా వెళ్లిపోతాను. కానీ యిలా అకారణంగా పొమ్మంటే నా శక్తిమీద నాకు అనుమానం వస్తుంది. నేనేదైనా తప్పు చేశానా అనే భావం నాలో నన్ను చంపేస్తుంది. ఈ మానసిక ఒత్తిడివల్ల ఏరకంగా నేను దిగజా రాల్సిన పరిస్థితులు వస్తాయోనని ఆందోళనప డుతున్నాను. అసలేం జరిగింది సర్... చె ప్పండి... నన్ను తీసెయ్యటానికి కారణమేమిటో చెప్పండి సర్"-

అభిషేక్ అనిల్‌ని వేడుకున్నాడు

అర్థించాడు!

ప్రాధేయపడ్డాడు!

అనేక విధాలుగా అడిగాడు.

★ ★ ★

ఆనాడే కాదు ఈనాడు కూడా అభిషేక్ మీద పడ్డ ఆ ఎర్రని కళ్ళ గురించి చెప్పే స్థితిలోలే డు అనిల్.

అందుకే మౌనంగా వున్నాడు.

అంతలో పక్కకి వెళ్ళిన కోటయ్య, అభిషేక్ తిరిగి అనిల్ వద్దకు వచ్చారు.

అనిల్ కూల్ డ్రింక్స్ ఆర్డర్ యిచ్చాడు.

"సారీ అభిషేక్... ఆయన రావుగారని మా ఫైనాన్సర్. ఏదో అర్జంట్ అంటే... కొంచెం లేటైంది" కోటయ్య చెబుతుండగా కూల్ డ్రింక్స్ వచ్చాయి. ముగ్గురూ కూల్‌డ్రింక్స్ అందుకున్నారు.

మళ్లీ అభిషేక్ గతం గురించి మాట్లాడతాడే మోనన్న అనుమానంతో అనిల్ కుర్చీలోంచి లేచి అన్నాడు. "మీరిద్దరూ ఏదో మాట్లాడుకో టానికొచ్చారనుకుంటాను! ఈ ఆఫీస్ గదిలోనే కూర్చోండి. నేను అలా ఓ రౌండ్ వేసొస్తాను. ప్లీజ్ ఎక్స్‌క్యూజ్‌మి! మిస్టర్ అభిషేక్' అంటూ వెళ్ళిపోయాడు అనిల్.

"హమ్మయ్య" అన్నట్లు ఊపిరి పీల్చుకున్నా డు కోటయ్య.

"అభిషేక్... రేపు మనం ఫ్లైట్‌లో వెళ్దాం. నువ్వింక అభ్యంతరం చెప్పవద్దు. బైలక్ రేపే మనపని అయిపోయిందనుకో, ఎల్లుండి నేని క్కడ వుండొచ్చు. ఓ కోర్ట్ కేసుంది. నేనుంటే సాక్ష్యులు... గొడవా... స్వయంగా చూసుకోవచ్చు ఏమంటావ్..." కోటయ్య అభిషేక్‌ని బల వంతం చేస్తున్నాడు.

"అంత డబ్బు అనవసరంగా ఖర్చుచే యటం ఎందుకండీ... రేపు గోదావరిలో వెళదాం. రాయలుగారు ఎలాగూ రేపు సాయంత్రానికిగానీ మద్రాస్ నుంచి రారు. ఆయన వచ్చినవెంటనే ఏంపనులున్నాయో... మనం అనుకున్నట్లు అన్నీ జరుగుతాయని నమ్మకం ఏముంది! ఒక పనిమీద బయల్దేరిన ప్పుడు రెండుమూడు రోజులు ఆలశ్యమైనా వుండాలి. ఆ పని పూర్తి చేసుకోవాలి... ఏమంటారు?" అభిషేక్ సర్దిచెప్పాడు.

"కరెక్టే... కానీ నాకెందుకో నమ్మకంగా వుంది. ప్లీజ్ నామాట కాదనకు. రాయలుగారి ముందు ఓసారి నన్నూ నా పనినీ నువ్ స్వయంగా పరిచయం చేసి చెబితే అయిపో తుంది. కాకపోతే మళ్ళీ మరోసారి ప్రయత్ని ద్దాం" కోటయ్య పట్టువిడవటంలేదు.

"ఈ చిన్నపనికి"... అభిషేక్ అంటుండ గానే "ఇక నువ్వేం చెప్పకు. ఈసారికి నా మాట కాదనకు" కోటయ్య బలవంతానికి అభిషేక్ మాట్లాడలేకపోయాడు.

కోటయ్య అభిషేక్ ఎదురుగుండానే ఎవరో ట్రావెల్ ఏజెంట్‌కి ఫోన్ చేశాడు. అవతల నుంచి ఏదో సమాధానం వచ్చింది. కోటయ్య ముఖకవళికల్ని చూసి 'ఫ్లైట్ టికెట్లు దొరక వని ట్రావెల్ ఏజెంట్ చెప్పాడేమో' అనుకున్నా డు అభిషేక్.

"ఎలాగైనా రేపు ఫ్లైట్‌కి టిక్కెట్లు సంపాదిస్తా ను. మళ్ళీ ఏదో యూనియన్ గొడవల్లోపడి ప్రయాణం మర్చిపోయేవ్" అంటూ నవ్వాడు కోటయ్య.

"మీ పని అంత ఈజీగా మర్చిపోనులెండి.



అదలా వుంచండి. ఆ ఫ్యాక్టరీ వర్కర్లకు ఇస్తాన న్న స్థలం సంగతి ఏంచేశారు?'' అభిషేక్ అడిగాడు.

''అదో పెద్ద న్యూసెన్స్‌గా మారిపోయింది. ఈ వర్కర్లు మరో స్థలం చూపించినా వద్దంటు న్నారు. ప్రస్తుతం వున్న స్థలం మావాడేమో ఫ్యాక్టరీ ఎక్స్‌టెంక్షన్‌కోసం కావాలంటున్నాడు. ఆ వేరే స్థలం అంతా బాగానే వుంది కానీ చుట్టూ మురికి కాల్వలున్నాయి. వర్కర్లు అది వద్దంటున్నారు. వీడు ఈ స్థలం తనకి కావా లంటున్నాడు. దాంతో గొడవ. వర్కర్లకి ఓమాట ఓసారి యిచ్చాక అది వాపస్ తీసుకోవాలంటే న్యూసెన్స్'' కోటయ్య వివరించాడు. వర్కర్లకు ఆ స్థలం ఇవ్వమని మీ అన్నగార్కి చెప్పండి. ఆయన ఫ్యాక్టరీ ఎక్స్‌టెంక్షన్‌కి మరో మంచి స్థలం స్టీల్‌ప్లాంట్ ఏరియాకి దగ్గర్లో నేను చూపిస్తాను. వర్కర్లతో గొడవ పడవద్దని మీరు నచ్చచెప్పండి. రాయలుగారు ఈ విషయం ఓసారి మీ అన్నగారితో స్వయంగా చెప్పారు. అపుడాయన వినలేదు. ఇప్పుడు మీరు అయ నకు నచ్చచెప్పి మీ అన్నగారిని ఒప్పిస్తే బాగుంటుంది. రాయలుగారు కూడా సంతో షిస్తారు. ఈ రోజు మీరు ఆయనతో మాట్లా డండి. ఎలాగోలా ఒప్పించండి. రేపు మనం తప్పకుండా వెళదాం. ఒకవేళ మీ పని రేపు కాకపోయినా, ఆ తర్వాతయినా నేను దగ్గ రుండి ఏదో తంటాలుపడి చేయిస్తాను'' కోట య్యగారి పని చేయించటానికి అభిషేక్ రాజకీ యపరమయిన లింకువేశాడు.

'అబ్బ... ఏంలిటిగేషన్ పెట్టావయ్యా.

అన్నట్లుగా చూసి- ''రాత్రికి నేను ఫోన్ చేస్తా... ఈలోగా మీ అన్నయ్యను కలుస్తా... మరి ఇప్పుడు ఎక్కడికి?''

''నేను... కొంచెం సీతమ్మధార వెళ్లాలి. నేను వెళతానులెండి మీరు మీపని చూసుకోండి''.... ''నేను నిన్ను సీతమ్మధారలో డ్రాప్ చేస్తాను''. ''వద్దులెండి... ఇక్కడ వర్కర్లతో కూడా కొంచెం పనుంది! అది చూసుకుని నేను వెళతాను''- అంటూ అభిషేక్ ఆగిపోయాడు. కోటయ్య వెళ్లిపోయాడు.

★ ★ ★

''అభిషేక్ ఓసారిలారా...'' కోటయ్య పిలిచా డు. అభిషేక్ అటుగా వెళ్లాడు.

''ఈయన అభిషేక్... వైజాగ్ కార్మిక సంఘాల నాయకుడు. వెరీ పవర్‌ఫుల్ పర్సన్'' కోటయ్య పరిచయం చేశాడు.

అవతల వ్యక్తి ఫుల్‌సూట్‌లో వున్న జగదీష్.

పైజామా...లాల్చీ... చిరునవ్వుతో నిలబడిన అభిషేక్‌ని చూశాడు జగదీష్.

ఆ యిద్దరి చూపులూ కల్సుకోలేదు.

జగదీష్ కళ్లల్లో అజ్ఞాతవైరం తొణికిసలాడు తోంది.

ఏ భావం కనపరచని చిరునవ్వు అభిషేక్ కళ్లల్లో కనిపిస్తోంది. ఒకరి కళ్లు నిప్పుల వర్షం కురిపిస్తుంటే, మరొకరి కళ్లు భావాలు చిందించని యోగీశ్వరుని చిరునవ్వులా వున్నాయి.

కోటయ్య వీళ్ళిద్దర్నీ పరిచయమైతే చేశాడు కానీ, ఆ తర్వాత విమానప్రయాణ హడావిడిలో పడిపోయాడు. అభిషేక్‌ని ఎవరో పలకరించి ఏదో మాట్లాడుతున్నారు.

విమానం బయల్దేరటానికి సిద్ధం కావటం, ప్రయాణీకుల కోసం ప్రకటన వెలువడటం, జగదీష్ ఫ్లైట్లో ఎక్కటం వరుసగా జరిగిపో యాయి.

విమానంలో కూర్చున్న జగదీష్, అభిషేక్ కూడా విమానం ఎక్కటం చూసి 'వీడు యింత లెవెల్‌కి ఎదిగాడా' అనుకున్నాడు. 'రాయలు అనవసరంగా వీడి లెవెల్ పెంచేస్తున్నాడు. అసలు కోటయ్యకూ అభిషేక్‌కీ సంబంధం ఏమిటి? ఈ కోటయ్య తన స్నేహితుడు గో విండ్ అంకుల్ కదా?... ఏముందిలే కోటయ్య వీడిచేత ఏదోపని చేయిస్తున్నాడేమో?... ఛ... కోటయ్య కూడా ఇంతలా దిగజారతాడా?''- జగదీష్ ఆలోచిస్తున్నాడు.

''వీడిని ఎలాగైనా రాయలు దగ్గర్నుంచి దూరం చెయ్యాలి'' జగదీష్ నిర్ణయించుకు న్నాడు.

''ఛ... వీడి గురించి ఎందుకు అనవసరపు ఆలోచనలు. వీడిని ఇంటర్వ్యూ నుంచి తరిమి గొడితే హోటల్‌లో ప్రత్యక్షమయ్యాడు. అక్క ణ్ణుంచి పీకేస్తే రాయలు పక్కకి చేరాడు. ఇప్పుడు విమానంలో కోటయ్య పక్కన వున్నా

డు. ఏమయినా వాడింక ఎదగకూడదు. వీడిగురించి తన సమయాన్ని వృథా చెయ్యటం లేదు కదా. నో... ఐ హేట్ హిమ్! అంతే! వాణ్ణి ఏదో చెయ్యాలి. వాడంటే కోపం పెరుగుతోంది. కోపంలో తనేం చేస్తాడో తనకే తెలీదు. రాయలు కోటయ్య, ఈ జనం వాణ్ణి తిట్టేలా చేయాలి. లేకపోతే వీడు కార్మికసంఘాలకు నాయకుడై... ఆఖరికి తన ఫ్యాక్టరీల యూనియన్లకు కూడా నాయకుడయితే... ఛ ఛ... అలా ఎన్నటికీ కానివ్వగూడదు నో! ఆ పరిస్థితి రాదు... రానివ్వను! అందుకే వీడిని ముందు రాయలు దగ్గర్నుంచి దూరంగా వుంచాలి'' జగదీష్ ఆలోచనలకు అకస్మాత్తుగా బ్రేక్ పడింది.

విమానాన్ని సాంకేతిక కారణాలవల్ల విజయవాడలో రిపేర్‌కోసం ఆపనున్నట్లు ప్రకటించారు.

''ఎంతసేపు విజయవాడలో ఆగుతుందో?''... అనుకుంటున్న ప్రయాణీకుల ప్రశ్నకు సరైన సమాధానం దొరకలేదు.

''ఇలాంటివాళ్లు ఎక్కితే మరిలా జరగదేమిటి? ఛ... అభిషేక్... వీడివల్ల ఈ విమానం ఆగిపోయింది... అయినా తను వాడిగురించి ఎందుకనుకోవాలి''-... జగదీష్ మనసు గొడవ చేసింది. విమానం విజయవాడలో ఆగింది. ప్రయాణీకులందర్నీ దిగిపొమ్మన్నారు. దిగిన ప్రయాణీకులంతా గన్నవరం విమానాశ్రయానికి వచ్చేశారు. లాంజ్‌లో సర్దుకున్నారు.

జగదీష్, కోటయ్య, అభిషేక్ మరికొందరు లాంజ్‌లో మూలగా కూర్చున్నారు. మిగతా ప్రయాణీకులు రకరకాల అభిప్రాయాలు వ్యక్తం చేస్తూ మాట్లాడుకుంటున్నారు.

''చూడండి కోటయ్యగారూ! అనవసరంగా డబ్బు ఖర్చు... పైగా ఇప్పుడు ఏం జరుగుతుందో తెలీదు. అందుకే ఈ ప్రయాణం వద్దన్నాను''- అభిషేక్ అన్నాడు.

''భలేవాడివయ్యా! నువ్వు రాకపోతే ఆ పని అవుతుందా. ఎప్పుడూ ఇలా జరగదు. ఏదో సమస్య వచ్చినట్లుంది. అందుకే గన్నవరంలో ఇంతసేపు వుంచుతున్నారు. పోనీ అంతా మన మంచికే! నువ్వు నన్ను గుర్తు పట్టటానికే ఇబ్బందవుతుంది. నన్ను పరిచయం చేసుకుని, నాపని చెపితే ఇంక అది ఎప్పుడవుతుంది?''

కోటయ్య మాటలకు అడ్డం వస్తూ ''విచిత్రంగా మాట్లాడుతున్నారే. రాయలు లాంటివారు అలా వుండరు. మీరెళ్లినా మీ పని అవుతుంది. ఏదో నన్ను బలవంతంగా లాక్కెళుతున్నారు. అందరూ మీలాగే నన్ను బలవంతం చేస్తారు. నిజానికి మంత్రులు పనిచెయ్యాలంటే వాళ్లని డైరెక్ట్‌గా కలిసి ఆ పని అయ్యేవరకూ వాళ్లదగ్గరే ఉండాలి'' అభిషేక్ చెప్పాడు.

''ఆ రోజుల్లో అలా కాదయ్యా బాబు! ఏ మంత్రయినా, ఎవరైనా తమకి బాగా తెలుసున్నవాళ్ళు పట్టుపడితేనేగానీ ఏ పనీ చెయ్యరు. కంటి తుడుపుగా 'చేస్తాం' అన్నా చెయ్యరు. అందుకే కదా ఈ బాధ''. ఆగిన కోటయ్యని పరిశీలించాడు అభిషేక్.

మళ్ళీ మొదలెట్టాడు కోటయ్య.

నేను ఎందర్నో మంత్రుల్ని చూశాను. చీఫ్ మినిష్టర్ దగ్గర్నుంచో, పార్టీ ప్రముఖుడినుంచో ఆదేశాలు అందితే వెంటనే ఆ పనులు చేస్తారు. ఆ పై లెవెల్‌కి వెళ్లటం కొందరికే అతికష్టం మీద సాధ్యం అవుతుంది. మరోమార్గం ఏమిటంటే మంత్రులకు తెలుసున్నవాళ్లను తీసుకువెళ్లి గట్టిగా చెప్పించుకోవడం'' కోటయ్య మళ్లీ ఆగాడు.

''అంటే నేనో పైరవీకార్ అయ్యానన్న మాట'' అంటున్న అభిషేక్‌కి అడ్డం వస్తూ, ''ఛ ఛ... అలా అనుకోకయ్యా! లోకం సంగతి చెపుతున్నానంతే, నీకా ఖర్మ ఎందుకు... అయినా ఇది పైరవీకాదు. పెండింగ్‌లో వున్న పనిని కదిలించటం మాత్రమే. నిజానికి ఎవరైనా తలచుకుంటే చాలా చిన్నపని''. అంటూ ''ఏమంటావ్''? అన్నట్లు అభిషేక్‌కేసి చూశాడు కోటయ్య.

''రాయలుగారి విషయంలో అలా కాదండీ! మీరసలు ప్రయత్నించకుండానే నన్ను లాక్కెళుతున్నారు. ఈ చిన్నపనికి రాయలుగారు అభ్యంతరం చెప్పరు... ఆలశ్యం చెయ్యరు... మీరు వెళ్లినా అయిపోతుంది - నిజంగా చెపుతున్నా నేను అనవసరం'' అభిషేక్ తన వాదనని సమర్థించుకుంటున్నాడు.



''నువ్వెన్ని చెప్పు. అదంత సులభంకాదు. నే వెళితే లాభం వుండదు. అందరూ అందరి మాట వినరు. కొంతమంది మాటలనే లక్ష్యపెడతారు. అందుకే ఈ పనికి నువ్వుండాలి''- కోటయ్య మళ్లీ చెప్పాడు.

''కరెక్ట్‌సార్... ఈ మంత్రులు ఎవరో ఒక పైరవీకారు వుంటేగానీ పనులు చెయ్యరు. ఆయన అన్నట్లుగా జరగదు. ప్రజలు మంత్రుల్ని కలిసినా పనులు చేస్తారన్న నమ్మకంలేదు. వాళ్లని ప్రజలు ఎన్నో అడుగుతారు. అన్నీ వాళ్ళు చెయ్యలేరు.

ఏ కొద్దో జరిగినా అవి మధ్యవర్తుల ద్వారానే జరుగుతాయి. అసలు మన వ్యవస్థే అలా అయిపోయింది. అందుకే దళారులు పెరిగారు. పైరవీకార్ల రాజ్యం అయింది. ప్రతివాళ్ళూ పనులు చేయించుకోవటానికి దళారులమీదే ఆధారపడాల్సిన పరిస్థితి ఏర్పడింది'' గుక్క తిప్పుకోకుండా కోటయ్య మాటల్ని సమర్థిస్తున్న ఆమెను అభిషేక్, జగదీష్ ఇద్దరూ ఒకేసారి చూశారు.

అప్పటివరకూ ఏదో పుస్తకంలో తలదూర్చినా, చెవులు మాత్రం వాళ్ళ సంభాషణకే అప్పగించిఉన్న ఆ అమ్మాయి వాళ్ళిద్దరికీ కొంచెం పక్కగా కూర్చునివుంది. ఆమెని గమనించకుండా యింతసేపూ కొంచెం ఆవేశంగానే మాట్లాడుకుంటున్న అభిషేక్, కోటయ్య సర్దుకోటానికి ప్రయత్నిస్తుండగా ''ఎక్స్‌క్యూజ్‌మీ... మధ్యలో కలగచేసుకున్నందుకు. ఏదో... ఫ్లైట్ మళ్ళీ బయల్దేరేవరకూ టైంపాస్...'' అంది వాళ్ళపక్కకి వచ్చి కూర్చుంటూ.

''దాన్దేముంది - వెల్‌కం... మొత్తానికి బాగా చెప్పావమ్మా. దేశం దళారులచేతుల్లోకి ఏనాడో పోయింది. ఇంకా మన రాయలులాంటివాళ్ళు చాలావరకూ నయం'' కోటయ్య అన్నాడు.

''ఏమో! మరి మీరు ఈయన్ని రాయలుగారి దగ్గరకు పనికోసం పైరవీకి తీసుకువెళుతున్నారనుకుంటా?'' ఆమె ప్రశ్న కోటయ్యని ఇరకాటంలో పెట్టింది.

''ఆఁ...పైరవీకేమిటీ... ఏదో సహాయం కోసం! నాది పెద్దపని కాదులే. ఏదో మాట సాయం కావాలని. అదీ కాకపోయినా రాయలుగారి దగ్గర అలాంటివి వుండవులే'' కోటయ్య సర్దుకొన్నాడు.

''ఏదో సహాయం... మాట సాయం ఏమిటండీ.. అవి పైరవీకి పర్యాయపదాలు. ఆ పెద్దమనిషిని చెప్పమనండి కాదని''. ఆమె అభిషేక్‌కేసి చూస్తూ కోటయ్యతో అంది.

ఆమె ఎవరో అభిషేక్‌కి తెలీదు. తమ సంభాషణలోకి ఎందుకు జోక్యం కలిగించుకుంటుందో... అభిషేక్‌కి అర్థం కావటంలేదు. ఆమె ఎవరైనాసరే అభిషేక్‌ని నిలదీస్తోంది. ఆమె చొరవని జగదీష్ మనసులోనే ప్రశంసించుకున్నాడు.

ఇందాకట్నుంచీ పక్కనే కూర్చుని మాట్లాడాలని వున్నాకూడా, అభిషేక్‌తో మాట్లాడటం ఏమిటలే అనే వుద్దేశంతో మౌనంగా వున్నాడు జగదీష్.

అప్పుడు అందుకున్నాడు అభిషేక్. ''ఏ విషయాన్నైనా సరే మంచిగానూ, చెడుగానూ కూడా చూడవచ్చు. మీరు నన్ను అడుగుతున్నారు కాబట్టి చెబుతున్నాను. పైరవీకీ, దళారులకీ, సహాయానికీ చాలాతేడావుంది. దళారులు పైరవీలుచేసి సంపాదిస్తారు. పనులుకాకపోయినా అది చేస్తాం యిది చేస్తాం అని మోసం చేసేవాళ్ళూ వుంటారు. 'పనులయితే చాలు' అని దళారులను వెతికిపట్టుకుని పైసలిచ్చి పనులు చేయించుకునే జనమూ వున్నారు. ఇవన్నీ పక్కనపెడితే 'ఏ ప్రతిఫలాపేక్షా లేకుండా' సహాయం చేసేవాళ్ళు వున్నారు. వాళ్లనీ, దళారుల జాబితాలో చేరుస్తారా?'' చాలా సౌమ్యంగా చెప్పాడు అభిషేక్ ఆ అమ్మాయిని ఉద్దేశించి.

''ఇవన్నీ పైకి చెప్పే కబుర్లులెండి! ఎంత పెద్ద దళారీ అయినా సహాయం చేస్తున్నాననే అంటాడుగానీ పైసలకోసం పనులు చేస్తానని బోర్డు తగిలించుకుని తిరుగుతాడా?'' సూటిగా ప్రశ్నించింది.

ఆమె ధైర్యం జగదీష్ మనసులో ఆనందాతిశయాలను కలిగించింది.

అభిషేక్ ఆమె ఆ ప్రశ్నతో చెంపమీద కొట్టినంతగా భావించాడు.

జగదీష్ మనసులో ఆమె ఎందుకో ఎదిగిపో




తోంది. అభిషేక్ చిరునవ్వు నవ్వాడు. "మీరెవ రో నాకు తెలీదు. అది అవసరం కూడా లేదులెండి... బట్ ఓ ప్రశ్న అడుగుతాను సమాధానం చెపుతారా? మీకు ఏదో పనిమీద చాలా చాలా డబ్బు కావల్సివచ్చిందనుకోండి. ఎవర్ని అడుగుతారు?" అభిషేక్ అడిగాడు. "మా డాడీని" వెంటనే చెప్పి "ఏమిటా అర్థంలేని ప్రశ్న" అనే భావాన్ని తన మొ హంలో చూపించింది.

అభిషేక్ ప్రశ్న పిచ్చిదనీ, టాపిక్ మారుస్తు న్నాడని జగదీష్ అనుకుంటూండగా అన్నాడు అభిషేక్ "మీ డాడీ లేరనుకోండి"

"వ్వాట్ డూ యూ మీన్?" ఆమె కళ్ళు కోపంగా మార్రాయి.

"నన్ను తప్పుగా అర్థం చేసుకోకండి. ఆయన ఏదో పనిమీద సుదూరాలకు వెళ్ళిపో యారు. ఇంట్లో అంత డబ్బు లేదు. అర్జంటుగా కావాలి... అప్పుడు మీరేం చేస్తా రు?"

"తెలిసున్నవాళ్ళ దగ్గరెవర్నుంచైనా తీసు కుంటాను"

"తెలుసున్నవాళ్ళు ఎవరూ లేరు. ఉన్నా వాళ్ళ దగ్గర కూడా డబ్బులేదు- అప్పుడు?"

"వ్వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్, అర్థంలేని ప్రశ్నలేయకండి. ఏదో మాట్లాడాలని అర్థంలేకుండా మాట్లాడకండి"

జగదీష్ ఆనందానికి అవధులు లేవు.

"ఎవరో ఆమె?" అభిషేక్‌ని తన మాటలతో విసిరేయటానికి ప్రయత్నించటమే జగదీష్‌ని ఆనందపరుస్తోంది. ఆ సంభాషణను చెవులు రిక్కించి మరీ వింటున్నాడు.

"నావి అర్థంలేని మాటలని కొట్టిపారేసి మీరు తప్పించుకోవాలని చూడకండి. నేను చెప్పేది ఈ దేశంలో ఎనభైశాతంమంది రోజూ ఎదుర్కొనే సమస్య". అభిషేక్ అంటూండ గానే "ఆ సమస్యకూ నాకూ సంబంధం ఏమిటి?" అడిగింది ఆ అమ్మాయి.

"ఉంది... ఈ రోజు మీ దగ్గర డబ్బు వుండచ్చు. మీకు తెలిసున్నవాళ్ళూ డబ్బున్న వాళ్ళు కావచ్చు. కానీ మీకు డబ్బు అవసరం వచ్చిందంటే మీ దగ్గర డబ్బు లేనట్లే కదా. అప్పుడు మీకు తెలిసున్నవాళ్ళు కూడా డబ్బు లేదనవచ్చు. వాళ్ళదగ్గర కూడా నిజంగానే వుండకపోవచ్చు లేదా వున్నా లేదనవచ్చు. ఎందుకంటే మీ దగ్గర లేకపోతేనేకదా మీరు వాళ్ళని అడిగేది... వ్వాట్... యామ్ ఐ కరెక్ట్?" అభిషేక్ ఆమెకేసి చూశాడు.

"...మేబీ"... కొంచెం తగ్గింది ఆమె.

"అలాంటి సమయాల్లోనే అప్పుచేస్తాం. డబ్బు కావాలన్నవాడికి అప్పు దొరకడం అంత సులభం కాదు. ఎవర్నో పట్టుకోవాలి. వాళ్ళ ద్వారా అప్పు సంపాదించాలి. అంటే ఎవరో ఒకరి సహాయం లేక హామీ లేకుండా ఈ దేశంలో అప్పు పుట్టడం కొంచెం కష్టమే. ఆ పరిస్థితిలో అప్పు యిప్పించినవాడు మిమ్మల్ని కమిషన్ అడిగితే వాడు దళారీ. కానీ మీ మంచికోరి మీకూ ఎలాగైనా సహాయం చేయా లనే ఉద్దేశంతో మీకు అవసరానికి అప్పు యిప్పించేవాడు... వాడు ఎవడైనా సరే ఉప కారి అవుతాడు. అంతేకానీ మధ్యదళారీ కా డు..."

అభిషేక్ చెప్పుకుపోతూంటే ఆ అమ్మాయి అలాగే అతన్ని చూస్తూండిపోయింది.

"మేం ఏదో మాట్లాడుకుంటూంటే అది విని, మీరు అనవసరంగా ఏదో అనాలనో, చెప్పాలనో అనుకొని చాలా హేళనగా మాట్లాడా రు. బట్... ఐ డోంట్ టేక్ ఇట్ ఇన్ ఎ రాంగ్‌వే. కానీ మీరు విన్నారో లేదో నాకు తెలీదు. ఆయన దగ్గర దళారులు వుండరనేది నిజం. ఒకవేళ ఆయనకు తెలీకుండా ఎవరైనా, ఏదైనా చేసినా ఆ పనికాదు అప్పుడైనా వాళ్ళ సంగతి బయట పడుతుంది. " అభిషేక్ బాగా సర్దుకొన్నాడు.

"మీరు బాగానే సమర్థించుకుంటున్నారే. అసలు అప్పుకీ... మంత్రుల దగ్గర పనికీ... సంబంధం ఏమిటి" మళ్ళీ నిలేసింది అభి షేక్‌ని ఆమె.

"భలేవారే.. మంత్రయినా ఏదైనా ఒక సమ యంలో, ఎవరెళ్ళినా పనిచెయ్యొచ్చేమోగాని,... వడ్డీ, అసలూ వస్తుందనే నమ్మకం కుదిరితే గానీ ఎవరూ అప్పుఇవ్వరు. ఎవరైనా అలా ఆలోచించకుండా అప్పు ఇచ్చారనుకోండి- ఇక వాళ్ళపాట్లు ఆ భగవంతుడికే తెలియాలి"



అభిషేక్ ఈజీగా రిలాక్స్ అవుతూ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"ఏం మీరు వడ్డీ వ్యాపారా?"

"అంత డబ్బేకనక వుంటే ఇంకేమండీ! ఏదో బిజినెస్ పెట్టుకునేవాడిని"

"అయితే మీరు బాగా అప్పులు చేసుండచ్చు... అప్పుల గురించే ఎక్కువ మాట్లాడుతున్నారు"? ఆమె చురకవేసింది.. అభిషేక్ ఓ క్షణం సీరియస్ అయినా అది మొహంలో కనబడనివ్వలేదు.

"వీడు అంతకన్నా ఏం చేస్తాడులే"! అనుకున్నాడు జగదీష్. ఆమె అభిషేక్‌ని తన మాటల ఈటెలతో పొడుస్తోందనే ఆలోచనే జగదీష్‌ని పులకితుణ్ణి చేస్తోంది. చాలా హాయిగావున్నాడు. హాయిగా నవ్వాలని వుంది కూడా నిజానికి కానీ అదిమిపట్టుకున్నాడు.

"అప్పు చెయ్యటానికి ఎన్నితిప్పలుపడాలో ప్రత్యక్షంగా చూసినవాణ్ణి. అప్పు చెయ్యటం తప్పుకాదండీ! నా పాయింట్ ఏమిటంటే ఎక్కడయినా నమ్మకం ప్రధానం. మీరు నన్ను నమ్మకపోతే నేనూ మిమ్మల్ని నమ్మను. ప్రతీవారు కొందర్ని నమ్ముతారు. ఎందుకంటే అందరీ్ని నమ్మి మోసపోలేరు కనక. ఆ నమ్మకన్ధులుగా వున్నవాళ్ళు స్వార్థం కోసం నమ్మకానికే అమ్మకం పెడితే ఎవరు మాత్రం వూరుకుంటారు? రాజకీయనాయకులు ఈ విషయంలో చాలా తెలివిగా వుంటారు. ఎవరైనా తమని మోసం చేస్తున్నారని తెలుసుకొంటే అనలుకే సున్నాపెడతారు. లేకపోతే వాళ్ళు నాయకులు కాలేరు". అభిషేక్ చెబుతోంటే ఆమెకు వినక తప్పలేదు.

"నేను మిమ్మల్ని... ఏం అనలేదు... జనరల్‌గా మాట్లాడాను". అంటూ ఆమె నన్నగా నవ్వింది.

"నేను కూడా జనరల్‌గానే చెబుతున్నాను. మీరేమనుకొన్నా నాకేం ఫర్వాలేదు. నన్ను పైరవీకారన్నా దళారీ అన్నా బాధపడను. ఎందుకంటే రాజకీయాల్లోకి వచ్చాక మా జీవితాలు ప్రజల ముందుకు వెళతాయి. ఎవరేమన్నా వినాలి. మీలాగా ఓపిగ్గా వినేవాళ్లుంటే, ఇలా ఎప్పుడైనా సమయం చిక్కితే... అదీ సందర్భం దొరికితే... వివరించటానికి ప్రయత్నిస్తాను. లేదనుకోండి... ఏం చేస్తాను? నవ్వుతూ ఆమె కేసి "అర్థం చేసుకొన్నారా?" అన్నట్లు చూశాడు అభిషేక్.

"మీతో మంచి టైంపాస్ అయింది. నేనూ సరదాగా వాదనలోకి దిగాను. బైది బై మీ పేరు...?"

"అభిషేక్"- మరి మీ పేరు చెప్పరా ? అన్నట్లు చూశాడు అభిషేక్.

"నా పేరు జ్యోత్స్న"

"నైస్ మీటింగ్ యూ"- అని అభిషేక్ అంటూండగానే ప్రయాణీకులకు పిలుపు వచ్చింది. ఆమె చకచకా ముందుకు వెళ్ళిపోయింది.

అభిషేక్ పక్కనే కునుకుతీస్తున్న కోటయ్యను లేపి మెల్లగా బయల్దేరాడు.

జగదీష్ విమానం వైపు నడుస్తున్న జ్యోత్స్నను సమీపించి "యువర్ ఆర్గ్యుమెంట్ ఈజ్ ఎక్సలెంట్". అన్నాడు.

అతనెవరో తెలియని జ్యోత్స్న ఆ ప్రశంసకు ఆశ్చర్యపడింది.

"అలాంటివాళ్ళతో అలాగే మాట్లాడాలి. చాలా గొప్పగా మాట్లాడారు". అన్నాడు మళ్ళీ.

జ్యోత్స్నకి ఏమీ అర్థంకాలేదు. "మీరు"? అనడిగింది అతన్ని చూస్తూ.

"ఐయామ్ జగదీష్- చంద్రా గ్రూప్‌కి మేనేజింగ్ డైరెక్టర్". అన్నాడు ఓసారి టై సర్దుకుంటూ.

"అంటే చంద్రశేఖర్‌గారు..." అంటూ ఆగింది జ్యోత్స్న.

"ఆయన మా ఫాదర్"

"అంటే మీరా మీ సిష్టర్ కదూ"?- జ్యోత్స్న జగదీష్‌కేసి ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది.

"అవును... మీరా మీకెలా తెలుసు?" ఈసారి జగదీష్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అది నా క్లాస్‌మేట్! ఎప్పుడూ మీ గురించే చెపుతూండేది... మీరు ఫారిన్‌లో వుండేవారుకదూ" జ్యోత్స్న ఆసక్తిచూపింది. అదే ఆశించిన జగదీష్‌లో ఆనందం తొణికిసలాడింది. తన వివరాలన్నీ అందించాడు. విమా





నంలో కూడా జ్యోత్స్నతో చాలాసేపుమాట్లాడాడు. మాటల్లో పొగడ్తలు కూడా చాలా వున్నాయి. జగదీష్ అలా మాట్లాడటం వింతగా అని పించినా జ్యోత్స్న ఊరుకుంది.

బేగంపేట విమానాశ్రయంలో దిగిన తర్వాత కూడా జగదీష్ ఆమె దగ్గరగా వెళ్ళి 'వుంటానని' చెప్పి సెలవు తీసుకున్నాడు.

ఇవేమీ పట్టించుకోని అభిషేక్ రాయలు దగ్గర చెప్పాల్సిన విషయాలు గుర్తుచేసు కొంటున్నాడు.

విమానం దిగుతూనే అభిషేక్, కోటయ్య్ సరాసరి హోటల్‌కి టాక్సీలో వెళ్ళిపోయారు. జగదీష్ తనకోసం వచ్చిన కారులో ఫ్యాక్టరీకి వెళ్ళిపోయాడు. వీళ్ళకంటె ముందుగానే జ్యో త్స్న తనకోసం వచ్చిన అన్నయ్య ఆనంద్‌తో వెళ్ళిపోయింది.

ఆ రోజంతా జగదీష్ తలపుల్లో జ్యోత్స్న వుంది. రాత్రివరకూ జగదీష్‌కి ఇంటికి వెళ్ళటా నికి కుదరలేదు. ఏపని చేస్తున్నా జ్యోత్స్న గుర్తుకువస్తోంది.

'జ్యోత్స్న పెద్ద అందగత్తె కాదు కానీ అందంగానే వుంటుంది. చాలా సింపుల్‌గా వుంది. అన్నిటికీ మించి అభిషేక్‌ని నిలదీ సింది. కంగారుపెట్టింది. అభిషేక్‌ని నూటిగా, ఘాటుగా విమర్శించింది. 'నీ బతుకిదేనా' అన్నట్లు విసిరిపారేసింది.' అదే అదే... జగ దీష్ పదేపదే తలచుకొంటున్నాడు. తనలో తానే నవ్వుకుంటున్నాడు. జ్యోత్స్న జగదీష్ మనసులో బలంగా ముద్రవేసింది.

జ్యోత్స్నగురించి ఎవరైనా ఆ క్షణంలో జగ దీష్‌ని అడిగితే 'ఐలైక్ హెర్ వెరీమచ్' అంటా డు. జగదీష్ వ్యక్తిత్వం లేనివాడుకాడు. డబ్బుందికదాని చిల్లరిగా తిరిగే రకంకాదు. బిజినెస్‌లో పైకివస్తున్న జగదీష్ తండ్రికన్నా ఫాస్ట్. ఎవర్నీ లెఖ్ఖచెయ్యడు. నిర్ణయాలు తీసు కోవటంలో తండ్రిలా వెనుకాడడు. మంచైనా, చెడయినా క్షణాలమీద జరగాలనేదే జగదీష్ సిద్ధాంతం. అలాంటి జగదీష్ మనసంతా ఆరోజు జోత్స్న ఆవరించింది. రాత్రి లేటుగా యింటికిచేరిన జగదీష్ నిద్రకు ఉపక్రమిస్తు న్న చెల్లెల్ని పిలిచాడు. డైనింగ్‌టేబుల్ దగ్గర తనతోపాటు కూర్చోమన్నాడు. అన్నగారి అకాల ఆనందం చెల్లెలు 'మీరా'ని ఆశ్చర్యంలో పడే సింది. అన్నగారికి తానే వడ్డిస్తూ "ఏవిటీ?... చాలా హుషారుగా వున్నావ్?"... మాటలతోకా కుండా చూపులతో ప్రశ్నించింది. మీరాని ఎలా అడగాలో బోధపడక చాలాసేపు తడబడి "మీరా... నీకు... జ్యోత్స్న అనే అమ్మాయి తెలుసా?" అనడిగాడు.

"జ్యోత్స్న... ఆ... అది నా క్లాస్‌మేట్! మెడిసి న్‌లో ఫస్ట్‌ర్యాంక్ కొట్టింది. ఏం?... దాని గురించి అడుగుతున్నావెందుకు?" మీరా అడిగింది.

"ఏంలేదూ... ఈవేళ ఫ్లైట్‌లో కలిసింది. నువ్ తెలుసంది"

"దాన్ని చాలాసార్లు మనింటికి డిన్నర్‌కి పిలిచాను. వస్తానంటుంది. రాదు! ఎంతైనా ఇపుడు మినిష్టర్‌కూతురుకదా... అసలే రాదను కుంటా" మీరా ఆగింది.

"మినిష్టర్ కూతురా?" జగదీష్ ఆశ్చర్య మైన ప్రశ్న.

"అవును ... రాయలుగారి కూతురు... ఈ విషయం చెప్పలేదా అది?"

జగదీష్ లిప్తకాలంపాటు ఆశ్చర్యపోయినా తర్వాత కళ్ళలో ఏదో మెరుపు మెరిసింది.

"అసలు ఆమెను నువ్వే సరిగ్గా పిలిచి వుండవ్. ఏ ఫోన్లోనో ఆర్డరేసి వుంటావ్... అందు కే వచ్చివుండదు, ఇంటికెళ్ళి పిలిస్తే ఎందుకు రాదు?" జగదీష్ మాట్లాడుతున్న తీరుచూసి మీరా ఆశ్చర్యపోయింది. "ఏమిటీ సంగతి, దాన్ని డిన్నర్‌కి పిలవమంటున్నావ్?" అనడు గుతూ 'ఏమిటోయ్ విషయం' అన్నట్లుగా కళ్ళు గరేసింది మీరా. "ఏంలేదు ... ఏదో కర్టసీ సేక్... పిలిస్తే పిలు... నీ యిష్టం." జగదీష్ అలా అంటున్నాకూడా "ప్లీజ్ తప్పకుండా పిలు" అనే అర్థం గోచరిస్తుంది ఆ మాటల్లో.

"నువ్ చెప్పాక పిలవకుండా వుంటానా... తప్పకుండా దాన్ని డిన్నర్‌కి తీసుకొస్తా" మీరా హామీతో అందమైన కలలమధ్య జగదీష్ హాయిగా నిద్రపోయాడు.

★ ★ ★

మంత్రి రాయలుకి ఇద్దరు పిల్లలు. కొడుకు ఆనంద్ బిజీవ్యక్తి. కూతురు జ్యోత్స్న. పిల్లలి ద్దరూ హైదరాబాద్‌లోనే వుంటారు. ఇద్దరికీ ఏ

విషయంలోనూ పడదు. ఆనంద్ స్నేహితుల న్నా అలవాట్లన్నా జ్యోత్స్న అసహ్యించు కుంటుంది. రోజూ తాగి ఇంటికివచ్చి అల్లరిచే సే ఆనంద్‌ని అన్నగా గౌరవించాల్సివచ్చినా మనసులోవున్న కోపం, ఏహ్యాభావం పైకి కనబ డనివ్వకుండా జాగ్రత్తపడుతుంది జ్యోత్స్న.

మౌనంగా తనపని తాను చేసుకునే జ్యోత్స్న అంటే ఆనంద్‌కి వల్లమాలిన అభిమానం. చెల్లెలిపట్ల అన్నగా తన బాధ్యత గురించి ఆనంద్ ఆలోచించకపోయినా, ఏదో తాను చెయ్యాల్సిన పని అనుకుంటూ చెల్లెల్ని కాలేజి దగ్గర దించటం, ఏదైనా ఊరెళితే విమానమో, రైలో ఎక్కించటం, ఆమె ఊరినుంచి తిరిగివ చ్చినప్పుడు కూడా ఇంటికి తీసుకురావ టంలాంటి చిన్న చిన్న కర్తవ్యాల్ని మాత్రం నెరవేరుస్తూంటాడు.

అన్నగారి అలవాట్లు, బాధ్యతారాహిత్యం జ్యోత్స్నకి అప్పుడప్పుడు మనస్తాపం కలిగి స్తాయి. తన విషయం పట్టించుకున్నా మిగి లిన ఏ విషయాలూ పట్టించుకోని ఆనంద్‌ని చూస్తే అప్పుడప్పుడు బాధకూడా కల్గుతుంది జ్యోత్స్నకి.

రాయలు మంత్రి అయినప్పటినుంచీ మరో రకంగా 'పెళ్ళిచేస్తా'మంటూ తనని బాధపెడ్తు న్నారని ఫీలవుతోంది జ్యోత్స్న. జ్యోత్స్న మెడి సిన్ చదివింది. ప్రాక్టీస్ పెట్టాలనేదే ఆమె చిరకాల ఆశయం. ఎలాగైనా ఆశయాన్ని సాధించాలని ఆమె పట్టుదలగా వుంది. ఎం.బి.బి.ఎస్. అవగానే పెళ్ళి పెళ్ళని ఇంట్లో పెద్దలు గొడవమొదలెట్టారు. అప్పట్లో తన తండ్రి రాజకీయ సంక్షోభంలో వుండబట్టి కూతురి పెళ్ళివిషయంలో ప్రాముఖ్యత చూప లేదు.

దాంతో గైనకాలజీలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చెయ్యటానికి జ్యోత్స్న చేసిన ప్రయత్నం ఫలించింది. పి.జి పూర్తిచేసినా ప్రయత్నం, ఆశయం అలాగే వుంది.

ఈలోగా రాయలు మంత్రి అయ్యారు. దాంతో మంత్రిగారి కుటుంబసభ్యులూ, పరి వారం, ఆప్తులూ, హితులుగా మారినవారూ, జ్యోత్స్నకి పెళ్ళిచేయమని పెద్దరికం చూపిస్తు న్నారు. రాయలు తన హోదాకి తగినవాణ్ణి వెతకమని జనాన్ని పురమాయించారు కూడా. ఆ జనం ఎవరెవర్నో రాయలు ముందుకి తీసుకువస్తున్నారు. ఆ రభస భరించలేక విశా ఖపట్నం దగ్గర్లోని పల్లెలో బంధువుల పెళ్ళి ఎవరిదో వుంటే యిష్టంలేకపోయినా వెళ్ళింది జ్యోత్స్న.

తిరిగి వస్తూంటే గన్నవరంలో అభిషేక్‌తో తన వాదన గుర్తుకొచ్చి జ్యోత్స్న నవ్వుకుంది. 'అభిషేక్' అనే పేరు చాలాసార్లు వింది. రాయలు ఎక్కువగా వాడే పేరది. 'తండ్రి తరచుగా పొగిడే అభిషేక్ ఎవరో తండ్రి వయసు వాడనే' అనుకుంది జ్యోత్స్న. కానీ ఈ వ్యక్తి అభిషేకా ఆమె మనసెందుకో ఆశ్చర్యప డింది.

ఆ రోజు లాంజ్‌లో వాళ్ళ సంభాషణలో రాయలు పేరు రావటంతో జ్యోత్స్న జోక్యం కలిగించుకుంది. ఒక యువకుడు తన తండ్రి గురించి ఎంతో తెలుసన్నట్లుగా మరెవరితోనో చెబుతుండటం గమనించి ఆ చర్చల్లో తల దూర్చింది. ఆ యువకుణ్ని అదరగొట్టానను కొంది. కానీ ఆ యువకుడు మాటలగారడీ చేశాడు. ప్రజలన్నాడు, అప్పులన్నాడు, సమస్య లన్నాడు, ఆఖరికి నమ్మకం అన్నాడు. తా నెంతలా మాటలతో దెబ్బకొట్టాలని చూసినా ఓపిగ్గా ఏదో చెప్పాలని ప్రయత్నించాడు. ఎందుకో అతని లౌక్యం ఆనందంగా అని పిస్తోంది. ఎంత సహనం. తెలివిగా మృదు వుగా మాట్లాడుతూ ఎదుటివాళ్ళను ఇరకా టంలో పెడుతున్నాడో, అంతలా అతన్ని మాట లతో చిరాకుపెట్టాలని చూసినా ఎందుకంత సహనం ప్రదర్శించాడు? ఒకవేళ తాను రాయ లు కూతుర్నని తెలుసా ... అవకాశం లేదు? ఏనాడూ అతను తనను చూడలేదు. ఎవరో వెళ్ళి చెప్పే అవకాశమూ, సందర్భమూ లేవు. ఒకవేళ అలా తెలిసివున్నా అనవసర గౌరవం చూపేవాడు కదా ... తనను ఒప్పించటానికి అతనంతలా వాదన ఎందుకు చేస్తాడు. ఖచ్చి తంగా అతనికి నేను తెలీదు'' జ్యోత్స్న మన సులో ఆలోచనలు పరిగెడుతున్నాయి.

జ్యోత్స్నకి ఆ యువకుడు అభిషేక్ అని తెలియగానే ఎంతో ఆనందం కలిగినట్లు అని





పించింది. "నేను అనవసరంగా వాదనకి దిగానా?" "అభిషేక్ నొచ్చుకోలేదు కదా? అభిషేక్ బాగా చదువుకున్నవాడిలా వున్నాడు. ఎంత లౌక్యుడు. ఎదటివాళ్లను ఆకట్టుకోటానికి, నమ్మకం కలిగించటానికి అతను చూపించిన సహనం మరవలేనిది". జ్యోత్స్న అనుకుంది.

"అభిషేక్ తనని గురించి పట్టించుకొన్నాడా? అసలు ఏమనుకొంటున్నాడు. ఈ విషయమే మర్చిపోయాడా? అభిషేక్ తనని మరచిపోయినా ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు. గన్నవరం విమానాశ్రయంలో అంతలా మాట్లాడిన వాడు హైదరాబాద్ విమానాశ్రయంలో దిగివెళ్ళిపోయేటప్పుడు కనీసం తనకోసం చూడనైనా లేదు. రన్‌వే దగ్గర వెనగ్గా వస్తున్న అభిషేక్‌ని తాను చూసినా అతను ఎటో తిరిగి మాట్లాడుతున్నాడు. "ఎవరో ఒక అమ్మాయి తనతో వాదించింది, తనని విదిలించింది. ఆమె ఎవరు?" అని అభిషేక్ ఆలోచించాడా? రాజకీయాల్లో దిగినవాళ్ళకి ఏమీ పట్టదనుకుంటాను. ఎంతసేపూ "ఏపని ఎలాగవుతుంది? ఎవరితో ఏపని ఎలా చేయించుకోవాలి?" అని ఆలోచిస్తారేమో ఏమో... అయినా అభిషేక్ మాత్రం మాటలు అమ్మే రాజకీయ నాయకుడిలా కనిపించటం లేదు. మాటలతో ఎదుటివాళ్లలో నమ్మకం కల్గిస్తూ వాళ్ళ మనసుల్లో ముద్రవేస్తున్నాడు. రాజకీయ నాయకుల ఊకదంపుడిలా అభిషేక్ వాదనలు లేవు. కొత్తగా వున్నాయి. సాధారణంగా వినే రాజకీయపు హామీలు, ఉపన్యాసాలకి ప్రజలు మోనపోవటం లేదు. అందుకే అభిషేక్ ఈ కొత్త పద్ధతి రాజకీయంగా వాడుతున్నాడా?

జ్యోత్స్న ఆలోచనల్ని భంగపరుస్తూ "అమ్మగారూ ... మీకు ఫోను" అంటూ చెప్పాడు నౌకర్ రంగయ్య.

"ఆ ... ఫోన్ ఇలా తీసుకురా"- అంది. బయట హాలులో వున్న ఫోన్‌ని వైర్‌తో సహా జాగ్రత్తగా పట్టుకువచ్చి రిసీవర్ని తుడిచి జ్యోత్స్నకి అందించాడు రంగయ్య. ఆమె ఫోనందుకోగానే వెళ్ళిపోయాడు అతడు.

"హలో...ఎవరూ?..."జ్యోత్స్న అడిగింది.

"హలో ... నేను జ్యోత్స్న ... మీరాని"— సమాధానం.

"ఓ...నువ్వా...బాగున్నావా?"

"ఆ...నువ్వెలావున్నావ్?"

"ఓ.కే."

"ఏం లేదు...నిన్న రెండుసార్లు మీయింటికి వచ్చాను, నువ్వులేవు". మీరా అవతల నుంచి అంది.

"అవును ... మా అమ్మ ఏవో పూజలంటూ గుడికి తీసుకెళ్ళింది. అక్కడే చాలా ఆలస్యం అయింది...అయినా ఏవిటి విషయం?"

"ఏం లేదు...నిన్ను డిన్నర్‌కి పిలవాలని వచ్చాను"

"ఏవిటి విశేషం...?"

"ఏంలేదూ...ఏదో నీతో సరదాగా మాట్లాడి చాలారోజులైందికదాని"

"నాతోనా...సరదాగానా"

"ఎప్పుడు పిలిచినా ఏదో ఒకటి చెప్పి తప్పించుకుంటున్నావ్. ఈసారి తప్పనిసరిగా రావాలి. రేపు సాయంత్రం నేనే స్వయంగా వచ్చి నిన్ను పికప్ చేసుకుంటాను. నువ్వు ఎలాగైనా వస్తున్నావ్. ఇంకేం చెప్పకు అంతే!"

"సర్లే ... తప్పకుండా వస్తాను" జ్యోత్స్న

"థాంక్యూ వెరీమచ్"

ఆ సంభాషణ అంతటితో ముగిసింది.

జ్యోత్స్న మీరా ప్రాణస్నేహితులు కారు. మీరా చాలా గొప్పవాళ్ల అమ్మాయి. జ్యోత్స్న పలుకుబడి వున్న రాజకీయ నాయకుడి కుమార్తె. గొప్పవాళ్లు పలుకుబడివున్నవాళ్లని చేరదీస్తారు. పలుకుబడివున్నవాళ్లు గొప్పవాళ్లను ఆకట్టుకోటానికి చూస్తుంటారు. మీరా, జ్యోత్స్న తనతో కలుపుకోవాలనీ, తద్వారా గొప్పతనాన్ని మరింతగా పెంచుకోవాలనీ చూసింది. కానీ జ్యోత్స్న మీరాతో మామూలుగానే వుంది. జ్యోత్స్నకి వున్న ముఖ్య స్నేహితులంతా మధ్యతరగతి కుటుంబాలవాళ్లే. తరచు వాళ్ల యిళ్లకు వెళ్లి హాయిగా వాళ్లతో టైంపాస్ చేసి వస్తూంటుంది. వాళ్ల ఆదరణని ఆనందంగా అనుభవిస్తుంది. వాళ్లల్లో చాలామందికి పెళ్లిళ్లు అయిపోయాయి. మిగిలినవాళ్లు ఉద్యోగాలంటూ బిజీగా వున్నారు. జ్యోత్స్న మటుకు

ఆశయాన్ని ఎలా అమలుపరచాలా అని ఆలోచిస్తూ రోజులు గడిపేస్తోంది. మీరా స్నేహం విచిత్రంగా అనిపిస్తోంది. ఎం.బి.బి.ఎస్ చదివేటప్పుడు అంతంతమాత్రంగా వుండేది. తన తండ్రి రాయలు రాజకీయంగా పెరుగుతున్న కొద్దీ మీరా తనకు దగ్గరకావటానికి ప్రయత్నాలు చేస్తూనేవుంది. రాష్ట్రమంత్రిగా రాయలు ప్రమాణస్వీకారం చేసినరోజున మీరా తనను స్వయంగా కలసి అభినందనలు తెలియజేసింది. అప్పట్నుంచి తరచు ఫోన్ చేస్తూనే వుంది. 'ఈసారి మీరా చాలా బలవంతం చేస్తోంది. వెళ్లక తప్పేటట్టు లేదు. అందులోనూ వస్తానని చెప్పాక వెళ్లకపోతే బాగుండదు. ఓసారి వెళితే అసలు సంగతేమిటో తెలుస్తుంది కదా' జ్యోత్స్న మనసులోనే అనుకొంది.

మీరాలాంటి గొప్పవాళ్లు డిన్నర్‌కి రమ్మంటే అదే పదివేలని వెళతారు. జ్యోత్స్న మాత్రం ఆలోచిస్తోంది. 'మీరా తన గొప్పతనాన్ని చూపించి తనను ఆకట్టుకోవాలని ప్రయత్నిస్తోందా? డిన్నర్‌కి వెళితే తన అంతస్తు అర్థం అవుతుందన్నట్లుగా పిలిచిందా? ఏమైనా డిన్నర్‌కి వెళ్లాలిలే'! అని నిర్ణయించుకుంది జ్యోత్స్న.



ఆరోజు సాయంత్రం ఆరున్నరకే జ్యోత్స్న ఇంటికి వచ్చింది మీరా. ఇద్దరూ కలసి బంజారాహిల్స్‌లోని మీరా ఇంటికి వెళ్లారు. మీరా ఏవో కబుర్లు చెప్పటం మొదలుపెట్టింది. ఇద్దరూ కలసి కొంచెంసేపు షటిల్, బ్యాడ్మింటన్ ఆడారు. ఆపైన జ్యూస్ తాగి ఛెస్ ఆడారు. జ్యోత్స్న ఆడిన మూడుగేమ్స్‌లోనూ ఓడిపోయింది.

అయినా పెద్దగా పట్టించుకోలేదు. మీరా తమ ఆల్బమ్స్ చూపించింది. అవి పెద్దగా నచ్చలేదు జ్యోత్స్నకి. విదేశాల నుంచి తెచ్చిన ఆర్ట్ పీసెస్‌ని చూపించింది మీరా. సరిగ్గా ఎనిమిదవుతోంటే వచ్చాడు జగదీష్. "సారీ ఫర్ ది లేట్" ఎవరూ అడగకుండానే జ్యోత్స్నని ఉద్దేశించి అన్నాడు జగదీష్.

"జస్ట్ ఎ మినిట్"! అంటూ మళ్లీ జ్యోత్స్నతో చెప్పి మేడమీదికెళ్లి అయిదునిమిషాల్లో తిరిగివచ్చాడు.

మంచి ఖరీదైన సూట్. పరిసరాలకు సైతం గుబాళింపు కలిగించే విదేశీ సెంట్ స్ప్రే చేసుకుని వచ్చాడు. అందంగా వుండే జగదీష్‌కి ఆ అలంకరణలు మరింత సొగసుగా వున్నాయి. రిస్ట్‌వాచీని సర్దుకుంటూ జ్యోత్స్న ఎదురుగా ఖాళీగా వున్న సోఫాలాంటి కుర్చీలో కూర్చున్నాడు.

"హౌఈజ్ అవర్ హౌస్?" జ్యోత్స్నని అడిగాడు జగదీష్. "బాగానే వుంది" జ్యోత్స్న సమాధానం ఇచ్చి మీరాతో మాట్లాడటం కొనసాగిస్తోంది.

జగదీష్ కంటికి జ్యోత్స్న చాలా అందంగా కనిపిస్తోంది. హుందాగా తెలివిగా మాట్లాడే జ్యోత్స్న తన హృదయంలో అల్లుకుపోతోంది. ఎదురుగా తాను కోరుకునే వ్యక్తి వుంది. తన మనసులో భావాల సంచలనం వుంది. కానీ ఆ భావాలు గుండెలోతుల్లోంచి గొంతువరకూ వచ్చి ఆగిపోతున్నాయి. జగదీష్ ఎన్నడూలేని ఉలికిపాటుకి గురవుతున్నాడు. "సంఘంలో అంతఎత్తు కూర్చోబెట్టిన డబ్బు, ప్రజల్ని ఆశ్రితులుగా చేసుకోగలిగే హోదా, ఏది కావల్సినా క్షణాలమీద ముందుంచుకోగలిగే సమర్థతా అన్నీవున్నా ఈమె మనసుని నేను ఆకర్షించగలనా... ఆమె మంత్రి కూతురయినంతమాత్రాన నన్నెందుకు తృణీకరిస్తుంది? నాకేం తక్కువ? నాతో వుంటే ఆమె సుఖపడుతుంది. సకల సౌఖ్యాలూ అనుభవిస్తుంది. ఈ ఎస్టేట్‌కే 'రాణి' అవుతుంది. నేను కావాలనీ, నన్ను పెళ్లాడాలనీ ఎంతమంది నాముందుకు రాలేదు? అయినా కాదన్నాను. ఈ జ్యోత్స్నని నేను పెళ్లిచేసుకొంటానని అడగనా? నేనో... నేనెందుకు అడగాలి. ఆమే నన్ను అడిగేటట్లు చేసుకోవాలి. ఏమైనా... నేను తొందరపడటం





లేదు కదా? నో...నేనా'' జగదీష్ జ్యోత్స్ననే చూస్తూ తన మనసుతో మాట్లాడుతున్నాడు.

''మీరు మామూలుగా ఎన్నింటికి డిన్నర్ తీసుకుంటారు?'' జగదీష్ అప్రయత్నంగా ఏదో అడగాలని మరేదో అడిగాడు. జ్యోత్స్న ఆ ప్రశ్నకు జగదీష్‌కేసి చూసింది. జగదీష్ కళ్ళల్లో అనేక భావాలు ఆ క్షణంలో ఆమెకి కనిపించాయి. జగదీష్ కళ్ళనిండా కోరికలు. అతని చూపుల్లో వింత అర్థాలు. జగదీష్ ప్రశ్న సహజంగా అనిపించలేదు జ్యోత్స్నకి. ఆ రెండుజతల కళ్ళూ ఒక్కసారి కలుసుకున్నాయి. ఓ జత ''నువ్వు నాక్కావాలి'' అన్నట్లున్నాయి. మరో జతకళ్ళు ''ఏమిటి నీ చూపుల్లో భావాలు?'' అని ప్రశ్నించినట్లుగా వున్నాయి.

జగదీష్ చూపులతో తనని వెంటాడుతున్నట్లు గ్రహించింది జ్యోత్స్న. తన చూపుల్లోని అర్థాలను అర్థం చేసుకుని తనవెంట రావాలని జగదీష్ అనుకుంటున్నాడు. ''సాధారణంగా తొమ్మిదిన్నరా... పదవుతుంది'' చాలా ఆలస్యంగా జ్యోత్స్న యిచ్చిన సమాధానం నిదానంగా వుంది.

''అయితే మనకి యింకా ఓ గంట టైం వుందన్నమాట యూ లైక్ మ్యూజిక్?'' జగదీష్ అడిగాడు. ''యా... బట్ నాట్ నౌ''

''ఆ... మర్చిపోయాను జ్యోత్స్నా... మీ ఇంటికి వచ్చినప్పుడు ఇంట్లో నౌకర్లు తప్ప ఎవరూ లేరు. ఏం తోచక అలా మీ నాన్నగారి ఆఫీసు వైపు వెళ్లాను'' మీరా ఆగింది. జ్యోత్స్న మీరాకేసి చూసింది. మళ్లీ మొదలుపెట్టింది మీరా. ''అక్కడో వ్యక్తిని చూశానే. ఇంతకుముందెప్పుడూ నేను చూడలేదు. పైజమా, లాల్చీ వేసుకుని పొడుగ్గా సన్నగా, కొంచెం కోల ముఖం వున్నాడు. వచ్చినవాళ్లతో చాలా సరదాగా మాట్లాడుతున్నాడు. అందరితో నవ్వుతూ మాట్లాడుతూ వాళ్లని సాగనంపుతున్నాడు'' జ్యోత్స్న మీరాకేసి సీరియస్‌గా చూసింది. మీరా కూడా జ్యోత్స్నకేసి చూస్తూ అడిగింది ''ఎవరే అతను నీకు తెలుసా?''

''అదేముందిలే మీరా! మంత్రుల దగ్గర అలాంటివాళ్లు చాలామంది వుంటారు. మంత్రుల దగ్గరికి డైరెక్ట్‌గా వెళ్లలేనివాళ్లు అలాంటివాళ్లను పట్టుకొని పనులు చేయించుకుంటారు. దటీజ్ వెరీ కామన్'' జగదీష్ చాలా స్పీడ్‌గా అందుకుని అసహనంగా అన్నాడు.

''అది నాకు తెలుసు! కానీ ఆయనలో ఏదో కొత్తదనం కనిపించింది. అందర్లా లేడు. అక్కడికి వచ్చినవాళ్లు కూడా వాళ్ల సమస్యలు ఆయన వింటేచాలు అన్నట్లుగా వున్నారు'' మీరా జగదీష్‌కేసి చూస్తూ అంది.

''అవును మరి నవ్వకుండా, అందర్నీ వినకుంటే అంతమంది వెంటపడరుగా! అదో రకం టెక్నిక్! ఎలాగోలా ప్రజల్ని తనచుట్టూ తిప్పుకోవాలని చూసేవాళ్ళు ఏదో పద్ధతి అవలంబిస్తారు. ఎందుకంటే నాలుగు పనులు చేసిపెడితే నాలుగుడబ్బులు సంపాదించుకోవచ్చు. కొద్దోగొప్పో పేరుకూడా వస్తుంది. అదంతా ఓ నాటకంలే''! జగదీష్ అంత దారుణంగా కొట్టిపారెయ్యటం చూసి జ్యోత్స్న మీరాలు కొంచెం ఆశ్చర్యపోయారు.

ఆ సమయంలో మీరా మూడ్ పాడుచెయ్యటం యిష్టంలేదు జగదీష్‌కి. అయినా ఎవడి గురించో కాదు... వాడి గురించి... అదీ తన మనసులో అశాంతిని రేపినవాడి ఆలోచనలతో మీరా సమయాన్ని వృధాచెయ్యటం జగదీష్‌కి అసలు యిష్టంలేదు. ''ఎవరతను...?'' మళ్ళీ అడిగింది మీరా జ్యోత్స్నని. జ్యోత్స్న మీరా చూపిస్తున్న ఇంటరెస్ట్ ఆసరాగా తీసుకుని మీరాని ఏడిపించే ఉద్దేశంతో అంది. ''అంతగా అతన్ని అబ్జర్వ్ చేసినదానివి అతని పేరయినా తెలుసుకోలేదా? నా దగ్గరా నీవేషాలు... నాకు తెలుసులే... నువ్ అతనిపేరు తెలుసుకోలేదంటే నేను నమ్మను''. అది విన్న మీరా కొంచెం షాక్‌తిన్నా అది పైకి కనపడనివ్వలేదు.

''అది... అది... ఆ ఎవరో ఏదో పేరుతో పిలిచారోయ్'' తెలుసుండీ మర్చిపోయినట్లుగా నటించాలని జ్యోత్స్న ముందు నటించలేకపోయింది మీరా.

''అభిషేక్ కదూ''! జ్యోత్స్న ఆ పేరు అనగానే ''ఆ! అవును'' అంది మీరా, అని మళ్ళీ కొంచెం కంగారుపడింది.

ఈ సంభాషణంతా జగదీష్ ముందే జరు

గుతోంది. ఏదో తెలియని బాధ, అశాంతి, అసహనం జగదీష్ మనసుని ఆవహించాయి.

"ఎవడిగురించో మాట్లాడుతూ, మన టైం ఎందుకు వేస్ట్‌చేస్తావ్?... మీరా మరేదయినా మాట్లాడకూడదూ..." అన్నాడు జగదీష్.

"ఎవరో ఏమిటోయ్. జ్యోత్స్న ఇంట్లో వున్నాడు." మీరా అంది.

"మా ఇంట్లోకాదు మా నాన్నగారి ఆఫీస్‌గదిలో... అదే విజిటర్స్ హాల్లో!" జ్యోత్స్న నర్దుతూ అంది.

"ఏదో ఒకటి... అయినా ఏం... అంత కోప్పడుతున్నావ్? హీ ఈజ్ ఎ పవర్‌ఫుల్ పర్సన్. నీ కూడా పదిమంది అలా వస్తారా? ఒకవేళ ఎవరైనా వచ్చినా నువ్ అంత ఓపిగ్గా నవ్వుతూ



మాట్లాడతావా? వని మనుమలు కొంచెం గట్టిగా మాట్లాడితేనే కోపంగా అరుస్తావే... ఏమైనా అతనిలో ఓ ప్రత్యేకత కనబడింది. అందుకే అతని గురించి అడిగాను. మధ్యలో నీకెందుకు కోపం''? మీరా జగదీష్‌ని ఓ దులుపు దులిపింది.

''యూ ఆర్ టాకింగ్ టూమచ్! నేనేమన్నాను... 'ఎందుకా వేస్ట్ మనుమల గురించి మాట్లాడటం, మనటైం వేస్ట్ కదా' అన్నాను.



ఎవరో ఏదో చేస్తోంటే మనకెందుకు సవాలక్ష మంది అలా బతుకుతారు. అదోరకం లైఫ్'' ! జగదీష్ మీరాని 'నోర్మూసుకో అన్నట్లుగా చూసి కొట్టిపారేశాడు.

''ఏమోలెండి, తెలియనివాళ్ల గురించి మనం ఏమీ అనుకోలేం కదా''. జ్యోత్స్న అంది.

''వాళ్ల గురించి ఏం తెలుసుకోవాలండీ... ప్రజలకి ఏవో మాయమాటలు చెప్పి నమ్మిస్తూ మోసం చేస్తుంటారు. పనీ పాటా లేనివాళ్లు ఈ విధంగా తయారవుతారు. వీళ్ళెందుకూ పనికి రారని తెలిసినా రాజకీయ నాయకులు కనీసం తమ ప్రచారానికైనా వాడుకొందామని కూడా తప్పుకుంటూంటారు. అది ఆసరాగా తీసుకుని గొప్పగా కాలరెగరేసుకుని తిరుగుతుంటారు వీళ్ళు'' జగదీష్ ఆవేశంగా అన్నాడు.

జగదీష్ ఆవేశానికి కారణం అర్ధం కాలేదు మీరాకి, జ్యోత్స్నకి. ''నీ ఇష్టం వచ్చినట్లు మాట్లాడకు, అసలు అతని గురించి నీకేం తెలుసని అలా మాట్లాడుతున్నావ్''? మీరా అంది.

జ్యోత్స్న అప్రయత్నంగా వచ్చిన నవ్వుని ఆపుకుంటూ అంది ''సర్లెండి! యింక లెండి నాకు ఆకలేస్తోంది''

ముగ్గురూ డిన్నర్‌కి లేచారు.

డిన్నర్ అయిపోయాక జ్యోత్స్న సెలవు తీసుకుంటానని చెప్పి బయల్దేరబోతూండగా మీరా మళ్లీ అభిషేక్ టాపిక్ తీసింది.

''అభిషేక్... మీ నాన్నగారి పి.ఏ.నా?''

''నో నో హీ ఈజ్ నాట్ పి.ఏ! నో'' ! జ్యోత్స్న ఎందుకో అరచినట్లుగా చెప్పింది.

మీరా ఆశ్చర్యంగా చూసింది. జ్యోత్స్న మీరా చూపులకి సమాధానం ఇవ్వకుండా చూపు మరల్చింది.

జ్యోత్స్న బయటికి అడుగుపెట్టింది.

★ ★ ★

అభిషేక్....

జగదీష్....

ఇద్దరూ జ్యోత్స్న ఆలోచనల్లో చోటుచేసుకుంటున్నారు. ఇద్దరూ కూడా బిజీ వ్యక్తులే.

ఒకరు వ్యాపారపరంగా, మరొకరు రాజకీయపరంగా.

జగదీష్ కోటీశ్వరుడు. కట్టుకునే బట్టల దగ్గర్నుంచి కారు కలర్‌వరకూ ప్రత్యేకంగా కావాలనుకునేరకం. సాధారణ విషయాలను పట్టించుకోటానికి అసలు ఇష్టపడడు.

అభిషేక్ సామాన్యజన సమస్యలనే తన సమస్యలుగా తలకెక్కించుకునే ప్రజల మనిషి. సాధారణ విషయాలే అతనికి రోజూ ఎదురయ్యేవి. వాటి సాధనకోసమే శ్రమిస్తాడు.

''జగదీష్ జీవితం ప్రణాళికాబద్ధమైంది. ముందుగా అనుకొన్నట్లుగానే నడవడానికి ప్రయత్నిస్తుంటాడు. సామాన్యజనం జగదీష్ కనుచూపుమేరలో కనిపించరు. ఒకవేళ ఎదురైనా, ఆ జనంలోంచి ఎదైనా సమస్య వచ్చినా జగదీష్‌కి అది లెక్కలోనిది కాదు. జగదీష్‌వల్ల ఏ ప్రయోజనం ఎలా పొందాలి అని ఆలోచించే జనం వున్నా వాళ్ల అవసరాలకు జగదీష్ ఉపయోగపడతాడనే నమ్మకంలేదు''

''అభిషేక్ నా గురించి పట్టించుకుని వుండడు. నేను ఎదురైతే గుర్తుపడతాడో లేదో... అనుమానమే! అభిషేక్ ఓ ప్రవాహంలా కనిపిస్తాడు. తనని తప్పకుండా మర్చిపోయుంటాడు. అవును... అతని ముందుకు అనేక రకాలుగా వచ్చే ప్రజల్లో నేను కూడా ఒకదాన్ని. నేను మంత్రి రాయలు కూతుర్నే అని తెలిస్తే అనవసరంగా కంగారుపడి మర్యాదపెంచి మామూలు ప్రజలస్థాయి నుంచి అమాంతంగా నన్ను పెంచేసి నేను కనిపించినా కూడా గౌరవం ప్రకటించి పక్కకి తప్పుకుంటాడేమో. ఏమో ఏమిటి? అది ఖచ్చితంగా జరుగుతుంది. అందుకే రాయలు కూతురు తనే అని అభిషేక్‌కి తెలియనివ్వకుండా జాగ్రత్తపడాలి.

''జగదీష్‌కి తనెవరో తెలుసు. ప్రస్తుతం తాను మంత్రి కూతురు. జగదీష్ దృష్టిలో కొంచెం సమానస్థాయి. జగదీష్ తనని కోరుకుంటున్నాడని అతని కళ్లే చెప్పాయి.

''జగదీష్ కోరుకుంటే అతనికున్న అందం, హెూదా, గొప్పతనానికి ఎందరో అమ్మాయిలు దొరుకుతారు. తనకన్నా అందగత్తెలు అతన్ని వరించి మరీ వస్తారు. కానీ జగదీష్ తనకి





అన్నిరకాలుగా నచ్చినా ఏదో వెలితి కని పిస్తోంది. అది మాటల్లో చెప్పటానికి వీలుకావ టంలేదు. జగదీష్ తన మనస్సులో సంతృప్తిని కలిగించలేకపోతున్నాడు. అతనికి అన్ని అర్హ తలున్నా తన మనసెందుకో అతనిపట్ల అంత సుముఖంగా లేదు!'

జ్యోత్స్న డిన్నర్ తర్వాత ఇంటికి వచ్చి పడుకున్నా నిద్ర రావటంలేదు. అభిషేక్, జగదీష్ ఇద్దరూ తలపుల్లోకి వచ్చి తట్టి లేపుతు న్నారు.

జగదీష్ ఆలోచనల్లో చోటుచేసుకుంటున్నా అభిషేక్ జ్యోత్స్న అంతరంగంలో పదేపదే మెదులుతున్నాడు.

"అభిషేక్ తన తెలివితేటలన్నీ మంత్రిరా యలు అభివృద్ధికి ఉపయోగిస్తున్నాడా?" ఈ ప్రశ్న జ్యోత్స్నని కలవరపెడుతోంది. "తన తండ్రి అభిషేక్ తెలివిని దోచుకుంటున్నాడా? అభిషేక్నీ, అభిషేక్ తెలివితేటల్నీ వాడు కుంటూ, తన తండ్రి పైకివస్తూ అభిషేక్ని అక్కడే వుంచేస్తున్నాడా? ప్రస్తుత సమాజానికి అభిషేక్ తిరుగులేని మందులాంటివాడు. ఎదుటివాళ్లను నొప్పించకుండా, తప్పించుకు తిరగకుండా వాళ్లకి సరైన సలహాలు, సహాయా లు అందించే ఒక ఆధునిక యువకుడు. అతను... అలాంటివాడు తన సమస్తశక్తియుక్తు ల్నీ తన తండ్రి రాయలుకోసమే ధారపోస్తు న్నాడా?" జ్యోత్స్నకి ఈ భావనలు కంగారుపు ట్టించాయి. "బాగా చదువూ, సంస్కారం వున్న అభిషేక్ ఈ రాజకీయాల్లోకి ఎందుకు రావాలి. హాయిగా ఉద్యోగం చేసుకుంటూ వుండొచ్చు కదా! అభిషేక్ తన తండ్రి అడే రాజకీయ చదరంగంలో అపురూపమైన పావులా ఎందుకు మారాడు? అభిషేక్ భవిష్యత్తు ఏమ వుతుంది? ఈ రకంగా అతని తెలివితేటలు ఎవరి ప్రయోజనానికో ఉపయోగపడుతూపోతే ఆఖరికి అతనేమవుతాడు?"

ఛ... అయినా అసలు అభిషేక్ భవిష్యత్ గురించి తనెందుకు ఆలోచించాలి?

ఏం... ఎందుకు ఆలోచించకూడదు? ఈ దేశంలోని ఒక బాధ్యతాయుతమైన యువతిగా ప్రతివాళ్ల గురించీ ఆలోచించాలి. "ఇంతవ రకూ ఎంతమంది గురించి ఆలోచించావు?" మనసు నిలదీసింది. "నీదో గొడవ... అలాంటి అవకాశం ఇప్పుడే కదా వచ్చింది"- జ్యోత్స్న సర్దిచెప్పింది. 'నిజమా'? మనసు అడిగింది.

"ముమ్మాటికీ నిజం! ఒక సంస్కారవంతు డు, చదువు, తెలివి వున్న యువకుడు యిలా రాజకీయాల్లోకి చేరి తన మేధస్సంతా ఎవరి స్వార్థరాజకీయ బంగారు భవిష్యత్ నిర్మాణ కార్యక్రమంలోనే వృథా చెయ్యటం సమంజ సమా? ఆ తెలివితేటలు ఆ రకంగా వృథా అయితే ఈ దేశపు యువశక్తి నిర్వీర్యం కాదా?"

"పోనీ అతని గొడవ తనకెందుకు? ఎందు కేమిటి? అతను బలిచేసే మేధస్సు తనతండ్రి రాజకీయ ప్రయోజనాలకే కదా! అందుకే బాధ. ఎందుకో అతనిపట్ల అభిమానంతోపాటూ జాలి కల్గుతోంది. ఎట్టి పరిస్థితుల్లోనూ అతని మేధస్సు ఇలా వృథా కాకూడదు. ఏదో ఒకటి చెయ్యాలి కానీ... ఏం చెయ్యాలి?.." "అభి షేక్ని ఈ రాజకీయాలకు దూరం చెయ్యాలి. ఎలా? దూరం చేసి... ఎక్కడైనా మంచి ఉద్యోగం చూసుకోమనాలి. ఉద్యోగం చెయ్యటా నికి అభిషేక్ ఇష్టపడతాడా? అయినా నేను చెపితే వింటాడా? కాదు... వినేటట్టు చెపుతాను, ఒప్పిస్తాను. 'నా మీద నీకేం అధికారం వుంది' అంటాడా అతడు లేక ఉద్యోగంలో చేరుతాడా? ఒకవేళ ఉద్యోగంలో చేరాడే అనుకో... ఒక యువకుడిని సరైనమార్గంలో పెట్టానని తృప్తి పడాలా? ఆ తృప్తి చాలా? అబ్బే... ఎందుకో హితంగా లేదు. అభిషేక్కి ఉద్యోగం యిప్పిస్తే అతనితో అంతటితో సరా?"- ఏమిటీ మనసు, ఎందుకిలా ప్రశ్నిస్తోందివాళ... జ్యోత్స్న అంత రంగంలోకి ప్రవేశించిన అభిషేక్ సంక్షోభంలో పడేశాడు ఆమెని.

ఆమె తలపుల్లోకి వస్తున్నాడు.

ఆలోచనగా మారుతున్నాడు.

"మనసేమన్నా ఫరవాలేదు... ఎన్నెన్ని సందే హాలు, ఆ మనసు నా ముందుంచినా నేను లెక్కచెయ్యను. కానీ అభిషేక్ని మార్చాలి. ఎందుకోసం? ఎందుకోసమైనా సరే, అతన్ని మార్చితీరాలి. అతనితో మాట్లాడాలి. ఎవరని మాట్లాడుతావ్? ఈ ప్రజల్లో ఒక ప్రజగా, అతని కి అభిమానిగా, యువతరం ప్రతినిధిగా, ఒక శ్రేయోభిలాషిగా... ఏం? ఎందుకు మాట్లాడకూ



డదు? ఏవంటాడు? మాట్లాడనంటాడా... అదీ చూస్తాను. ఈ ప్రయత్నం ఎలాగైనా చేసి తీరుతాను'' జ్యోత్స్న ఓ స్థిరమైన నిర్ణయం తీసుకుని హాయిగా నిద్రలోకి జారుకుంది.

★ ★ ★

అభిషేక్ ఆరోజు మనసులోనే చాలా విచారిస్తున్నాడు. పైకి ఏమాత్రం తెలియకపోయినా మనిషి మధనపడ్తున్నాడు. ఆరోజు ఓ ప్రముఖ దినపత్రిక మంత్రిరాయలు మీద ఓ వార్త ప్రచురించింది. రాయలు పరిశ్రమల మంత్రిగా తన జిల్లాని గుప్పెట్లో పెట్టుకోవటానికి, జిల్లా పారిశ్రామికవేత్తలపై ఒత్తిడి తీసుకువస్తున్నాడని, ఆ జిల్లావారికే ప్రాధాన్యత ఇస్తూ మిగతావారిని విస్మరిస్తున్నాడనీ, జిల్లాలోని ఒక యువనాయకుడి పలుకుబడిని పెంచాలని ప్రయత్నిస్తున్నాడని, తద్వారా జిల్లా కార్మికవర్గాన్ని తన అధీనంలో ఉంచుకోవాలని చూస్తున్నాడని ఇలా తలా తోకా లేకుండా రాశారు ఆ వార్త.

ఆ వార్త రెండుమూడుసార్లు చదివాడు అభిషేక్. ఆ వార్త తనను దెబ్బ తియ్యటానికి ఎవరో చేసిన ప్రయత్నమని అభిషేక్‌కి అర్థం అయింది. ఇక వివరాల్లోకి పోలేదు. రాయలు, అభిషేక్ ఆ వార్త గురించి రెండుగంటలు చర్చ జరిపారు. అభిషేక్ ఒకరకంగా అది కరక్టే అన్నాడు.

''సార్... మనం ఈమధ్య మన కార్మిక సంఘాల విషయం పక్కనపెట్టాం. ఆ వార్తలో మనకో హెచ్చరిక వుంది. ఆ సంఘాలను మన చేతిలో ఉంచుకోకపోతే, వచ్చే ఎన్నికల్లో దెబ్బ తింటామని వాళ్లు చెప్పనట్లుగా చెప్పారు. ఇక్కడ వ్యవహారాలు చూసుకోటానికి మీ బావమరిది ఎలాగూ వున్నారు. ఆ పైన అధికార్లున్నారు. నేను వైజాగ్ వెళ్లిపోతాను. కార్మిక సంఘాల ఎన్నికలు వస్తున్నాయి. ఆ సంగతి నేను చూసుకుంటాను. మేజర్ యూనియన్లు మనకు దక్కితే, వచ్చే ఎన్నికల్లో సమస్య వుండదు. ఈ సమయంలో ఈ వార్త వేశారంటే, ఎక్కడో మనమీద పోటీ వస్తోందని నా అనుమానం. దాన్ని ఎదుర్కోవాలంటే, మన నియోజకవర్గంలో, మనం గట్టిగా వుండాలి''. అభిషేక్ ఆగి రాయలుకేసి చూశాడు.

''ఆఁ... ఆ పాయింటే కరెక్టయ్యా. ఎవడో యిది పనిగట్టుకుని చేయించాడు. సరే... నువ్ చెప్పినట్లే చేద్దాం. కానీ ఇక్కడ నాకు ఇబ్బంది అవుతుందేమో''! రాయలు మొహమాటంగా చూశాడు. కానీ రాయలు మనసులో కూడా అభిషేక్ కొంతకాలం వైజాగ్‌లో వుంటే మంచిదని వుంది.

''అది కాదు సర్... ఇక్కడ నేను వుంటే నిజంగానే ఆ వార్తను నిజం చేసిన వారవ్వచ్చు. నేను అక్కడికెళితే ఏ గొడవా వుండదు!'' అభిషేక్ ఆగాడు.

''సరే... నీ ఇష్టం'' అన్నాడు రాయలు.

ఆరోజే వైజాగ్‌కు ప్రయాణమయ్యాడు అభిషేక్.

మంత్రి రాయలునుంచి అభిషేక్‌ని ఆవిధంగా తప్పించినందుకు జగదీష్ స్వరూప్ అనే స్నేహితుడికి మంచి పార్టీ యిచ్చాడు. స్వరూప్, అభిషేక్‌ని రాయలు దగ్గర్నుంచి తప్పించటానికి ఓ ప్రముఖ పత్రికాప్రతినిధిని ఆకట్టుకుని ఆ వార్త వేయించాడు. అగమ్యగోచరంగా వున్న ఆ వార్తని చూసి జగదీష్ నవ్వుకున్నా అది అభిషేక్‌ని దెబ్బతీసినందుకు సంతోషించాడు.

★ ★ ★

వైజాగ్ చేరిన అభిషేక్ రాయలుకంటే బిజీ వ్యక్తి అయ్యాడు. ప్రముఖ కార్మిక సంఘాలకు నాయకుడిగా మళ్లీ ఎన్నికయ్యాడు. కార్మికుల సమస్యలను తీసుకుని యాజమాన్యాలతో చర్చలకు దిగాడు. చర్చలు ఫలించని సందర్భాల్లో రోడ్లెక్కాడు. సమ్మెలు నిర్వహించాడు. నిరాహార దీక్ష శిబిరాల్లో పాల్గొన్నాడు. యాజమాన్యాలను ఆఖరికి సంధి సంప్రదింపులస్థాయికి దించి విజయం తనదే అని కార్మికవర్గం భావించేటట్టు చేసుకున్నాడు.

వైజాగ్‌లోని పెద్దకార్మిక సంఘాలతోపాటు జి.కె.ఎస్టేట్ కార్మిక సంఘం నాయకుడిగా కూడా మారిన అభిషేక్ మళ్ళీ జగదీష్‌కి సమస్యలా తయారయ్యాడు. జి.కె.ఎస్టేట్ కార్మిక సంఘానికి జరిగిన ఎన్నికల్లో అభిషేక్ ఓడిపోవాలని జగదీష్ చాలా ప్రయత్నించాడు. డబ్బు విచ్చలవిడిగా ఖర్చుపెట్టాడు. అభిషేక్‌ని నిందిస్తూ వేలసంఖ్యలో కరపత్రాలు




వచ్చాయి. ఆ కరపత్రాలు అభిషేక్‌ని మరింతగా పెంచాయి. జగదీష్ అడుగులకు మడుగులొత్తే నాయకులు తమకు వద్దన్నారు కార్మికులు. అభిషేక్‌లాంటి చదువుకొన్న యువకుడుంటే సమస్యలు కొంతవరకైనా పరిష్కరించబడ్తాయి అని నమ్మారు. దాంతో అభిషేక్ ఆ కార్మిక సంఘానికి పెద్దమెజారిటీతో ఎన్నికయ్యాడు.

అభిషేక్‌కి వుండటానికి ఓ ఇల్లు ఇచ్చారు. ఫోను, ఇతర సౌకర్యాలు కలిగాయి. కార్మిక సంఘాల కార్యాలయాలే అభిషేక్ ఆఫీస్ గదులయ్యాయి. ఎంతసేపూ కార్మిక సమస్యలూ, ప్రజలపాట్లూ తప్పించి అభిషేక్ ఇంటికి వెళ్ళటమే తక్కువ. వెళ్ళినా కూడా అది రాత్రి ఏ పన్నెండు గంటలకో! అన్నా, వదినలని కూడా తన ఇంట్లో వుంచుకుందామంటే అన్నగారికి మళ్ళీ హైదరాబాద్ బదిలీ అయి ఆర్నెల్లయింది. ఆ ఇంట్లో అభిషేక్ ఎక్కువగా వుండకపోయినా ఎవరెవరో ఎప్పుడూ వుంటారు. కార్మికుల పిల్లలూ, ఇతర ఊర్లనుంచి వచ్చిన కార్మిక నాయకులు... పనులమీద వచ్చిన జనంతో ఆ ఇల్లు ఎప్పుడూ నిండుగానే వుంటుంది. విశాఖపట్నంలో మంచినీటి సమస్య తలెత్తింది.

పేదలుండే ప్రాంతాల్లో గొట్టపుబావులు ఎక్కువగా తవ్వించటంలేదనేది ఆరోపణ. అభిషేక్ ఆ సమస్యని ప్రజాసమస్య చేశాడు. పెద్ద ఊరేగింపు జరిపి జిల్లా కలెక్టరు, మేయరూ హామీ ఇచ్చి పని మొదలుపెట్టేవరకూ ఆ ఉద్యమాన్ని ఆపలేదు. ఆ ఉద్యమంతో పేదవర్గాలకు బాగా సన్నిహితుడయ్యాడు.

అభిషేక్ ఎక్కడున్నా ప్రజలే ఏభైమందికి తక్కువ అతని చుట్టూ వుండే ప్రసక్తేలేదు. ఎవర్నీ కాదనడు. ఎవరైనా తనని తప్పుడు పనులకు ఉపయోగించుకోవాలని చూస్తే కళ్ళతోనే కనిపెట్టేస్తాడు.

"ఇది మనకు బాగుండదండీ, మీరే ఆలోచించండి. మనం ఇలా చేస్తే రేపు మనమాట ఎవడు వింటాడు?" అని అందరి ముందూ నవ్వుతూ వాళ్ళని అడిగేస్తాడు.

వాళ్ళు "కాదుసర్" అంటూ వాదించినా అభిషేక్ వాళ్ళకి నచ్చచెప్పి పంపిస్తుంటాడు. ఇలాంటివి రోజూ మామూలు కావటంతో పెద్దగా వాటిగురించి ఆలోచించటమే మానుకున్నాడు.

అభిషేక్ విశాఖపట్నంలోనే వుంటున్నాడని తెలిసి- ఎలాగైనా కలవాలి అనుకున్న జ్యోత్స్న ఏదో పనిపెట్టుకుని వైజాగ్ వచ్చింది. వచ్చిన రెండు రోజులవరకూ అభిషేక్ ఎక్కడుండేదీ ఖచ్చితంగా తెలియలేదు. ఆఖరికి అతను రోజూ సందర్శించే స్థలాలన్నీ తెలుసుకుంది.

ఆ రోజు స్టీల్‌ప్లాంట్ ఫాక్టరీ కార్మిక సంఘాల కార్యాలయంలో మధ్యాహ్నం అభిషేక్ వుంటాడని తెలిసి అక్కడికి వెళ్ళింది జ్యోత్స్న. మధ్యాహ్నం ఒంటిగంటకల్లా అక్కడ వుందితను. 'అభిషేక్ వస్తాడంటారు' కానీ ఎన్నింటికి వస్తాడో అక్కడివాళ్ళు చెప్పలేకపోతున్నారు. అయినా వాళ్ళు వాళ్ళపనులు చూసుకుంటూనే అభిషేక్ రాకకోసం ఎదురు చూస్తున్నారు.

నాల్గవుతోందనగా జీప్ నిండా జనంతో అభిషేక్ వచ్చాడు. జ్యోత్స్న ఓ మూలగా వుండటంతో ఆమెను చూడకుండానే యూనియన్ ఆఫీస్‌లోపలికి వెళ్ళిపోయాడు. అప్పటివరకూ కనిపించని కార్మికులు ఎక్కడి నుంచి వచ్చారోగానీ వందల సంఖ్యలో లోపలికి పోతున్నారు, వస్తున్నారు. ఊపిరి సలపని ఆ పరిస్థితిని తట్టుకొని అభిషేక్ బయటకు వచ్చేసరికి ఏడు గంటలయింది. "నమస్తే"... అంటూ ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా అభిషేక్ ముందుకొచ్చి నిలబడింది జ్యోత్స్న.

"ఆ... నమస్తే"... అన్నాడేగానీ అభిషేక్, ఆమెను ఎక్కడ చూశానబ్బా అనుకుంటూనే "ఏమ్మా... ఎవరు కావాలి?" అంటూ లాలనగా అడిగాడు. జ్యోత్స్నకి కోపం వచ్చింది.

"మీతో పనుంది... మాట్లాడాలి" అంది.

"ఇప్పుడా... మీరేమనుకోవద్దు. ఈ రోజు అర్జెంట్ పనిమీద వెళ్తున్నాను. రేపు కలుద్దాం". అంటూ అభిషేక్ కదలబోయాడు.

"ఒక్క నిముషమండీ..." జ్యోత్స్న అనడంతో ఆగాడు, "రేపు ఎక్కడ కలవమంటారు? మీరేమో దొరకటం..." అంటూ "మిమ్మల్ని పట్టుకోవటం అంత తేలికకాదేమో" అన్నట్లు

చూసింది.

"మీరే చెప్పండి... నేనే అక్కడికి వస్తాను. మీరన్నది నిజమే- నేనెక్కడుంటానో నాకే తెలీదు" అభిషేక్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"రేపు సాయంత్రం ఐదింటికి హొటల్ మయూరిలో... మీకు వీలవుతుందా? అంటూ నువ్ రాగలవా అనే అర్థం వచ్చేటట్లు చూసింది.

"సరేనండీ"- అంటూ ఆమె సమాధానం వినకుండానే అభిషేక్ ముందుకి కదిలాడు.

మర్నాడు నాల్గున్నరకే హొటల్‌కి వచ్చి కూర్చున్న జ్యోత్స్నకి ఎనిమిదిన్నరయినా అభిషేక్ జాడ కనిపించలేదు కానీ ఎనిమిదిన్నర దాటుతుండగా అక్కడ జగదీష్ కనిపించాడు జ్యోత్స్నకి. జగదీష్‌తోపాటు మరెవరో ఫ్రెండ్ వున్నాడు. జ్యోత్స్న దగ్గరికి వచ్చి మంత్రిగార మ్మాయిని పరిచయంచేశాడు తన ఫ్రెండ్‌కి.

వాళ్ళతోపాటూ డిన్నర్‌కి రమ్మని జ్యోత్స్నని బలవంతంచేశాడు. ఆ పరిస్థితుల్లో జ్యోత్స్నకి ఒకవైపు ఆకలి, మరోవైపు అభిషేక్‌మీద కోపం తారాస్థాయిలో వున్నాయి. దాంతో జగదీష్ ఆహ్వానాన్ని మన్నించక తప్పలేదు.

డిన్నర్ అయింతర్వాత ఇంటికివెళ్ళిన జ్యోత్స్న మళ్ళీ అభిషేక్‌ను గుర్చిన ఆలోచనల్లో పడిపోయింది.

అభిషేక్‌మీద విపరీతమైన కోపం వచ్చింది. అసలతని ముఖం చూడకూడదని నిశ్చయించుకొంది. ఒక యువతి కావాలని, కలిసి మాట్లాడాలని కోరితే లెఖ్ఖచెయ్యకుండా ఎందుకిలా ప్రవర్తించాడు. అతనేం గొప్ప అందగాడా... కాదు. గొప్పవాడా... కానేకాదు. ఫ్యాక్టరీలకు అధిపతా... అసలేకాదు! అయినా ఎందుకింత తేలికభావం ప్రదర్శించాడు. కావాలని తాను వెళ్ళి తప్పుచేసిందా? ఏమో... అయినా అభిషేక్ గొప్ప అందగాడుకాదనీ, గొప్పవాడుకాదనీ తనకి ముందు తెలీదా ... తెలును! మరెందుకు కలవాలనుకొంది. అదే తప్పయింది. మనసెందుకో ఊరుకోవటంలేదు. అభిషేక్‌మీద కోపం పెరిగిపెరిగి అతనికి ఫోన్‌చేసింది. అతను రాలేదన్న జవాబు

"రాత్రి నిద్రలేకపోయినాసరే! ఈ రోజు అభిషేక్‌ని నిలదీయాలి" జ్యోత్స్న నిర్ణయించుకుంది.

రాత్రి పన్నెండు దాటింతర్వాత అభిషేక్ ఫోనులో దొరికాడు. "వెరీ సారీ ... మీరు నాలుగైదుసార్లు ఫోన్‌చేశారట" అని చెబుతూండగానే "నాకు సంజాయిషీలు అనవసరం. మీరు వస్తానని ఎందుకుచెప్పారు? ఎంతసేపు వెయిట్‌చేశానో తెలుసా? ఒక నాయకుడిగా మీరు చెయ్యాల్సిన పనేనా యిది. మీకు వీలుకాకపోతే రానని చెప్పి వుండాల్సింది. కనీసం కర్టసీకూడా లేకుండా ప్రవర్తించారు. మీకు పనితగిలిందే అనుకోండి... హొటల్‌కి ఫోన్‌చేసి నాకు చెప్పవచ్చుకదా! అంత కామన్‌సెన్స్‌లేకుండా వుంటారని నేనను కోలేదు. మీకు మీ రాజకీయాలు ముఖ్యం... కాదనను- ఒక ఆడది... మీతో మాట్లాడాలని అడిగిందికదాని తేలికగా చూస్తున్నారా? నేను ఈ దేశపు యువతరం ప్రతినిధిగా మీతో మాట్లాడాలని వచ్చాను. మీరు ఇంత దారుణంగా ప్రవర్తిస్తారని నేననుకోలేదు." జ్యోత్స్న ఆగటంతో "ఇంకా ఏమైనా వుంటే తిట్టండి, పడతాను... నాది తప్పయింది- క్షమించండి. ఒక్కనిముషం ఓపికపడితే అసలు విషయం చెబుతాను. లేదంటే మీ ఇష్టం." అభిషేక్ అర్థించాడు.

"ఏమిటి?"

"ఓ కెమికల్ ఫాక్టరీలో గాస్ సిలెండర్లు పేలి ముగ్గురు చనిపోయారు. అక్కడకి వెళ్ళి ఆ తర్వాత చనిపోయినవాళ్ళ కుటుంబాలను పరామర్శించి, ఫాక్టరీవాళ్ళతో మాట్లాడి యిప్పుడే వచ్చాను. మీరు నాలుగైదుసార్లు ఫోన్‌చేశారని చెప్పారు. అసలు మీకు ఫోన్‌చేసే వెళ్దామనుకున్నాను కానీ... మీరెవరో... మీ పేరేమిటో... సారీ... అందుకేతప్ప మిమ్మల్ని వెయిట్‌చేయించి బాధపెట్టేంత సంస్కారహీనుణ్ణి కాదండీ... ఏమైనా మిస్టేక్ ఈజ్ మైన్... క్షమించండి"

జ్యోత్స్న కొంచెం తగ్గింది- "సారీ అభిషేక్‌గారూ... నేను కోపంలో అవన్నీ ఆలోచించలేదు... వెరీసారీ. ఇంతకీ ఏక్సిడెంట్ ఎప్పుడు జరిగింది?" జ్యోత్స్న ఏదో మాట్లాడాలని అడి





గింది.

"సాయంత్రం నాల్గున్నరకి. ముగ్గురూ స్పాట్‌లోనే చనిపోయారు. ముగ్గురికి చాలా గాయాలు తగిలాయి"

"సారీ అండీ... కార్మికులు చనిపోతే అది వదిలేసి అంత ప్రమాదం జరిగినా అది పట్టించుకోకుండా నా పనికోసం రమ్మనేంత స్వార్థపరురాలిని కాదులెండి. ఏదో కోపంతో అలా మాట్లాడాను"- జ్యోత్స్న సర్దుకుంది.

"రేపు మాత్రం ష్యూర్‌గా కలుస్తాను... మీ ఇల్లెక్కడ?"

"ఇళ్లూ, హోటళ్లూ ఎందుకులెండి... రేపు మీకు వీలయితే బీచ్‌లో కలుద్దాం"

"ఓ.కే... ఆరింటికల్లా నేనక్కడ వుంటాను" ఈసారి అభిషేక్ కంఠం స్థిరంగా వుంది.

"సరే... వుంటానండీ" జ్యోత్స్న ఫోన్ క్రెడిల్ చేసింది.

బాగా అలసిపోయిన అభిషేక్ పక్కమీద వాలగానే గాఢనిద్రలోకి జారిపోయాడు.

ఆలోచనల మధ్య చిక్కిన జ్యోత్స్నని నిద్ర ఆవహించటం లేదు.

"అభిషేక్ ఎంత సంస్కారవంతుడు. అర్ధరాత్రి అలసిపోయినా ఫోనులో చక్కగా మాట్లాడాడు. ఎంత సూటి మనిషి. తన పేరు తెలీదని తనకే చెప్పాడు. ఛ... అనవసరంగా నేనెక్కువ మాట్లాడానేమో... కారణం తెలుసుకున్న తర్వాత మాట్లాడవల్సింది. అయినా అతను ఎంత కూల్‌గా సమాధానమిచ్చాడు. అభిషేక్‌కి ఎంతసేపూ ప్రజలు కావాలి; బాధలో వున్న ప్రజలకి అభిషేక్ ఊరడింపు కావాలి. ఇప్పుడు తనూ అభిషేక్ కోసం వచ్చింది. అభిషేక్ తనకు కావాలి. అతన్ని సంస్కరించుకుంటోందా? స్నేహమే అనురాగం అవుతుందా?" అలా అభిషేక్ గూర్చి ఆలోచిస్తున్నప్పుడల్లా జగదీష్ కూడా ఆమె ఆలోచనల్లో చోటు చేసుకుంటాడు.

"ఈ జగదీషేమిటి? కనిపించినప్పుడల్లా అలా తినేసేలా చూస్తాడు. గొప్పవాడు కాబట్టి తను అతనికి దగ్గరవ్వాలని అనుకొంటున్నాడా? జగదీష్ 'తనమాట నేను వినాలి' అన్నట్లుగా ప్రవర్తిస్తున్నాడు. 'డిన్నర్‌కి రావాలంతే' అన్నాడు. ఏమిటీ... అతని ఆధిక్యత? డబ్బూ హోదా వుంటే మాత్రం నన్ను ఏ అధికారంతో అలా చూస్తున్నాడు అతను ఏ అధికారమైనా వుందనుకుంటే చాలా? నో... అతని ప్రవర్తన ఏమాత్రం నచ్చటంలేదు నాకు.

అవును... అతన్ని దూరంగా వుంచటం ఉత్తమం. కానీ అతను మాత్రం నాకు దగ్గరవటానికి చాలా కష్టపడుతున్నాడు అనుకుంది జ్యోత్స్న. మళ్లీ అభిషేక్ మెదిలాడు ఆమె బుర్రలో. "ఈ అభిషేక్ నన్ను దూరంగానే వుంచుతున్నాడా? అదే నేను రాయలు కూతుర్నని తెలిస్తే అసలే ముఖం చాటేస్తాడేమో? ఏమో... రాజకీయ నాయకుడు కదా ఎలా నమ్మటం. రాయలు కూతుర్ని అని నా అంతట నేను చెప్పకపోయినా ఇవాళ కాకపోతే రేపో ఎల్లుండో అతనికి ఈ విషయం తెలిసిపోవటం ఖాయం. వైజాగ్ కాబట్టి కొంచెం కష్టమే తనని గుర్తుపట్టడం. జగదీష్ తప్ప నన్ను గుర్తుపట్టే వాళ్లు చాలా తక్కువ. అభిషేక్‌కి అవకాశం ఇవ్వకూడదు. అలా నేను రాయలు కూతుర్నని తెలిస్తే నాకు చాలా దూరం అవుతాడు. ఎందుకో తను అతనికి దగ్గర కావాలనుకొంటోంది" ఆలోచిస్తూ ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయింది జ్యోత్స్న.

ఉదయం నిద్రలేస్తూండగానే ఫోన్ మోగింది. అభిషేకేమో అనుకుంటూ ఒళ్లు విరుచుకుని ఫోన్ అందుకుంది. అవతలి కంఠం మీరాది.

"నువ్వెప్పుడొచ్చావ్?" అడిగింది జ్యోత్స్న.

"నిన్న ఈవినింగ్" అని ఆగి "ఏమిటీ... మా అన్నయ్య, నువ్వు నిన్న హోటల్లో డిన్నర్ చేశారట" ఏదో జోక్ చేస్తున్నట్టడిగింది మీరా.

జ్యోత్స్నకి కొంచెం కోపం వచ్చింది. ఉదయాన్నే ఆమె ఫోన్‌చేసి అలా మాట్లాడటం ఎందుకో జ్యోత్స్నకి నచ్చలేదు.

"వ్వాట్ ఆర్‌యూ టాకింగ్? మీరా... డోంట్ బి సిల్లీ. నిన్న ఎవరో ఫ్రెండ్‌కోసం ఎదురుచూస్తూ అక్కడున్నాను. ఆ ఫ్రెండ్ ఏదో అర్జంట్ పనిమీద రాలేదు. ఈలోగా మీ అన్నయ్య కనిపించాడు. బలవంతాన డిన్నర్ అంటూ

నాకు అసలు తినాలని లేకపోయినాతనుకళ్ళాడు. ఏదో రెండు మెతుకులు నోట్లో వేసుకుని బయటపడ్డాను'' జ్యోత్స్న చికాకుతో చెప్పింది.

''సారీ... మా అన్నయ్య చెపితే ముందు ఎరేంజ్ చేసుకున్న డిన్నరేమో అనుకున్నాను'' మీరా నొచ్చుకుంది.

''ఫర్వాలేదులే... ఎన్నిరోజుల ట్రిప్''- జ్యోత్స్న టాపిక్ మార్చింది.

''ఇక్కడుండాలనే వచ్చాను. నువ్వెంత కాలం వుంటావ్?''

''పనయితే రేపే వెళ్లిపోతాను లేకపోతే ఓ వారం వుంటా''

''సర్లే... నేను మీ యింటికి వస్తాను''

''వచ్చేముందు ఫోన్ చేసిరా'' అంటూ జ్యోత్స్న ఫోన్ పెట్టేసింది.

సాయంత్రం అయిదయ్యింది. అభిషేక్ అప్పటికే బీచ్‌కి వచ్చేశాడు. ఆ బీచ్‌లో చాలా కాలం కిందట ఎన్నో సాయంత్రాలు, ఎన్నో వెన్నెల రాత్రులు గడిపాడు. జీవితం మీద విరక్తి కల్గిన బలహీన క్షణాల్లో ఆ ఎగసిపడే కెరటాల్లో కల్సిపోవాలని క్షణకాలం అనుకుని మానుకునేవాడు. ఎందుకో ఆ కెరటాలంటే ఇష్టం... భయం... రెండూనూ. అవి అమాంతం మీదపడి తనను కబళిస్తాయా అనికూడా ఆలోచించేవాడు. దూరంగా వెన్నెల్లో కూడా చీకటిగా ఉవ్వెత్తున లేచే కెరటాలు, ఆ హోరు, హృదయంలో కలిగించే అలజడి, ఏవేవో భావాలు గుండెలో సుళ్ళు తిరగటం, అవి ఆవేశంగా ఆనందంగా ఒకోసారి శోకంగా, కష్టంగా, ఇష్టంగా మారి తనలో ఎన్నెన్నో అనుభూతులను కలిగించేది ఆ బీచ్.

ఆ రోజు...

మయూరి హోటల్ నుంచి రాజీనామా చేసినరోజు... కాదు అనిల్ అర్థంలేని కారణంవల్ల తనచేత రాజీనామా చేయించినరోజు ఇదే బీచ్‌లో తను విపరీతంగా ఆవేశపడ్డాడు. కోపం, బాధ తనని ఎంతగానో ఏడిపించాయి. వాటిల్లోనుంచే వచ్చిన ఆవేశమే ఆరోజు యిక్కడ కూర్చున్న కుర్రాళ్ళని ఆకట్టుకొంది. ఆనాటి ఆ దృశ్యం, ఆ సంఘటన, ఆ ఆవేశం అభిషేక కళ్ళముందుకొచ్చాయి.

★ ★ ★

హోటల్లో ఉద్యోగంలోంచి తీసేసింతర్వాత యింటికి వెళ్ళలేక అభిషేక్ తిన్నగా బీచ్‌కొచ్చి కూర్చున్నాడు. ఎన్నో ఆలోచనల పరంపరలు తనలో సాగుతూండగా పక్కనే వున్న కుర్రాళ్ళు ఏదో చర్చించుకోటం వినపడింది.

వాళ్లు యూనివర్సిటీలో సోషియాలజీ, పొలిటికల్ సైన్స్ చదువుతున్న విద్యార్థులు. కాలేజీలో ఓ సెమినార్ ఏర్పాటు చెయ్యటానికి అక్కడ కూర్చుని రూపకల్పన చేస్తున్నారు. ఏ టాపిక్ పెట్టాలనేది వాళ్ళ చర్చ. నిరుద్యోగ సమస్య, ఆర్థిక పరిస్థితి మెరుగుపరచటానికి యువకులు ఏం చెయ్యాలి, తీవ్రవాదం యువకుల్లో నైరాశ్యం – ఇలా అనేక అంశాలు పెట్టాలని వాళ్ళు అనుకొంటున్నారు. మళ్ళీ వద్దనుకుంటున్నారు,

వాళ్ళ చర్చ ఎంతసేపటికీ ఒకదశకి రావట్లేదని తెలిసే అభిషేక్ వాళ్ళ దగ్గరికి వెళ్ళాడు.

''మీరేమనుకోకపోతే నాకో చిన్న సందేహం'' అన్నాడు.

''ఏమిటి'' అన్నట్లుగా చూశారు ఆ కుర్రాళ్ళు.

''అసలీ సెమినార్ ఎందుకు పెడ్తున్నారు?'' అడిగాడు.

''నువ్వెవరు?'' అన్నట్లుగా చూస్తూ ''కాలేజీలో హెడ్‌ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ ఏర్పాటు చెయ్యమన్నారు కాబట్టి చేస్తున్నాం.'' అని అన్నారు వాళ్ళు.

అభిషేక్ నవ్వాడు. ఆ నవ్వు ''ఓస్ యింతేనా'' అన్నట్లుంది.

''నవ్వుతున్నారెందుకు?'' సూటిగానే ప్రశ్నించారు వాళ్ళు.

''మీ హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ సెమినార్ పెట్టాలి అన్నారు కాబట్టి మీరు ఏర్పాటుచెయ్యటమేనా లేక విద్యార్థులకు పనికివచ్చే సదస్సులు ఏర్పాటుచెయ్యరా?'' అభిషేక్ ప్రశ్నించాడు.

''ఏ సదస్సయినా విద్యార్థుల కోసమేగా?''

''ఈ కాలేజీలు... ఉద్యోగాలు... సంస్థలు... ప్రభుత్వం... అన్నీ విద్యార్థుల కోసమే. నాతో వాదించాలని వాదించవద్దు. నేను చెప్పేది




[illegible]. సదస్సులు, సభలు జరుపుతారు, పెద్దలకు ఇష్టంవచ్చినవాళ్ళని పిలుస్తారు. ఆ సదస్సుకు హాజరయిన వాళ్ళవల్ల తమ పలుకుబడి పెంచుకోవటానికి చూస్తారు. ఆ వచ్చిన పెద్దలు ఏదో మాట్లాడాలి కనక నాలుగు సంబంధంలేని మాటలు ఏరి లింకుపెట్టి మాట్లాడి వెళ్ళిపోతారు. దానివల్ల మనకొరిగేదేమీ లేదు. అంతా విద్యార్థులే చేశారని పైకి చెబుతారు. అజ్ఞాతంగా మీ వెనకవుండి తమ పనులు చేసుకుంటారీపెద్దలు. అందుకే చెప్తున్నా మీకు, ప్రస్తుతం సమాజంలో జరిగే ముఖ్య విషయాలు తెలియాలి... వాటిని వేదికమీద చెప్పి మీరెలా మోసపోతున్నారో, మోసపోతారో వివరించాలి. జీవితం పూలబాట అనుకునే విద్యార్థులకు చదువు అయిన తర్వాత ఎలాంటి దారుణ పరిస్థితులు ఎదురవుతాయో తెలియచెప్పాలి.

అర్థంలేని ఉపన్యాసాలు అక్కర్లేదు. విద్యార్థులకు ఎంతో ప్రయోజనంగా వుండే సమకాలీన సమస్యలమీద చర్చలు జరగాలి. సమాజం విద్యార్థులకు అర్థంకావాలి. ఎన్నో కలలు కంటూ హాయిగా జీవితాన్ని అనుభవించవచ్చు అనే భ్రమలో నేటి యువతరం ఉండకూడదనే సత్యాన్ని చాటిచెప్పాలి. అడుగడుగునా విద్యావంతులకు ఎదురయ్యే దైనందిక జీవిత సమస్యలు మీ ముందుకు యిప్పుడే రావాలి. లేకపోతే రేపటిరోజున నిరాశా నిస్పృహలతో అనేక అడ్డదారులు తొక్కే ప్రమాదం వుంది. అడ్డదార్లు తాత్కాలిక ప్రయోజనాన్ని అందించినా అవి వచ్చేతరాల మేధస్సును అణచివేస్తాయి" అభిషేక్ ఆవేశంగా అన్నాడు.

"సార్... మేం మీతో వాదించం. మీరు చాలా ఆవేశంగా మాట్లాడుతున్నారు. మీలో బాధ వుంది ఏదో ఎదురుదెబ్బతిన్న ఎడ్యుకేటెడ్‌లా వున్నారు. మీరు చెప్పింది నిజం. మాకు ఇంతవరకూ ఏదో సదస్సు నిర్వహించాలి కనుక ఏర్పాటు చెయ్యాలనే అభిప్రాయం వుంది ఇప్పుడది మార్చుకొంటాం. విద్యార్థులకు వాస్తవ జీవితానుభవాలను అందించే ప్రయత్నం చెయ్యాలని మీరన్నమాట మాకెంతో నచ్చింది. ఎలాంటి అంశం తీసుకొంటే అలా మేం చెయ్యగలం... మీరు శ్రమనుకోక కొంచెం మాకీ ఫేవర్ చెయ్యండి సార్" ఓ విద్యార్థి ముందుకొచ్చి అన్నాడు.

"ఏం లేదు బ్రదర్స్ నిరుద్యోగులుగా వున్న వాళ్ళని పిలవండి. వాళ్ళు అనుభవాలు వినండి. ఎందువల్ల వాళ్ళు ఏళ్ళతరబడి నిరుద్యోగులుగా మిగిలిపోతున్నారో తెలుసుకోండి అదే పెద్ద టాపిక్. రేపు మీకు ఉపయోగపడే అతి ముఖ్యమైన అంశం అది. ఉన్నత చదువులు చదివి ఈ దేశంలోని దౌర్భాగ్య లక్షణాలయిన ఆశ్రితపక్షపాతం, లంచగొండితనం, అవినీతి క్రోధం వారి భవిష్యత్తులను ఎలా బలిపెడుతున్నాయో తెలుసుకోండి. మేధస్సు మీద జరిగే హింసాకాండని గుర్తించండి. మన తర్వాతతరాలవారు మనకంటే తెలివైనవారు. ముందుతరాలవారు మన తెలివిని అణగదొక్కటానికి ప్రయత్నిస్తున్నారు. కనీసం మనమైనా అలాంటి అవలక్షణాలకు బానిసలం కాకూడదు. అదే జరిగితే తెలివితేటలు నాశనమై, అవి పక్కదార్లు పట్టి మన జాతినే దెబ్బతీస్తాయి. మేధస్సును సక్రమంగా ఉపయోగించుకోకపోతే అది గాడితప్పి దేశ ప్రగతే దెబ్బతింటుంది... ఇప్పుడదే జరుగుతోంది. మన తరంతో ఈ దారుణం ఆగిపోవాలి. ఎందుకంటే భావితరాలు కూడా మన సమస్యనే ఎదుర్కోకూడదు. అలా జరిగితే వినాశనం ప్రారంభమవుతుంది. దేశం విచ్ఛిన్నమవుతుంది. సమాజం ముక్కలుగా, చెక్కలుగా విడిపోతుంది. భావితరాలవారి తెలివి సద్వినియోగం కాకపోతే అరాచకం ప్రబలుతుంది" అభిషేక్‌లో ఆవేశం మరింత పెరిగింది; విద్యార్థులందరూ అభిషేక్‌కేసే చూస్తున్నారు.

"మీరు మీ ఇళ్ళల్లో చూసే వుంటారు, చిన్నపిల్లలు ఎంత తెలివిగా వుంటారో... ఎం-పరిశీలించారా?"

"అయ్యబాబోయ్! వాళ్ళకి ఓ పట్టాన సమాధానం చెప్పలేమండీ, ఎవరూ చెప్పకుండానే ఎన్నో విషయాలు తెలుసుకుంటారు. వాళ్ళ సందేహాలకు సమాధానాలు పెద్దవాళ్ళే చెప్పలేరు ఒకోసారి"! ఓ విద్యార్థి సాధారణంగా ఇళ్ళల్లో ప్రతివారూ పరిశీలించే విషయం చెప్పాడు.

"అవును... వాట్ విల్ హేప్పెన్ టూ దట్

ఇంటిలిజెన్స్? ఆ తెలివితేటలు రేపు ఏం కావాలి? మనకంటే చిన్నవాళ్ళు ఎంతో ప్రపంచజ్ఞానాన్ని మనకంటే ముందుగానే సంపాదిస్తున్నారు. తెలివితేటల్ని పెంచుకుంటున్నారు. వాళ్ళ తెలివికి మనం సంతోషించి వాళ్ళను ఉత్సాహపరచాలా లేక వాళ్ళని కించపరచాలా? ఆ తెలివిని చూసి అసూయపడి అణగదొక్కటానికి ప్రయత్నించాలా? ఇదే ప్రస్తుత సమస్య.

"మనకంటే ముందుపుట్టినవాళ్ళలో అధిక శాతంమంది మన తెలివిని అతి తెలివిగా వర్ణిస్తారు. మన వాదనలను పిడివాదనలంటారు. మన ప్రతి కదలికనూ తప్పుపట్టటానికి ప్రయత్నిస్తారు.

"మార్కెట్లలో వంకాయలో, బెండకాయలో ఏరుకొన్నట్లు ఇంటర్వ్యూలు జరుగుతున్నాయి. ఆ వంకాయలూ, బెండకాయల్ని కూడా మనం మంచివాటిని ఏరుకుని పుచ్చినవాటినీ, ముదురువాటినీ వదిలేస్తాం.

కానీ ఇంటర్వ్యూలలో అజ్ఞానానికీ, అడ్డదార్ల తెలివికీ పట్టంగడుతున్నారు.

అలాంటప్పుడు అసలు తెలివి ఏమవుతోంది? తమ మేధస్సును మానవాళికోసం ఉపయోగించాల్సిన యువతరం నిరాశానిస్పృహలతో కాలాన్ని విధినీ తిట్టుకొంటూ బ్రతకాలా?

లక్... అంటారు.... ఏమిటి లక్?...

"దేవుడు అనుకూలించాలి అంటారు... ఎందుకో తెలుసా?... మేధస్సును నమ్ముకోకూ, అడ్డదార్లతో నీ జీవితాన్ని వెతుక్కో అని చెప్పటం కాదా.

మనల్ని మొదట్నించీ తెలివిని నమ్ముకోవద్దని హెచ్చరిస్తారు. దైవం అనుకూలిస్తేనే నీ తెలివి పైకొస్తుంది అంటారు. దైవం సంగతి అటుంచినా, ఏ తెలివి, ఏ చదువు మీద ఉద్యోగాలు వస్తున్నాయి? ఉద్యోగాలు వచ్చిన వాళ్ళంతా తెలివైన వాళ్ళేనా? రానివాళ్ళు తెలివితక్కువ వారా? ఏ ఉద్యోగినైనా చెప్పమనండి తన ఉద్యోగంలో తనకి హాయి వుందని, ఆ పని చెయ్యటంలో తృప్తి వుందనీ.

ప్రజలకు తను ఉద్యోగం ద్వారా న్యాయంగా సేవచేస్తున్నామని ఎవరైనా గుండెలమీద చెయ్యివేసుకుని చెప్పగలరా? యువకులు అనేక ఉద్యోగాలు చేస్తున్నారు. ఏదో ఉద్యోగం దొరికింది కదాని ఆర్థిక అవసరం కొద్దీ చేస్తున్నారు. చదివిన చదువుకీ చేసే ఉద్యోగానికీ పొంతనే వుండదు. అలాంటప్పుడు ఈ చదువు లెందుకు?"-

అభిషేక్ అంత ప్రవాహంలా చెప్పుకుపోతూంటం ఆ కుర్రాళ్ళల్లో ఆశ్చర్యాన్ని రేకెత్తించి, అందరూ కదలకుండా మెదలకుండా అభిషేక్ వైపే చూస్తూ వింటున్నారు. 'నే... నేను మీకు బోరు కొట్టించను. ఏదో ఆవేశంలో మాట్లాడుతున్నాను. నాకళ్ళముందు తెలివితేటలతో ఈనాడు ఎంతో ఆనందంగా కనిపించే పసిపిల్లలే కనబడుతున్నారు. వాళ్ళ భవిష్యత్తు గురించిన ఆందోళన నా గుండెల్ని పిండేస్తుంది. నేను నాగురించి ఎప్పుడూ ఎక్కువ ఆలోచించలేదు. ఈనాడు జరుగుతున్న దారుణాల ప్రభావం ఆ పసిపిల్లలు, భావితరాలకు ప్రతినిధులైన వాళ్ళపై పడకూడదనేదే నా ఆవేదన"! అభిషేక్ ఆగిపోయాడు.

అభిషేక్ కళ్ళల్లో కనిపించీ కనపించనట్లుగా నీటిపొర మెదిలింది. ఆ నీటి పొరలో ఎన్నెన్ని సముద్రాలు పొంగుతున్నాయో. ఈ తరమైనా ఆ పొంగులను గుర్తిస్తుందో... లేదో...? గుర్తిస్తే అది దేశసమగ్ర వికాస చైతన్యాలకు ఉపయోగపడుతుంది. లేకపోతే... ఏమవుతుంది? దేశంలో తెలివి చంపబడితే... మేధస్సు హింసకు గురయితే... విజ్ఞానం బూడిదలో పోసిన పన్నీరయితే... ఏం జరుగుతోంది?... ఏది జరిగినా ప్రస్తుతం అధికార పీఠాలను అలంకరించినవారు, ఆనాడు బాధ్యత వహించటానికి వుండరు. కాలచక్రంతోపాటు ఈ అధికారులు... అహంకారాలు... చూపుతూ నేటి యువతరాన్ని నవనాడులూ కృంగదీస్తున్నవీరు ఉండరు. అపుడు ఎవరు బాధ్యత తీసుకోవాలి. అందుకే ఈనాడే యువతరం ఆ సమస్యను ఆలోచించాలి. అదే అభిషేక్ హృదయంలో వెల్లుబికిన ఆవేదన.

కుర్రాళ్ళందరూ హర్షధ్వానాలు చేశారు.

యూనివర్సిటీలో, "నిరుద్యోగుల అనుభవాలు మేధస్సుపై జరుగుతున్న హింసాకాండ" అనే అంశం మీద మాట్లాడటానికి అభిషేక్





ఈ బొట్టులోని
సుగంధ పరిమళ దైవత్వాన్ని
చూడగలుగుతున్నారా?





# ఐటెక్స్

# దివ్యా

## కుంకుమ్

దైవీక సుగంధ పరిమళాన్ని గుభాళించుతోంది - దివ్యా!
లక్షోపలక్ష భారతీయ నారీమణుల నమ్మకాన్ని
ఆకట్టుకొన్న కుంకుం మీ అభిరుచికి తగిన
రంగులలోనూ, మీరు ఆశించే వెల్వెట్
తళుకుబెళు కుతోనూ దొరుకుతోంది.

మీ కోమలమైన చర్మానికి అనువైనది,
సంపూర్ణంగా సురక్షితమైనది — దివ్యా!

**ఐటెక్స్** — 50 ఏళ్ళకు పైగా
మీ విశ్వాసానికి మహత్తరమైన చిహ్నం



అరవింద్ లాబరేటరీస్,
మద్రాసు 600 033

Imageads 3090 Tel

వేదిక ఎక్కాడు.

"నేను చెప్పాలనుకున్న అనేక విషయాలను నా సోదరులు ఇప్పటికే చెప్పేశారు. నాలోవున్న ఆవేదనే చాలామంది ఇక్కడి వ్యక్తంచేశారు. ఈ సదస్సులో ఆ ఆవేదన ఈ అందరిముందుకు వచ్చింది. అదే నేను కోరుకున్నది. మీకు తెలుసుకున్న విషయమే, నా పంథాలో చెప్పి నేను దిగిపోతాను... మనం చదువుకొంటున్నాం అని ఒకసారి మనమే విర్రవీగుతాం. కానీ మనది చదువుకాదు. ఎవరు ఏమనుకొన్నాసరే మనం చదివే చదువులు శుద్ధ దండగ. డిగ్రీలు, పోస్ట్ గ్రాడ్యుయేషన్లు చేస్తున్నాం. ఉద్యోగాలకు అర్హతగానే వాటిని మనం చూస్తున్నాం... మన పెద్దలు, గురువులు, ఇంకా పెద్దలు మనల్ని ఈ చదువే చదవమంటున్నారు. ఈ చదువువల్ల ప్రయోజనం పెద్దగా లేదని వారికి తెలీదా? తెలును... కానీ మనల్ని కూడా చదవమంటున్నారు. గత్యంతరం లేదని పరిస్థితులు చెబుతున్నాయి. వృత్తి విద్యాకోర్సుల్లో ప్రవేశానికి వేలాదిమంది వస్తున్నారు. ఇంజనీరింగ్, మెడిసిన్ ఎంట్రెన్స్‌లకు అరవై డబ్బై వేలమంది హాజరవుతున్నారు. సీట్లు వందల్లో వున్నాయి. ఇకసీట్ల కేటాయింపు ప్రవేశపరీక్షల్లోని మార్కులు ఆధారంగా ఇస్తున్నారు. అంటే ఇంటర్మీడియట్ ఎందుకు? ఇంటర్మీడియేట్ చదువు అనవసరమా? ఇంటర్మీడియేట్‌లో అత్యధిక మార్కులు సంపాదించిన విద్యార్థి ప్రవేశ పరీక్షల్లో పాస్ అయి మెరిట్‌లో సీటు దక్కించుకోగలడనే నమ్మకం వుందా?... అంటే వందల సీట్లకు వేలమంది లాటరీ పద్ధతిలో పరీక్షలకు హాజరవుతారు. ఈ కోర్సుల్లో సీట్లు వచ్చినవాళ్ళందరూ పూర్తి మెరిట్‌మీదే వచ్చినవారా? అలా చెప్పటానికి మేధావులు కూడా సాహసించడంలేదు. లాటరీ బేసిస్ మీద బిట్స్ టిక్కులు పెట్టి రాంక్‌లో నిలబడటానికి కూడా అవకాశం వుంది. ఎంట్రెన్స్‌ల కోసం ఇంటర్మీడియట్ కంటే కూడా కష్టపడి చదివి, రాత్రింపగళ్లు సాధనచేసి ఏదో చిన్న సమస్యవల్ల ఎంట్రెన్స్‌లలో దెబ్బతిన్న విద్యార్థులూ వున్నారు. మీ అభిరుచితో మాకు పనిలేదు. ప్రవేశపరీక్షల్లో మార్కులను బట్టి మీకు సీట్లు యిస్తాం అన





[illegible] కోండి. ఎలక్ట్రానిక్స్ బ్రాంచ్‌కి ప్రస్తుతం ఎక్కువ ఉద్యోగావకాశాలున్నాయి. అందువల్ల ఎంట్రెన్స్‌లో ఎక్కువ మార్కులు వచ్చిన వాళ్లకి ఆ బ్రాంచ్ సీట్లు దక్కుతాయి. సివిల్ ఇంజనీరింగ్ చదవాలనుకున్నవారికి కెమికల్ బ్రాంచ్. ఎలక్ట్రికల్ చదవాలనుకున్నవారికి మైనింగ్ బ్రాంచ్ ఇస్తున్నారు. అంటే విద్యార్థుల అభిరుచి ప్రసక్తేలేదు. ఆ పద్ధతి కూడా సరికాదంటూనే అమలుపరుస్తున్నారు.

ఇక మన విద్యార్థులు ఇంజనీర్లవుతారు. నాలుగేళ్లు కాలం గడుపుతారు. ఓసారి ఇంజనీరింగ్‌లో జాయినయ్యాక సాధారణంగా విద్యార్థి ఫెయిల్ అవ్వడు. రాత్రనక, పగలనక చిత్తాను సారం తిరిగి, సినిమాలు వరసగా చూసి సకల గుణాభిరాముడైతే కానీ ఫేలవ్వటమనే ప్రశ్నే తలఎత్తదు. ఏమాత్రం గాలివాటంగా, ఎండాకాలం చదువులంటారే అలాగ చదివినా, ఈ సెమిస్టర్ పద్ధతి పుణ్యమా అని ఫస్ట్‌క్లాస్ గ్యారంటీగా వస్తుంది. ఈ ఇంజనీర్లు ఇక క్లాస్‌లు తెచ్చుకుని బయటకు వస్తారు. వస్తూనే ఉద్యోగాలవేట. ఇది ఎవరికైనా తప్పదు.

బి.ఎ, ఎం.ఎలు చదివినవారు గుమస్తాలైనా, అటెండర్లయినా వాళ్ళకి ట్రైనింగ్ అనేది ఉండదు. కానీ మన ఇంజనీర్లకు మాత్రం ట్రైనింగ్ కంపల్సరీ. అసలు వాళ్లు ట్రైయినీలుగానే జేరాలి...

అంటే... వాళ్లని విమర్శించటం కాదు... వాళ్ళు కాలేజీల్లో నేర్చుకున్నదీ, చూసిందీ, చదివిందీ- బయట కంపెనీలతో పోల్చిచూస్తే ఎందుకూ పనికిరానిదిగా వుంటుంది. ఆ కంపెనీలో వున్న టెక్నీషియన్లు వీళ్లకి ట్రైనింగ్ యిస్తారు...

దశాబ్దాల, శతాబ్దాలనాటి విద్యావిధానం, వృత్తిపరమైన కోర్సుల్లో కూడా అమలు పరుస్తున్నారంటే మనం ఏంకావాలి?... మన తర్వాత తరాలవారు కూడా ఇదేవిధమైన విద్యను అందుకుంటే దేశం వెనక్కు వెళ్తుందా... ముందుకు సాగుతుందా?... అంతెందుకు... ఇప్పటికీ విదేశాల విజ్ఞానంతో పోల్చిచూస్తే మనం వేల సంవత్సరాలు వెనకబడి వున్నాం. ముందుకు రావాలనే ప్రయత్నం ఎక్కడ జరుగుతోంది? తెలివితేటల్ని భరించలేని సంకుచి

త్వం చేటుచేసుకుంటే భావితరాలు ఏమవు తాయి? దీనికి పరిష్కారం మనమే కనుక్కో వాలి. ప్రస్తుతం మనం ఈ దోపిడీవర్గ ఉత్సాహ పూరితమైన వాతావరణం కల్గించటానికి మనమే ప్రయత్నించాలి. ఈ వర్గం మనకు ఆశీర్వదించి యిస్తున్న సంకుచితభావాలను మనం వాళ్లతోపాటే వదిలెయ్యాలి.

భావితరాలకు ఆశాజనకంగా మన ప్రవర్తనా, చర్యలూ వుండాలి. అదీ మీ అందరి నుంచి నేను కోరుకుంటున్నాను'' అభిషేక్ కరతాళధ్వనుల మధ్య వేదిక దిగాడు.

అభిషేక్ ప్రసంగం కొందరి హృదయాల్లో సుడిలా తిరిగింది. మరికొందరికి తమ మనసే తమతో మాట్లాడినట్లనిపించింది. ఇంకొందరికి అనేక అనుమానాలను రేకెత్తించింది.

ఆ ప్రసంగం విన్న రాయలు మేనల్లుడు శివ తర్వాత అభిషేక్‌ని కలిసి మంచి స్నేహితుడిగా మారిపోయాడు. అభిషేక్ అనుభవించిన మానసికవేదనను అర్థం చేసుకొన్న శివకు అభిషేక్ ఓ పుస్తకంలా దొరికాడు. ఆ పుస్తకంలో ప్రతిపేజీ అనుభవాల, ఆలోచనల మయమే. ఆ అనుభవాలను తెలుసుకుంటూ, ఆ ఆలోచనలకు స్పందిస్తూ శివ అభిషేక్‌కి చాలా దగ్గరయ్యాడు. శివ ద్వారానే రాయల్ని మొట్టమొదటిసారిగా అభిషేక్‌ని కలిశాడు.



''ఏమండీ అభిషేక్‌గారూ...'' అన్న మాటలతో ఈ లోకంలోకి వచ్చాడు అభిషేక్.

''ఏవిటీ దీర్ఘాలోచనలో వున్నారు?'' అంది జ్యోత్స్న అభిషేక్‌ని పలకరిస్తూ.

''అబ్బే... ఏంలేదండీ ఏవో పాత జ్ఞాపకాలు... ఇట్స్ ఓకె... మనం అలా రెస్టారెంట్‌లో కూర్చుందాం- రండి...'' అంటూ లేవబోయాడు అభిషేక్.

''ఫరవాలేదండీ... ఇక్కడే హాయిగా వుంటుంది. సముద్రపుగాలి... ఆ కెరటాలూ చూస్తూ యిక్కడే మాట్లాడుకుందాం'' అంటూ కూర్చుంది జ్యోత్స్న.

''ఆ! చెప్పండి... ఇంతకీ మీ పనేమిటి?'' అభిషేక్ సూటిగా అడిగాడు.

''ఏం... మళ్లీ ఏదైనా అర్జెంట్ పనుందా?''

''అబ్బే అలాంటిదేం లేదండీ... మీ టైంవేస్ట్ అవుతుందేమోనని'' ఆర్థోక్తిగా ఆగాడు.

''నాకు ఇప్పుడు మీతో మాట్లాడటమే పని... మీరు ఏమనుకొన్నా సరే ఓపిగ్గా వినాలని రిక్వెస్ట్'' జ్యోత్స్న నాంది పలికింది.

''మా పనే అది! ఎవరి సమస్యనైనా ఓపిగ్గా వినటం నా వృత్తి. ఆ సమస్య ఎలాంటిదైనా పరిష్కరించటానికి ప్రయత్నించటం మా బాధ్యత''

''నాకు వ్యక్తిగతంగా సమస్యలంటూ ఏం లేవండీ... కానీ నా ముందున్న సమస్య మీరే'' జ్యోత్స్న అభిషేక్‌కేసి చూస్తూ అంది.

''నేనా'' ఉలిక్కిపడ్డాడు అభిషేక్.

''అవును... మీరే'' జ్యోత్స్న రెట్టించింది.

''నేనా... నేను మీకెలా సమస్యగా మారాను?'' నవ్వుతూ అడిగాడు అభిషేక్.

''మీరు ఏంచదివారు?''

''ఎం.ఎ ఏం? మీరు ఇంటర్వ్యూ చేస్తారా'' అభిషేక్ నవ్వుతూ జ్యోత్స్నని కూడా నవ్వించటానికి ప్రయత్నించాడు.

''కాదండీ... ఇంటరాగేట్ చేస్తాను'' సీరియస్‌గా చెప్పింది జ్యోత్స్న.

''మీరు లాయరా?''

''కాదు... డాక్టర్ని''

''డాక్టర్లు ఎగ్జామిన్ చేస్తారనుకుంటా... ఇంటరాగేట్...'' అభిషేక్ మాట్లాడుతూండగానే ''మీరేమైనా అనుకోండి ముందీ విషయం చెప్పండి?'' అంది జ్యోత్స్న.

''ఏంవిషయం?''

"ఎం.ఎ. చదివిన మీరు తెలివితేటలుండీ యిలా ఎందుకు రాజకీయాల ఊబిలో కూరుకుపోతున్నారు?" జ్యోత్స్న అడిగింది.

"మీకెవరు చెప్పారు... నేను రాజకీయాల ఊబిలో కూరుకుపోతున్నానని" అభిషేక్ ప్రశ్నించాడు.

"ఎవరూ చెప్పనవసరం లేదు... మిమ్మల్నీ మీ చర్యల్నీ గమనిస్తే అర్థం కాదా?"

"నన్నూ... నా చర్యల్నీ మీరెందుకు గమనించాలి? నాగురించి పట్టించుకోవాల్సిన అవసరం మీకెందుకొచ్చింది?" అభిషేక్‌జ్యోత్స్నని నిలదీశాడు. అప్పుడు గుర్తొచ్చింది ఆ అమ్మాయి పేరు తనింకా తెలుసుకోలేదని. "బైదిబై మీ పేరడగటమే మర్చిపోయాను చూశారా?" అన్నాడు అభిషేక్. "జ్యోత్స్న" అని చెప్పి మళ్లీ అంది- "మీకు నేను ఏదో అవ్వాలనీ, అవుతాననీ నేననుకుంటున్నానని మీరనుకుంటే పొరపాటు. ఈ దేశంలోని ఒక వ్యక్తిగా, ఓ యువకుడు అనవసరంగా తన మేధస్సునంతా ఎవరి స్వార్థరాజకీయాలకో బలిపెడుతోంటే చూడలేక మిమ్మల్ని అడుగుతున్నాను అంతే"! జ్యోత్స్న కొంచెం గట్టిగానే చెప్పింది.

"నాకేదో మేధస్సుందనీ, దాన్ని ఎవరి స్వార్థానికో ఉపయోగిస్తున్నాననీ నా మీద ఆరోపణ చేశారు, అలా అని మీరెలా చెప్పగలరు"

"మీరు మంత్రి రాయలుగారి రాజకీయ భవిష్యత్‌కోసం తెలివితేటలన్నీ ఉపయోగిస్తున్నారనేది లోకమెరిగిన సత్యం. దాన్ని ఆరోపణంటూ తీసిపారెయ్యటానికి చూడకండి. చదువూ, సంస్కారం వున్న మీలాంటి తెలివైన యువకులు ఈ కుళ్లురాజకీయాల్లో తలమునకలవుతోంటే మీవల్ల సమాజానికి జరగాల్సిన మేలు జరగటంలేదు. పైగా ఈ రాజకీయాల్లో ఎవరికో మీ తెలివి ఉపయోగపడ్తుంది కానీ...ప్రజలకు పనికిరాదు. అలాంటప్పుడు మీరు మీ చదువుకీ, మీ నాలెడ్జికీ అన్యాయం చేసినవారు కారా?" అంటూ సమాధానం చెప్పండి అన్నట్లుగా చూసింది జ్యోత్స్న.

అభిషేక్ నవ్వాడు. ఆ నవ్వులో విరక్తీ వైరాగ్యం, నిస్పృహ, నైరాశ్యం తొంగిచూశాయి.

"జ్యోత్స్నగారూ! నా చదువంటూ నన్ను పైకెత్తేస్తున్నారే, ఆ చదువు ఉద్యోగాలకు పనికిరాలేదు. ఏదో ఈనాడు నా నాలెడ్జి అన్నారు. ఆ విజ్ఞానం, జ్ఞానం ఇంటర్వ్యూలలో చిత్తుచిత్తుగా ఎన్నో దెబ్బలు తిన్నాయి. నా తెలివి రాజకీయాల్లో ఎవరికో ఉపయోగపడుతున్నదన్నారు. ప్రజలకు అది పనికిరాదన్నారు. అది తప్పు. మీరు సరిగ్గా అంచనా వెయ్యలేదు. లేదా అది మీ అంచనాకు అందివుండకపోవచ్చు. ఏ వ్యక్తికయినా పరిస్థితులు అనుకూలంగా వున్నప్పుడు రాజకీయాల్లో పెరుగుతాడు. ఎన్ని తెలివితేటలున్నా రాజకీయాల్లో ఎన్నేళ్లయినా, కనీసం చిన్నపదవి కూడా సంపాదించలేని వాళ్లు మనదేశంలో చాలామంది వున్నారు. రాజకీయాల్లో ఒకరి తెలివి మరొకరు వాడుకొని పైకి రావాలని చూసినా కుదరని పని. పరిస్థితులు అందుబాటులో వున్నప్పుడు చిన్నచిన్న సలహాలు కూడా అద్భుతంగా పని చేస్తాయి. ఒకసారి ఎంత రాజకీయపు ఎత్తువేసినా ఫలితం వుండదు. రాజకీయనాయకుడి ప్రాముఖ్యం, పలుకుబడి చూసి తెలివి ఎక్కడున్నా ఆ నీడలో చేరుతుంది. ఎందుకంటే ఆ నీడలో తెలివికి సార్థకత తెచ్చుకుని, తద్వారా పైకి రావాలని ఆశిస్తారు" అభిషేక్ వివరించాడు.

"అది తెలివితేటల్ని తాకట్టుపెడుతూ మనిషి బానిసగా మారడంకాదా?" ప్రశ్నించింది జ్యోత్స్న.

ఆ ప్రశ్న అభిషేక్ హృదయంలో బాణంలా తగిలింది. అయినా దాన్ని తేలిగ్గా తీసుకుని ఎదురుప్రశ్న వేశాడు. "ఉద్యోగాలంటే బానిసత్వం కాదా?"

"పనిచేసినా, చెయ్యకపోయినా ప్రభుత్వోద్యోగంలో వుంటే నెలనెలా డబ్బు వస్తుంది. ప్రైవేట్‌లో ఎంతపని చేసినా చిన్నతప్పు చేస్తే బలవుతారు. అదెలా బానిసత్వం అవుతుందీ?...క్షణంక్షణం ఏంజరుగుతుందో తెలియని ఈ రాజకీయాలకన్నా ఉద్యోగాలు బెటరనుకుంటా" జ్యోత్స్న తన అభిప్రాయం చెప్పింది.

ప్చ్!కాదుపని చెయ్యకూడదు అనుకొన్నవాడికి ఏ గొడవా వుండదు. అధికార్ల పాదాలవద్ద పాకు




లాడుతూ బతుకుతాడు. ఇతరుల మీద ఫిర్యాదులు చెప్పటం, అధికార్ల ప్రైవేట్ పనులు చేసిపెట్టడానికి వెనకాడకపోవటంవంటివి వాళ్ళకి దైనందిన కార్యక్రమాలుగా మారిపోతాయి. ఉద్యోగులు తమకు అణిగిమణిగి వుండాలనుకొనే అధికారులకు, తమ అధికారమే ప్రధానంకానీ ప్రజలతో పనిలేదు. వారు అధికారదర్పం ప్రదర్శిస్తూ తెలివైన ఉద్యోగుల పై ప్రతాపం చూపిస్తూ ఆ ఉద్యోగుల తెలివితేటల్ని అణచడమే ధ్యేయంగా ఉంటున్నారు. ఉద్యోగుల్లో తెలివి ఉండరాదనే దురభిప్రాయానికి వాళ్ళు వచ్చేశారు. తమ మాటేవేదంగా, తామే సకలశాస్త్ర ప్రవీణులుగా ఉద్యోగులు భావించాలని అధికార్లు జులుం చలాయిస్తున్నారు. స్వతంత్ర భావాలున్న ఉద్యోగులను నానా కష్టాలకు గురిచేస్తున్నారు. ఉద్యోగరీత్యా ఎవరేనా స్వతంత్రిస్తే వారిని వ్యక్తిగతంగా హింసిస్తున్నారు. వృత్తిపరమైన సమస్యలను ఆ ఉద్యోగి వ్యక్తిగత కుటుంబసమస్యగా మార్చి, ఆ ఉద్యోగి చిన్న కుటుంబాన్ని చిన్నాభిన్నంచేసి పైశాచికంగా ఆనందిస్తున్నారు. అధికారుల అధికారాలకు నిర్దిష్టమైన అర్థంలేదు. ఒక అధికారి వ్యక్తిగతమైన నిర్ణయం ప్రభుత్వ ఆదేశంగా మారుతోంది. అది ఒక కుటుంబవ్యవస్థనే నాశనంచేస్తోంది. అలాంటప్పుడు ఉద్యోగిగా ఎవరు మాత్రం స్వంత తెలివితేటలతో స్వతంత్రంగా వ్యవహరించటానికి ప్రయత్నిస్తారు?

"మీకు తెలీదు జ్యోత్స్నగారూ... ఎక్కడ మేధస్సువున్నా దానిమీద విపరీతంగా హింసాకాండ జరుగుతోంది. అలాంటి పరిస్థితిలో యువకులు ఏంచెయ్యాలి? బానిసలుగా మారకపోతే కుటుంబాలు విచ్ఛిన్నమవుతాయి. అధికారబలంతో విర్రవీగే అధికారులు, ఉద్యోగులు బానిసలుగానే వుండాలని శాసిస్తున్నారు. రాజకీయపరమైన పలుకుబడి, అధికారులకు పనులు చేయించగలిగే సమర్థతవున్న ఉద్యోగులు పనిచెయ్యరు. పైస్థాయినుంచి కిందిస్థాయివరకూ రాజకీయపరంగా, లంచగొండి విధానంద్వారా ఒత్తిడివస్తేగానీ పనులు జరగని మనదేశంలో ఎవరు ప్రజాసమస్యలపట్ల బాధ్యతాయుతంగా వుంటున్నారు? అలాంటప్పుడు నాలాంటివాడు ఎక్కడ ఇమడగలడు? నాలాంటి అనేక లక్షలమంది ఏంకావాలి?—"

అభిషేక్‌లో ఆవేదనచూసి జ్యోత్స్న ఏంమాట్లాడలేదు. "రాజకీయాల్లోకి రావాలని నేనేనాడూ అనుకోలేదు, నా తెలివితేటలు రాజకీయాలకు పనికివస్తాయని ఎప్పుడూ అనుకోనూలేదు. తప్పనిసరి పరిస్థితుల్లో రాజకీయాల్లోకి ప్రవేశించాను. ఈ రాజకీయాల్లో అనుకోకుండా చిక్కుకుపోయాను. అయితే ఒకటి. నేను ఏనాడూ మోసాన్ని రాజకీయాల్లో వాడలేదు. ఎవరినైనా అడగండి... నేను మోసంచేశానని ఎవరైనా అంటే ఆరోజే నేను వీటిల్లోంచి తొలగిపోతాను. నా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాను. ప్రజల సమస్యలు పరిష్కరించటానికి నాకు చేతనయినంత నేను చేస్తున్నాను. నా కృషి ఫలిస్తే సంతోషిస్తూ, ఫలించకపోతే నిరుత్సాహపడకుండా మళ్ళీ మళ్ళీ ప్రయత్నిస్తున్నాను. ఏదో కొంత తృప్తిగా జీవితాన్ని గడుపుతున్నాను. ఈ తృప్తిలేనినాడు రాజకీయాల్లో నేను వుండను. మంత్రి రాయలుగారికి నా తెలివితేటలు పనికివస్తున్నాయని మీరన్నారు. వాస్తవంగా ఆలోచిస్తే అలా అనటానికి ఆస్కారం వుండదు. ఏ ఆధారంలేనినాడు నేను ఆయనపక్కన చేరాను. ఆయన పలుకుబడితో నేనీనాడు ఈ ప్రజలమధ్య నిలబడగలిగాను. ఆయన నన్ను ఎందుకు ప్రోత్సాహించాలి. నేను కార్యకర్తగా ఆయనకు నచ్చిననాడు ఆయన నన్ను ప్రోత్సాహిస్తారే కానీ, లేకపోతే ఆయన నన్ను ఎందుకు చేరదియ్యాలి? ఆయన ఆశించిన పరిధిలో నేనున్నాను. ఆయన ప్రోత్సాహం నన్ను ముందుకు నడిపిస్తోంది. రాజకీయాల్లో నన్నుపైకి తీసుకెళుతోంది. ఇది జీవితం జ్యోత్స్నగారూ. మీరనుకొన్నట్లు నా జీవితం వుండదు, నేననుకొన్నట్లు మీ జీవితం వుండదు. జీవితాన్ని ఎన్నో ఆశలతో ఎక్కడో మొదలుపెడతాం కానీ అది ఎలా మలుపులు తిరుగుతుందో ఎవరైనా ఊహించగలరా?"

కొంచెం ఆగి మీరేమంటారు అన్నట్లుగా చూశాడు అభిషేక్.

"మీతో వాదించి నేను నెగ్గలేనని అనుకొంటున్నాను" నవ్వుతూ అంది జ్యోత్స్న.

"ఇది వాదనకాదండీ... వాస్తవాల చిత్రీకరణ. మీరు అంగీకరించినా అంగీకరించకున్నా నేను చెప్పినదంతా ప్రస్తుతం మనముందే జరుగుతున్నదనేది నిజం" ఆగాడు అభిషేక్.

"యూ ఆర్ కరెక్ట్... నేవంత డీప్‌గా ఆలోచించలేదు"– అంది జ్యోత్స్న.

"నేనూ ఆలోచించలేదు. పరిస్థితులు నన్నంత లోతుకి తీసుకువెళ్ళాయి. అంతే నండీ... లేకపోతే ఎక్కడో ఉద్యోగం చేసుకొంటూ, పెరిగే జీతాలగురించీ, రావల్సిన డి.ఎల గురించీ ఆలోచించేవాణ్ణి" నవ్వాడు అభిషేక్.

ఆ నవ్వుకు చిరునవ్వులు జతచేసింది జ్యోత్స్న.

చీకటిపడుతోంటే యిద్దరూ లేచారు.

"మీరెక్కడ వుండేది?" అభిషేక్ అడిగాడు.

"మాది వైజాగే... కానీ ప్రస్తుతం మేం హైద్రాబాద్‌లో వుంటున్నాం"

"ఇక్కడ ఎక్కడున్నారు?"

"ఏరాడ పార్కు దగ్గర మా పెద్దమ్మగారు వున్నారు. వాళ్ళింట్లో వున్నాను" జ్యోత్స్న ఆ మాటలు అనేలోగా ఎవరో పదిమంది జాలర్లు 'అభిషేక్ బాబూ'! అంటూ అభిషేక్ దగ్గరగా వచ్చారు.



"నర్లెండి మళ్ళీ కలుద్దాం... ఏమనుకో కండి... వీళ్ళ ప్రొబ్లెమ్ ఒకటుంది. దానిగురించి మాట్లాడాలి". అంటూ జ్యోత్స్న సమాధానం వినకుండానే ఆ జనంతో కల్సిపోయి ముందుకు సాగిపోయాడు.

జ్యోత్స్న వెనక్కు వచ్చేసింది. అభిషేక్ మనస్తత్వాన్ని గురించి ఆలోచిస్తోంది. జీవితంలో ఎన్నో ఒడిదుడుకులు అనుభవించిన వ్యక్తిలా కనిపించాడు అభిషేక్. అతన్ని అందుకోవటం సాధ్యమా?

అతడు తనని పెద్దగా పట్టించుకోలేదనే అనుకోవాలి. జీవితసత్యాలు చెబుతూ తన ఆలోచనాసరళినే మార్చాలని చూశాడు. కొంత వరకూ మార్చాడు.

కానీ...

"జగదీష్‌కి ఇలాంటి జీవితసత్యాలు పట్టించుకునే అవసరంలేదు. అతనికి ఇవన్నీ స్వల్పవిషయాలు. జగదీష్‌లాంటి వ్యక్తితో జీవితం హాయిగా వుంటుంది. ఎలాంటి సమస్యలూ కనిపించవు. ఉన్నత కుటుంబాల పరిధిలో అందమైన జీవితం వుంటుంది. జగదీష్ తనను కోరుకుంటున్నాడు కూడా.

"అభిషేక్ అయితే తనెవరో తెలుసుకునే కనీస అవసరమే లేనట్లుగా ప్రవర్తించాడు. అభిషేక్‌కి తనూ, తన ఆలోచనలూ అర్థం అయ్యేనాటికి పరిస్థితులు ఎలా వుంటాయో? ఈ రాజకీయాల్లో అతను పైమెట్లు ఎక్కుతాడో లేక ఊబిలో కూరుకుపోతాడో? తననుంచి ఎలాంటి ప్రతిస్పందనా లేకపోతే జగదీష్ తన మాటే మరచిపోవచ్చు కూడా"

ఏమిటీ... ఇంత విపరీతంగా ఆలోచిస్తున్నాను ఈమధ్య— అనుకుంది జ్యోత్స్న తనలో తానే. "ఇద్దరు మగవాళ్ళను మనసులో నిలుపుకుని బేరీజు వేసుకుంటోందాతను. ఛఛ... ఏమిటీ పాడు మనసు. అసలు వీళ్ళిద్దరూ తనకు ఒకేసారి ఎందుకు తారసపడాలి? భిన్న మనస్తత్వాలతో ఎందుకు వీళ్ళు తనలో సంచలనాన్ని రేపుతున్నారు? అభిషేక్ ఇప్పటికీ తన గురించి ఆలోచిస్తాడనే నమ్మకమేలేదు. అలాంటప్పుడు తనెందుకు అతనిపట్ల అభిమానాన్ని పెంచుకోవాలి?"

"జగదీష్‌ని అభిషేక్‌తో పోల్చినా, ఎందుకో అభిషేక్ ఆలోచనా విధానానికి జగదీష్ చాలా దూరంలో వున్నాడు. అభిషేక్‌ని వ్యక్తిగా తను అభిమానించటం లేదా? అతని లౌక్యమే తనను ఆకట్టుకొందా? అదీ కాదేమో... అసలు అభిషేక్ తనదంటూ ఒక "యిజాన్ని" ప్రారంభించనున్నట్లు అనిపిస్తున్నాడు. అతని సిద్ధాంతమేమిటో అర్థంకావడంలేదు. సాధారణవ్యక్తిలా కనిపిస్తాడు. అసాధారణంగా మారి తనను ప్రశ్నిస్తాడు. అభిషేక్ ఈనాటి యువత ఆలోచనలకు ప్రతిబింబంకాదు. ప్రస్తుతం తానేం చెయ్యాలి అని ఆలోచిస్తున్నాడు. ఎలాంటి పరిస్థితులనైనా ఎదుర్కోగలననే అతని నమ్మకం నేటి యువతరాన్నే కాదు, భావితరాలను కూడా ప్రభావితం చేస్తుందా? ఏమో...!"

"మనిషిగా పుట్టాను... పెరుగుతున్నాను, సకల జీవరాశులకు తప్పని చావు నాకూ వస్తుంది. బతుకున్నంతకాలం సుఖపడాలని అందరూ అనుకొన్నట్లుగానే నేనూ అనుకుంటున్నాను. ఎలాంటి సుఖం! శారీరకంగానా?— బాహ్యాసౌందర్యం! ఆ మాటకొస్తే నా అందం ఏపాటిది? నేనేం అందగత్తెల జాబితాలోలేనే"

"జగదీష్ అందగాడు. అంతకుమించి హుందాగా ఉంటాడు. నన్ను జగదీష్ ఏరకంగా కోరుకొంటున్నాడు? సామాన్య జనాన్ని ఏమాత్రం పట్టించుకోని జగదీష్ నన్ను వాంఛిస్తున్నట్లుగా ప్రవర్తిస్తున్నాడు. నా అందాన్ని చూశా? అందానికే ఆరాటపడేవాడయితే రోజూ అతనిచుట్టూ నాకంటె అందగత్తెలు ఎందరో తిరుగుతుంటారు. జగదీష్ అందంలో తనకి సరైన జోడీని ఎంచుకోగల సమర్థుడు. అందంచూసి అతను నావెంటపడటంలేదు. మరి నాలో ఏంచూసి ఇష్టపడుతున్నాడు? అతనితో మొదటి పరిచయం గన్నవరం విమానాశ్రయంలో జరిగింది. తనకు తానుగా అంత అకస్మాత్తుగా నన్ను ఎందుకు పరిచయం చేసుకొన్నాడు? తనగురించి ఎందుకు వివరించాడు? మీరా డిన్నర్‌కి పిలిచినరోజు అతను కూడా ఆటెండ్ అయి నన్ను ఎందుకు వాంఛిస్తున్నట్లుగా చూశాడు? ఏదో కారణంలేకపోతే అతను నాతో కావాలని పరిచయంపెంచుకోడు.




నేను మంత్రి రాయలు కూతుర్నని అతనికి ముందుగానే తెలుసా? అవకాశం లేదు. అంటే కావాలనే అతను నన్ను కోరుకుంటున్నాడన్న మాట. ఎందుకో?"— సుడిలా తిరుగుతున్నాడు జగదీష్ జ్యోత్స్న మనసులో.

"ఈ అభిషేక్‌కి అసలు స్పందనే వున్నట్లుగా కనిపించదు. ఓ వయసులోవున్న అమ్మాయి తనని ఎందుకు ప్రశ్నిస్తోందో ఆలోచించడా? మామూలుగా యువకులకు వుండే మానసిక పరిణామాలు అభిషేక్‌లో గోచరించటంలేదు. నాగురించి అతను పట్టించుకొనే అవసరంలేదా? "అభిషేక్ అందగాడా? గొప్ప అందగాడు కాదు. కానీ అతనిపట్ల ఆకర్షితురాలవుతున్నానా? అవునేమో? ఆకట్టుకొనే చురుకైన అభిషేక్ కళ్లు. ఆ కళ్లల్లో భావాలు చదవటానికి నేను చేసిన ప్రయత్నాలు వ్యర్థంఅయ్యాయి. ఎలాంటి భావాలూ తెలియచెప్పే కళ్లు కావవి. నిర్మలంగా చూసిన అభిషేక్ చూపులు తనని ఎందుకు వేటాడుతున్నాయి. అభిషేక్‌లో గొప్పతనం వ్యక్తిత్వం. అతని భావాలు నన్ను కట్టేస్తున్నాయి. అతని మాటలు హృదయంలో అనుక్షణం కదులుతూ నన్నూ కదిలిస్తున్నాయి. అభిషేక్ నాకు అనంతదూరంలో వుండటంవల్లనా ఈ కవ్వింపు? అభిషేక్ అందనంత దూరంలోనే ఉంటాడా? నో నో... ఎందుకు దగ్గరగా రాడు? నేను ప్రయత్నిస్తే తప్పకవస్తాడు" అనుకుంది జ్యోత్స్న. "ఏమిటా ధీమా?" మనస్సు ప్రశ్నించింది జోత్స్నని. "జగదీష్ అందినట్లుగా ప్రవర్తించటం అతన్ని దూరం చేస్తోంది అభిషేక్ అందనంత దూరంలో వుండటం అతన్ని మరింత దగ్గర చేస్తోంది"

"మీరా నాతో అంత జోక్‌గా ఆరోజు మాట్లాడటానికి ప్రయత్నించిందీ అంటే నాపట్ల జగదీష్‌కున్న అభిప్రాయం ఆమెకి తెలుసా? మయూరి హోటల్లో డిన్నర్ అయినతర్వాత ఆ విషయాన్ని జగదీష్ వెంటనే మీరాకి చెప్పాడన్నమాట. జగదీష్ కావాలనే మీరాకి చెప్పివుంటాడు. నాతో డిన్నర్‌కి వెళ్ళానని మీరాకి చెపితే తానేదో సాధించినట్లుగా భావించుంటాడు. ఆ భావనతోనే మీరాకి చెప్పివుంటాడు.

"పోనీ మీరానే అడిగితే? నో... నేను బయటపడినదాన్ని అవుతాను. అనవసరంగా, నేనెందుకు అడగాలి? జగదీష్ నాగురించి ఏమనుకుంటే నాకేం?" జ్యోత్స్నతో మళ్ళీ జగదీష్ ఆలోచనలు అల్లుకోవటం మొదలెట్టాయి. జ్యోత్స్న ఎంతో సమయాన్ని ఆ హృదయపు అలజడితో గడిపింది. ఆ అలజడి ఎంతో కదలికను సృష్టించింది. ఆ కదలికలో స్థిరంగా అభిషేక్ నిలిచివున్నాడు. అభిషేక్ సంస్కారం, భావాల ప్రభావం ముందు జగదీష్ డబ్బు, హెూదా, రూపం, దర్జా జ్యోత్స్న మనసులో చెదరిపోయాయి.

★ ★ ★

ఆ పెద్ద హాస్పిటల్లోని కార్డియాలజీ డిపార్ట్‌మెంట్ తెగ కంగారుపడుతోంది. అక్కడి హృద్రోగ నిపుణులు హడావిడిపడుతున్నారు. డాక్టర్ల హడావిడికితోడు నర్సులు, వార్డుబోయ్‌లు, ఆయాలు, స్వీపర్లు, వాచ్‌మెన్లు... ఎన్నడూలేని ఆ పరిస్థితిని చూసి, చేసినపనినే మళ్లీమళ్లీ చెయ్యాలని చూస్తున్నారు. ఆయాల అదిలింపులతో, స్వీపర్ల కేకలతో, వాచ్‌మెన్ల అరుపులతో రోగులు బేజారెత్తే మామూలు పరిస్థితి అక్కడలేదు. నర్సులు ఆందోళనపడుతున్నారు. ఆ డిపార్ట్‌మెంటే హృదయాందోళనకు గురవుతోందని చెప్పటం అతిశయోక్తి కానేకాదు.

రాష్ట్ర పరిశ్రమలశాఖమంత్రి రాయలుగారు హృద్రోగంతో బాధపడుతుండటంతో ఆయన్ని అక్కడ చేర్పించారు. ఒక ప్రముఖ వ్యక్తి. అందునా రాష్ట్ర మంత్రివర్గంలో ముఖ్యుడు అక్కడ చేరటంవలన ఆస్పత్రి స్టాఫ్ ఎవరో స్వంత ఇంట్లోని మనిషే హృద్రోగంతో బాధపడుతున్నాడన్నట్లుగా ప్రవర్తిస్తోంది.

ఎట్టి పరిస్థితిల్లోనూ, ఏ రోగి ఏ ప్రభుత్వాసుపత్రికి చేరినా అప్పుడప్పుడు డాక్టర్లు, నర్సులూ పట్టించుకొన్నా మిగతావారు ఏమాత్రం చలించరు. రోగుల దగ్గర్నుంచి ఎలాగోలా డబ్బు గుంజాలనేదే ప్రధాన లక్ష్యంగా వ్యవహరిస్తారు. రోగి చావు బతుకుల పరిస్థితి వారికి పట్టదు. ఎందుకంటే ఆ రోగులూ... రోగాలూ వాళ్ళు రోజూ చూసేవే. అందుకే అలవాటుపడి

పోయారు. రోగం లేనివాడు అక్కడికి రానే రాడు. వచ్చినా వీళ్ళను లెఖ్ఖచెయ్యడు. వీళ్ళు ఆ రోగికాని రోగిని అడ్డగించినా... ఆ అడ్డంకులు తొలగించుకుని వెళ్ళిపోతాడు. కానీ రోగి వీళ్ళ చేతుల్లో బందీ. ఆ వాస్తవం తెలుసున్న వీళ్ళు యథాశక్తిగా రోగిని పిండేస్తారు.

రోగులను ద్విచక్ర శకటంలో కదల్చటానికి రెండు, చతుర్శక్ర శకటంలో పడేసి లాక్కుపోవటానికి నాలుగు, ఆపరేషన్ అయితే పదీ, ఆపరేషన్ థియేటర్‌కి నకాలంలో డ్రెస్సింగ్‌కి తీసుకెళ్ళి తీసుకురావటానికి అయిదూ, ఇలా రేట్ల జాబితా వుంటుంది. అసలు వాళ్ళకి ఆ జాబితా ప్రకారం ఎందుకివ్వాలి అనే ప్రశ్న తలఎత్తించారా... అంతే... థియేటర్ మూతపడింతర్వాతే వాళ్ళు కదలించబడతారు. ఆనాటి డ్రెస్సింగో... మరొకటో జరగటానికి అవకాశం వుండదు. ఆయాలు అరుపులతో అదరగొట్టేస్తారు. స్వీపర్లు తమ పనితో రోగులను చెరిగేస్తారు. వాచ్‌మెన్‌లు రూపాయికిగానీ ఎవరికీ కరగరు. ఇదంతా అలవాటుగానే జరుగుతోంది. కళ్ళముందే ఈవిధంగా రోగులు చిత్రహింసకు గురవుతున్నా నర్సులు మాట్లాడలేదు. ఒకవేళ మరీ ఎబ్బెట్టుగా అనిపించి ఏ నర్సన్నా ఆయాలను అదుపుచెయ్యాలని అరక్షణం ప్రయత్నించిందా... ఆ నర్సుని నానారకాలుగా దుర్భాషలతో నరకయాతన పెడతారు. వినలేని... అనరాని మాటలతో శూలాల్లా పొడిచేస్తారు. నోటికొచ్చిన ఆరోపణలు... చిత్తానుసారంగా బండబూతులు లంకించుకొంటారు. ఆ కార్యక్రమం రోజుల తరబడి నిర్వహిస్తారు. ఒక ఆయానిగానీ, స్వీపర్నిగానీ ఒక్కమాటతో మంచి చెప్పాలని ప్రయత్నించారా, ఆ క్షణంలోనే సంఘీభావం మొదలవుతుంది. మిగతావాళ్ళంతా రంగంలోకి దిగిపోతారు. ఆ మంచిమాట చెప్పి బాధ్యతని గుర్తుచేసిన నర్సుని ముఖం దించుకునేటట్లు చెయ్యటానికి నడుం కట్టి విజృంభిస్తారు. ఆ సంఘటితశక్తికి వాళ్ళను అదుపుచేసే అధికారమున్న డాక్టర్లు, ఇన్‌ఛార్జ్‌లు కూడా కలవరపడి దూరంగా జరుగుతారు. ఆ ఐకమత్యపు దాడికి తమ మద్దతు ప్రకటించాల్సిన దుర్భర దారుణ పరిస్థితికి ఆ అధికారులు లాగబడతారు. వాళ్ళ గొడవలోకి వెళ్ళవద్దని వాళ్ళముందే నర్సులను హెచ్చరిస్తారు. అలాకానిపక్షంలో ఆ అధికార్లు కూడా ఈ సంఘటిత జనం నోటిధాటికి బలవుతారు. అందుకే కళ్ళముందు ఏం జరిగినా... నర్సులు దీనంగా చూస్తూ నోరు కుట్టేసుకుని, చేతులు కట్టేసుకుని వుంటారు. ఈ పరిస్థితి డాక్టర్లకూ, ఇతర అధికార్లకూ, రోగులకూ తెలియదని ఎవరైనా చెబితే వారిని నేరుగా, సూటిగా వెర్రివారు అన్నా తప్పులేదు. ప్రభుత్వ శాఖల్లో విపరీతంగా అలుముకొంటున్న ఈ అవలక్షణాల పర్యవసానానికి బాధ్యత వహించటానికి ఎవరూ ముందుకు రారనేది అక్షరసత్యం.

జీవన్మరణ సమస్యతో ఆస్పత్రులకు చేరే లక్షలాది రోగులు నిత్యం ప్రతీక్షణం ఈ మానసిక ఆందోళనకు గురవుతారు. ఆ రోగుల్ని అదిలించి, విదిలించి, కంగారూ, భయాన్నీ కలిగించి ఆ ఒత్తిడి ద్వారా తమ వసూళ్ళను నిర్విఘ్నంగా పిండుకొనే సంఘటితతత్వం ఏ ఆస్పత్రిలో లేదూ...?

రాష్ట్రవ్యాప్తంగా, ఆ మాటకొస్తే దేశవ్యాప్తంగా బాహాటంగా చిన్నచిన్న సంచీలు బొడ్లలో దోపుకుని రోజుకింత రోగులనుంచి వసూలు చెయ్యాలన్న చిత్తశుద్ధితోనే ఆస్పత్రులకు వచ్చే సేవకుల్లా ముద్ర వేయించుకొన్నవాళ్ళను ఎవరైనా చూడచ్చు. చూసినా చూడనట్లుంటేనే మంచిది. చూసినట్లు ప్రవర్తించీ, వీరిని ఆపటానికి ప్రయత్నించారో ఇక మీ ఇక్కట్లు ప్రారంభమవుతాయి. ఏం?... డాక్టర్లూ, సూపరింటెండెంట్లూ, ఇన్‌ఛార్జ్‌లూ, నర్సులూ అంత తెలివితక్కువవారా? కారు! అందుకే వీళ్ళని అదుపులో పెట్టడానికి ముందుకురారు. వస్తే ఆపైన ఏం జరుగుతుందో వాళ్ళకి క్షుణ్ణంగా తెలుసు. తమ తిట్ల ప్రహసనానికున్న 'పవర్' ఆ సంఘటిత సమూహాలకు తెలుసు.

అయితే...

ఆరోజు... ఇలాంటి మామూలు పరిస్థితులేవీ అక్కడ లేవు. ఎందుకంటే రోగి సాక్షాత్తూ మంత్రి అందులోనూ వచ్చిపోయేది ఎందరెందరో రాజకీయనాయకులు. రాష్ట్రాన్ని ఏలే పెద్దలు. వారి ఎదురుగుండా ఎలా ప్రవర్తించాలో తెలుసుకున్న ఈ జనం మూగబోయారు. అనవసర కంగారు, భయం నటిస్తున్నారు.





రోజూ ఆస్పత్రికి వచ్చే జనానికి డబ్బులతో సిగ్నల్ ఇచ్చే వాచ్‌మన్‌లు సెల్యూట్‌లతో ఖద్దరు జనానికి స్వాగతం చెపుతున్నారు. వారు ఫలానా, వీరు ఫలానా అని వాచ్‌మన్‌లు ఆయాలకూ, ఆయాలు స్వీపర్లకూ చెవుల్లోనే గొణుగుతున్నారు. ఈ గొణుగుళ్ళ మధ్యలో ఆస్పత్రిలోకి ప్రవేశించాడు అభిషేక్. అప్పటికే రాయలుగారున్న ప్రత్యేక వార్డు ముందు కారిడారు రాజకీయజనంతో నిండివుంది. రకరకాల ఊహాగానాలు! వింతవింత సందేహాలు! అనుమానాలు! మంత్రి రాయలు మాట్లాడే స్థితిలో లేరు. ఆయన్ని అపస్మారకస్థితిలోనే అక్కడ చేర్పించారు. ఆ ప్రత్యేక వార్డులోకి వెళ్ళడానికి అభిషేక్‌కి ఇబ్బందయింది. అరగంట తర్వాత ఎలాగోలా లోపలికి వెళ్ళగలిగాడు. అది రాయలుతో మాట్లాడటానికీ, ఏమీ చెప్పటానికీ కూడా వీలు లేని స్థితి.

అభిషేక్‌కి బాధ వేసింది. బయటకు వచ్చేశాడు. మూలగా, ఆ కారిడార్లో ఓ వరండా అరుగుమీద కూర్చున్నాడు.

ఒక్కసారిగా రాయలుతో గతస్మృతులు మనస్సులో వరసగా తిరగసాగాయి. రాయలు అండదండలు లేకపోతే అభిషేక్ ఈ దినాన ఏ ప్రాముఖ్యతా లేని ఒక నిరుద్యోగ యువకుడు. రాయలు రాజకీయాలకి ముడివడి అభిషేక్‌లోని ప్రతిభ పైకి వచ్చింది. అదే ముందుకొచ్చి నాయకుడిగానూ చేసింది.

అభిషేక్ సర్వవిధాలా పుంజుకొంటున్న ఈ రాజకీయ జీవితంలో రాయలు లేకపోతే అంతా శూన్యమా? అభిషేక్ ప్రతిభ వెనక్కి వెళ్ళిపోతుందా? ఈ ప్రజలకు దూరమై మళ్ళీ జీవితం ప్రారంభదశకు వస్తుందా? నిరుద్యోగిలా కాలం గడిపితే లోకసహజమైన బానిసత్వపు భావనకు కట్టుబడివుంటే జీవనానికి లోటు వుండదు... కానీ అభిషేక్ గుర్తించబడిన రాజకీయ నాయకుడు. ఆ నాయకత్వం ఆందోళనలను నిర్వహించింది. అధికార్లను కంగారు పెట్టింది. యాజమాన్యాలను కలవరపెట్టింది. ఇలాంటి పరిస్థితులలో జీవితం మళ్ళీ ప్రారంభదశకు వస్తే అభిషేక్ ఏమవుతాడు?

అభిషేక్ రాజకీయరంగ ప్రవేశం చాలా చిత్రంగా జరిగింది, అనుకోని విధంగా! రాయలు మేనల్లుడు శివ, అభిషేక్‌కి చాలా దగ్గరయ్యాడు ఆ రోజుల్లో. అభిషేక్ స్థితి చూసి జాలిపడ్డాడు. అభిషేక్ మనసులో ఆవేశంగా ఎగసిపడే భావకెరటాలకు ఉత్తేజితుడయ్యాడు. ఆ అభిమానంతోనే రాయలు ముందుకి అభిషేక్‌ని తీసుకెళ్ళి, ఉద్యోగం కోసం నిలబెట్టాడు. అలా రాయలుతో జరిగిన తొలిపరిచయం అభిషేక్ కళ్ళముందు మెదిలింది.



"నీ పేరు అభిషేక్... బాగుందయ్యా... సరే, ఆ హెూటల్లో ఎందుకు మానేశావ్?" రాయలు ప్రశ్నించాడు.

సమాధానం పొందికగా, నిదానంగా చెప్పాడు అభిషేక్.

"ఈ రోజుల్లో అంతేనయ్యా... ఇంతకీ ఏ ఉద్యోగం చేస్తావ్?"

ఆ ప్రశ్న అభిషేక్‌కి నవ్వూ, బాధా కూడా కల్గించాయి. 'నాకు కావల్సిన ఉద్యోగమా' అని నవ్వుకున్నాడు. 'ఏ ఉద్యోగమేనా దొరుకుతుందా' అని బాధపడ్డాడు. ఈ దేశంలో నిరుద్యోగిని పట్టుకుని 'ఏ ఉద్యోగం చేస్తావ్?' అని ఎవరైనా అడగగలరా? ఒకవేళ అలా అడిగితే ఆ నిరుద్యోగి హృదయంలో ఆ క్షణంలో రేగే భావాలను ఈ కలాలు రాయగలవా? ఎంత రాసినా ఆ భావాల వాస్తవవర్ణన సాధ్యమా?...

"ఏదో ఒక ఉద్యోగం" నసిగాడు అభిషేక్. రాయలు అభిషేక్ బయోడేటా తీసుకున్నాడు. ప్రస్తుతానికి అతనికి వెంటనే ఉద్యోగం యివ్వటానికి ఆస్కారంలేదనీ కానీ ఎక్కడో అక్కడ ఎవరికో ఒకరికి చెప్పి తప్పకుండా జీవనోపాధి

కల్పిస్తాననీ హామీ ఇచ్చాడు రాయలు.

ఆ హామీ అభిషేక్‌కి హాయిగా అనిపించింది. రాయలు ఇంటిచుట్టూ నాలుగు నెలలు తిరిగాడు. ఆ హామీని రాయలుకి అనేకసార్లు వినయంగా గుర్తుచేశాడు. గుర్తుచేసిన ప్రతిసారీ రాయలు కొత్తగా అభిషేక్‌ని చూసేవాడు. అది గమనించిన అభిషేక్, రాయలు హామీని రాజకీయ హామీల పరంపరలో కలిపేశాడు.

కానీ రాయలు సౌమ్యం అభిషేక్‌కి చాలా నచ్చింది. ఎన్నిసార్లు ఎందరు విసిగించినా, విసుగే కనిపించనివ్వని రాయలు ముఖం అభిషేక్‌ని ఆకర్షించింది. అభిషేక్ రాయల్ని ఏమనలేదు. రాయలు అభిషేక్‌కి ఉద్యోగం ఇప్పించాలని గట్టిగా అనుకొంటాగనే నమ్మకమూలేదు. రాయలు ఇంటిచుట్టూ తిరిగి అన్నీ అలవోకగా పరిశీలించిన అభిషేక్‌కి ఓనాడు ఓ బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది. ఆ ఆలోచన అభిషేక్‌ని తట్టిలేపింది. రాయల్ని ఇహ ఉద్యోగం కోసం విసిగించకూడదనుకున్నాడు. మర్నాడు ఉదయమే రాయలింటికి వెళ్లాడు. అప్పటికే ఎవరెవరో ఇంటిముందు హాలులో వున్నారు. అది రాయలు రోజూ స్నానంచేసి పూజచేసుకునే సమయం. అభిషేక్ ఆ హాలు దాటి రాయలు ఆఫీస్ గదిలోకి వచ్చాడు.

"సార్... ఎవరు మీరు?" ఓ నౌకరు అడ్డగించాడు.

"నీ పేరేమిటయ్యా?" ఎదురు ప్రశ్నవేశాడు అభిషేక్.

"సింహాద్రండీ... మీకేం కావాలి? అయ్యగారి గదిలోకి వచ్చేసినారు. ఏంటి ఇసయం?"

"నన్ను అయ్యగారు సెక్రట్రీగా పెట్టుకున్నారు. ఈవేళ ఉద్యోగంలో చేరమన్నారు" అని అభిషేక్ నెమ్మదిగా అంటూండగానే

"అయ్యబాబో! అయ్యగారి సెక్రట్రీ అన్నమాట మీరు. నేనాయనకాడ ఆర్నెల్లమట్టి పన్జేస్తున్నానండి" అన్నాడు సింహాద్రి.

"అలాగా" అంటూ ఓ పుస్తకం, పెన్నూ తీసుకుని రాయల ఆఫీస్ గదిలోంచి హాలులోకి వచ్చాడు అభిషేక్. అభిషేక్ వెనకాలే సింహాద్రి కూడా వచ్చాడు. అభిషేక్ హాలులో రాయల కోసం వెయిట్‌చేస్తున్న వాళ్ళందర్నీ పరిచయం చేసుకొన్నాడు. వాళ్ళెందుకు వచ్చారో కనుక్కున్నాడు. ఏవో తమతమ మున్సిపాలిటీ ఏరియాలలో వున్న సాధారణ సమస్యలనూ వాళ్ళు అభిషేక్ ముందుకు తెచ్చారు. అభిషేక్ వాళ్ళ సమస్యలను ఓపిగ్గావిని తన దగ్గరున్న పుస్తకంలో రాసుకున్నాడు. తాను ఆయన దగ్గర సెక్రట్రీనని ముందే అందరికీ చెప్పాడు. వాళ్ళ పనులు తొందరలో పూర్తవుతాయని వాళ్లకి హామీయిచ్చాడు అభిషేక్. అతని హామీని వాళ్ళు పెద్దగా పట్టించుకోలేదు. అందుకు అభిషేక్ బాధపడలేదు. 'పదవిలేని తనని వాళ్ళెందుకు లెఖ్ఖచెయ్యాలి?' అనుకున్నాడు. వాళ్లతో మరోసారి చెప్పాడు. రాయలుగారి తరపున తాను హామీ యిస్తున్నానని. ఫలానా తేదీనాటికి వాళ్ల పనులు పూర్తవుతాయని నమ్మకంగా చెప్పాడు. ప్రతివారికీ వాళ్లవాళ్ల పనినిబట్టి తేదీ ఇచ్చేశాడు. తానుచెప్పి ఆరోజునాటికి పనులు పూర్తికాకపోతే రాయలుగారిని అడగమని చెప్పాడు. అతను మాట్లాడేతీరు వాళ్ళకి కొద్దిగా నచ్చింది. అలా వాళ్లని మాటలతో ఆకట్టుకొన్నాడు అభిషేక్.

రాయలుగారు స్వయంగా ప్రతిపని చెయ్యటం సాధ్యంకాదుకదా? అందుకే మీ పనులు దగ్గరుండి చేసేందుకే నన్ను నియమించుకున్నారని చెప్పాడు అభిషేక్. ఒకపని గురించి అనేకసార్లు యింటిచుట్టూ తిప్పుకోవడాన్ని రాయలుగారు వదిలేసారన్నాడు. ఒక వ్యక్తి ఓ చిన్నపనిమీద ఒక్కసారి వస్తే ఆపని అయిపోవాలని రాయలు అంటున్నారన్నాడు. రాయలుగారిని స్వయంగా కలవాల్సిన అవసరం యికపై రాదన్నాడు. పనికాకపోతే మాత్రం ఆయన్ని నిలదీసి అడగచ్చన్నాడు.

రాయలు స్నానం, పూజ ముగించుకున్ని హాలులోకి వచ్చేసరికి అందరినీ సాగనంపేశాడు అభిషేక్. హాలంతా ఖాళీగావుంది. తన ఆఫీస్‌గదిలోకి వెళ్ళి సింహాద్రిని పిలిచాడు రాయలు.

'అయ్య' అంటూ వచ్చాడు సింహాద్రి.

"ఎవరూ లేరేమిటి?"

"ఆయ్' సింహాద్రి సమాధానానికి రాయలు ఆశ్చర్యపోయాడు.





"అవునండీ... ఆయనెవరో కొత్త సెక్రట్రీగారు వచ్చారు కదండీ - ఆయనే ఆళ్లతో మాటాడేసి పంపేసినారండీ" సింహాద్రి చెప్పాడు.

"సెక్రట్రీయా... ఎవరూ... పిలు..." రాయలు అన్నతడవుగానే సింహాద్రి అభిషేక్‌ని పిలవటానికి హాలులోకి వెళ్ళాడు. అభిషేక్ రాయలు గదిలోకి అడుగుపెట్టాడు. అభిషేక్‌ని చూస్తూనే "రావయ్యా అభిషేక్" నవ్వుతూ ఆహ్వానించాడు రాయలు. "ఏమయిందీ నీ ఉద్యోగం సంగతి?"

"ఇక నాకు ఉద్యోగం మీద ఆసక్తిలేదండీ"

"అదేమిటయ్యా... ఎక్కడో అక్కడ ప్రయత్నిద్దాంలే"

"వద్దుసార్... నాకింకేం ఉద్యోగంవద్దు. ఏదో మీదగ్గర పనిచేసుకుంటాను. మీకు పర్సనల్ సెక్రట్రీగా వుండనివ్వండి చాలు. మీకు కావల్సిన పనులు చేస్తాను. నాకు టైప్ వచ్చు. ఇంగ్లీషు డ్రాఫ్టింగ్‌వచ్చు. మీకేవిధమైన పనికావాల్సినా చెయ్యటానికి శాయశక్తులా ప్రయత్నిస్తాను. మీకు నాపని నచ్చితే వుంచుకోండి. లేకపోతే వెళ్ళిపోతాను" అభిషేక్ అన్నాడు.

"అంటే... సింహాద్రి చెప్పిన సెక్రటరీవి నువ్వేనా?" రాయలు కంఠం కొంచెం గంభీరంగా మారింది.

"అవునుసార్ నేనే" అభిషేక్ పూర్తిచేయకుండానే-

"నా కోసం వచ్చిన వాళ్లందర్నీ పంపించేసావుట... అదేంపని?" రాయలడిగాడు.

"ఏంలేదుసార్... వాళ్లవన్నీ చిన్నచిన్న పనులు... ఒక్క ఫోన్‌కాల్‌తో అయిపోయే పనులు. వాటిగురించి మీ సమయాన్ని వృధాచెయ్యటం ఎందుకని. అందుకే వాళ్ల సమస్యలన్నీ నోట్‌చేసుకొని వాళ్లకి నచ్చచెప్పిపంపేశాను.... మీ దగ్గర నన్ను పనిచెయ్యనివ్వండి సర్... యిలాంటి చిన్నచిన్న పనులన్నీ నేనే చూసుకుంటాను. నామాట కాదనకండి. ఒక్క అవకాశం యివ్వండి. నాకు యిలాంటి పనులు చెయ్యడం చాలా ఇష్టం. ఈ పనులు అనుకున్నసమయానికి అయిపోతాయనే నమ్మకం నాకుంది. అందుకే మీకు తెలీకుండా అలా చేశాను. ఆ పనులు కాకపోతే, నేనెప్పుడూ మీకు కనిపించను. ప్లీజ్‌సర్! ఒక్క అవకాశమివ్వండి" - అభిషేక్ అర్థించాడు. ఒక్క అరనిమిషం ఆలోచించాడు రాయలు. అప్పుడు అన్నాడు 'నువ్ చెప్పింది కరక్టే... కానీ నీకెక్కడయినా ఉద్యోగంవస్తే ఏదో నాలుగురాళ్ళు సంపాదించుకో. అది బాగుంటుంది. నాదగ్గర పనిచేస్తే నీకేం వుపయోగం. ఎంతసేపూ రాజకీయాలు. నువ్వా చదువుకున్నవాడివి. ఈ రాజకీయాల్లో తలదూర్చటం అంతమంచిది కాదేమో! ఒకవేళ నువ్ నా దగ్గర పనిచేశావే అనుకో... నేనేమివ్వగలను నీకు... నువ్వా నా దగ్గర చేస్తానంటున్నావ్'-

"మరి ఆలోచించుకో" అన్నట్లుగా చూస్తూ అన్నాడు రాయలు.

"మీనుంచి ఏదో ఆశించికాదండీ మీ దగ్గర వుంటానన్నది. మీకు పనులు చేసిపెడుతూ, వచ్చినవాళ్ళకు ఏదో సహాయపడితే ఎప్పటికైనా నాకు మంచిదారి ఏర్పడుతుందని నేను నిర్ణయించుకునే ఇలా మీ ముందుకు వచ్చాను. రాజకీయాలంటారా... అవి మీవి. నేను రాజకీయాల్లో తలదూర్చను. మీకు ఏనాడూ అడ్డురాను. మీ దగ్గరికి రోజూ అనేకమంది వస్తుంటారు. అలాంటివారిలో ఎవరైనా నన్ను చూసి ఏ పని అయినా కల్పిస్తే చాలని నేననుకుంటున్నాను. ఆ తర్వాత మీఇష్టం. మీరు వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోతాను" అభిషేక్ నిర్ణయం మీదే అన్నట్లుగా చూసి తన నిర్ణయం బయటపెట్టాడు.

"అరెరె... అలా ఎందుకంటావయ్యా. నీ కష్టం నేనుంచుకోనులే. ఏదో నాకు వీలున్నప్పుడు తృణమో ప్రణమో ఇస్తుంటాను... సరే మరి! వుండు" అని రాయలు తనమీద భారంలేకుండా అభయం ఇచ్చాడు.

ఆ అభయం అభిషేక్ జీవితాలలో కొత్త ఆశలను రేకెత్తించింది. ఎందుకైనా ఉపయోగపడకపోతుందా, చివరికి కార్యకర్తగానైనా పనికి వస్తాడనే ఒకేఒక అభిప్రాయంతో అభిషేక్‌నీ చేరదీశాడు రాయలు. కానీ అభిషేక్‌మాత్రం ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవటానికి చాలా కష్టపడ్డాడు.

రాత్రనక, పగలనకా ఎంతో శ్రమించాడు. రాయలు ప్రోత్సాహంతో ప్రజల చిన్న చిన్న

పనులుచేసేవాడు. తిరగటం శ్రమనిపించినా ఓర్చుకుంటూ, అధికార్లు దర్పం ప్రదర్శించినా శాంతంతో సహిస్తూ వ్యవహరించాడు. అభిషేక్ నేర్పూ, ఓర్పూ రాయల్ని నెమ్మదిగా ఆకట్టుకోవడం మొదలుపెట్టాయి. సరిగ్గా అభిషేక్ భవిష్యత్ గురించే అన్నట్లుగా ఆ సమయంలో రేవు కార్మికుల సమస్య చెలరేగింది. వాళ్ళు కూలీరేట్ల విషయంలో వివాదంలోకి దిగారు. పోర్ట్‌ట్రస్ట్, కార్మికుల మధ్య సంబంధాలు దెబ్బతిన్నాయి. పనిచెయ్యమని కార్మికులు పిడికిలి బిగించారు. దాంతో ఎగుమతి, దిగుమతి కార్యక్రమాల స్తంభన జరిగింది. ఆ విషయం తెలుసుకున్న అభిషేక్ పోర్ట్ కార్మికులపక్షాన నిలవాలని రాయల్ని కోరేడు. రాయలు 'మనకెందుకులే' అన్నాడు. కార్మికవర్గాల్లో పలుకుబడి పెరగటానికి ఆస్కారం వుందనీ, కూలీరేట్లు ఎలాగైనా ఎంతోకొంత పెంచే అవకాశముందనీ, అలా జరిగితే ఆ ఘనత రాయలకీ కొంచెం దక్కుతుందనీ, కాబట్టి చొరవచేసి యాజమాన్యంతో చర్చించి, కార్మికవర్గాన్ని శాంతింపచేస్తే మంచిదనీ రాయలుకి చెప్పి ఆయన్ని ఆలోచింపచేశాడు అభిషేక్. అది చెయ్యటంవలన నష్టంఏమీలేదు అనుకున్నాడు రాయలు. రాజకీయంగా ఆ చర్య సమంజసంగానే తోచింది రాయలుకి. అంతే...

"నగర డిప్యూటీ మేయర్ శ్రీ ఆర్.పి.రాయలు పోర్ట్‌ట్రస్ట్ కార్మికులపట్ల సానుభూతి వ్యక్తంచేశారు. కార్మికుల తరపున చర్చలకు దిగారు. వాళ్ళ వేతనాలు దశాబ్దంగా పెరగకపోవటం, పని భారమవటంపట్ల ఆయన విచారం వ్యక్తంచేశారు. డిప్యూటీమేయర్ పదవిలోవున్న ఓ వ్యక్తి కార్మికుల వివాదాన్ని పరిష్కరించటానికి ముందుకు రావటం అదే ప్రథమం కావటంతో యాజమాన్యం ఆశ్చర్యపోయింది. కార్మికులుకూడా తమ తరపునుంచి పెద్దగా శ్రీ రాయలు చర్చలకు వెళ్ళటంతో తమ సంపూర్ణ సమ్మతాన్ని ప్రకటించారు" మర్నాడు దినపత్రికల్లో పడ్డ పైవార్త చూసి రాయలు ఆనందపడ్డారు. అదేరోజు పోర్ట్ కార్మికనాయకులు రాయలింటికి వచ్చారు. వారిని సాదరంగా ఆహ్వానించాడు. అంతకుముందు రోజే రాయలు వారిని కలిశాడు. రెండు గంటలసేపు వారితో కలిసి ఉన్నాడు. 'మీకేం ఫర్వాలేదని' అభయం ఇచ్చాడు. దాంతో రాయలు వారి దృష్టిలో ఎదిగిపోయాడు. కార్మికనాయకులేమో రాయలుకి దగ్గరవటానికి విడివిడిగానూ, కల్సికట్టుగానూ ప్రయత్నించారు. కార్మికులు వెళ్ళగానే యాజమాన్యం వచ్చింది రాయలింటికి. వారిని కూడా సాదరంగా ఆహ్వానించాడు. ఇలా ఆ రెండువర్గాలతోనూ రాయలు మూడురోజులపాటు చర్చలు కొనసాగించాడు. ఈలోగా ఇతర కార్మిక సంఘాలనాయకులు రాయల్ని అభినందిస్తూ ప్రకటనలు చేశారు.

రాయలుచేసినపనికి తమ సంఘాలు మద్దతు తెలిపాయి. రాయలు ఆ ప్రకటనలుచూసి ఆశ్చర్యపోలేదు కానీ... ఆ సంఘాలవైపుకూడా దృష్టి సారించాడు. రాయలు మనసులోని ఆలోచనను అర్ధంచేసుకొన్నాడు అభిషేక్. చర్చల అనంతరం, యాజమాన్యానికీ, కార్మికులకూ సయోధ్య కుదిర్చి కార్మికుల దృష్టిలో తమ పెన్నిధిగా, యాజమాన్యం దృష్టిలో గౌరవనీయంగా రాయలుస్థానం సంపాదించాడు. పోర్ట్ కార్మికులు పనిలోకి వచ్చేశారు. వారి కూలీరేట్లు పెరిగాయి. ఎంత పెరిగాయనేది వాళ్ళు పట్టించుకోలేదు. పెరిగాయా లేదా? పెరిగాయి? అదే వాళ్ళు సాధించిన విజయం. రాయలు సాధించిపెట్టిన విజయం. ఈ విజయం రాయలుదే అన్నట్లుగా పత్రికలు అభివర్ణించాయి. మిగతా కార్మికసంఘాల నాయకులు కొంచెం కలవరపడినా, రాయలుతో కలిస్తేపోయేదేముందని సరిపెట్టుకున్నారు. అనుకోని ఈ కార్మికసమస్య యింతపేరు తెచ్చిపెట్టి, రాజకీయంగా ఓ మెట్టుపైకి ఎక్కిస్తుందని అనుకోలేదు రాయలు.

ఆవిధంగా అభిషేక్, రాయలు అంతరంగంలో ఒక పనికివచ్చే సాధనంగా మారిపోయాడు.

రాయల ఇల్లు మారింది. కార్యకలాపాలు పెరిగాయి. రోజులు బిజీగా మారిపోయాయి. ప్రజలు, కార్మికులు, యాజమాన్యం, అధికారులు వివిధ రంగాల ప్రముఖులు రాయల్ని పనిచేసే వ్యక్తిగా గుర్తించాయి. రాయల ఆ గుర్తింపుకోసమే అభిషేక్ అహర్నిశలూ శ్రమించాడు. ఆ శ్రమకి రాయలి ప్రోత్సాహం నిండుగా




వుండేది. రాజకీయంలో రాయలు మెట్లు ఎక్కుతున్నాడు. అభిషేక్‌ని కూడా రాయలు తనతో పాటు తిప్పుకుంటున్నాడు. అందరినీ పరిచయం చేస్తున్నాడు. అలా మెల్లగా అభిషేక్ కూడా ప్రజల ముందుకు రాగలిగాడు.

ఆ సమయంలోనే రాష్ట్ర శాసనసభకు ఎన్నికలు వచ్చాయి. రాయలు మీద ఇతరులకన్నా అభిషేక్ ఒత్తిడి ఎక్కువ అయింది. పలుకుబడి, పేరూ వున్నవాళ్లు ఆ సమయంలోనే రాజకీయ హోదా పెంచుకోవాలని అభిషేక్ అభిప్రాయం. ఆ అభిప్రాయం రాయలుకి నచ్చినా అధికార పార్టీ టికెట్ సంపాదించటం అంత సులభంగా కనిపించలేదు. ఇద్దరూ ఎన్నో ప్రయత్నాలు చేశారు. ఫలించలేదు. ఓ రాజకీయనాయకుడు హైద్రాబాద్‌లో తిష్టవేసి అప్పటికే ఆ పార్టీలో వున్న బంధువర్గసహకారంతో టికెట్ సంపాదించాడని అభిషేక్‌కీ, రాయలుకీ తెలిసిపోయింది. కానీ ఆ వ్యక్తిని అభ్యర్థిగా, పార్టీ అధికారపూర్వకంగా ప్రకటించలేదు. అది గమనించాడు అభిషేక్.

పార్టీ టికెట్ లభించిందన్న ఆనందంతో పార్టీ టికెట్ ఇప్పించిన బంధువుల పెద్దతో పైరవీకి ఆ రాజకీయనాయకుడు ఢిల్లీ వెళ్లాడు. అతనటు వెళ్తే రాయలు అదృష్టంకొద్దీ, పార్టీ టికెట్ ఇచ్చే నిర్ణయాధికారం వున్న అధికారపార్టీ మంత్రి ఇటు వచ్చాడు. ఆ మంత్రిదీ ఈ జిల్లాయే. ఈ మంత్రి రాక తెలిసింది. వెళ్లి కలుద్దామన్నాడు అభిషేక్.

''ఇపుడేం చేసినా ప్రయోజనం లేదన్నాడు'' రాయలు.

''ప్రజలచేత ఆ మంత్రికి చెప్పిద్దాం'' అభిషేక్ సలహా యిచ్చాడు.

''మనసులో నిర్ణయం తీసుకున్న తర్వాత మార్చుకోవటం కష్టం. అదీగాక ఆ మంత్రి ఎంత పలుకుబడి వున్నవాడు చెబితే టికెట్ యిచ్చాడో... రాజకీయాల్లో పలుకుబడి వున్నవాడు ఏమాట చెప్పినా చెల్లుతుంది. ప్రజలు చెప్పినంత మాత్రాన రాజకీయ నిర్ణయాలు మారవు'' రాయలు అభిషేక్‌కి వివరించాడు. ఇద్దరూ చర్చించుకున్నారు.





''కనకరాజుకి పార్టీ టికెట్ వచ్చిందని అందరూ చెపుతున్నారు గానీ పార్టీ మాత్రం ఇంకా ప్రకటించలేదు సార్! ఆఖరిక్షణంలో కూడా అభ్యర్థులను మార్చిన ఎన్ని సంఘటనలు లేవూ... కనకరాజు ఎలానూ విశాఖపట్నంలో లేడు. మంత్రి వచ్చేసరికి కనకరాజు గ్యారంటీగా వుండడు. మనం ఎలాగైనా ఆయన్ని కలుద్దాం సర్. ఏమో టికెట్ దొరకవచ్చు. మీరు ఎం.ఎల్.ఎ అవ్వచ్చు సర్''! అభిషేక్ సూటిగా, స్పష్టంగా రాయల్ని ఉత్తేజపరుస్తున్నాడు. అభిషేక్, రాయలు రాజకీయపు ఆలోచనల్లో మునిగిపోయారు. యిద్దరికీ ఎలాగైనా పార్టీ టికెట్ సాధించాలనే పట్టుదల పెరిగింది. విశాఖలో ఏర్పాటయిన ఆ సభకి, ఆ పార్టీ టికెట్ ఇచ్చే నిర్ణయాధికారంవున్న అధికారపార్టీ మంత్రి వచ్చేశాడు.

ఆయన సభలోకి అడుగుపెట్టగానే ఆయనకు వ్యతిరేకంగా పెద్ద అల్లరి మొదలైంది.

డౌన్. డౌన్...

గో బ్యాక్... గో బ్యాక్...

దొంగ... ద్రోహి...

డౌన్... డౌన్...

గో బ్యాక్... గో బ్యాక్...

మంత్రి ఈ హఠాత్పరిమాణానికి అవాక్కయ్యాడు. సభ నిర్వాహకులు కూడా నిశ్చేష్టులయ్యారు.

ఆ ప్రజలెందుకు తనని వ్యతిరేకిస్తున్నారని సభ నిర్వాహకుల్ని మంత్రి నిలదీశాడు. ఆ నిర్వాహకులు భయభ్రాంతులై ఆ ప్రజల తరపున నాయకుల్లా ప్రవర్తిస్తున్న నలుగురినీ మంత్రి ముందు నిలబెట్టారు.

''ఏమిటి మీ సమస్య? ఏమిటీ నినాదాలు?... నన్నెందుకు తిడుతున్నారు''! మంత్రి కంఠంలో కోపం తాండవించింది.

మంత్రి వాళ్లని ప్రశ్నిస్తూండగానే నినాదాలు మళ్ళీ ప్రారంభమయ్యాయి. ఈసారి నినాదాల్లో కనకరాజు పేరు చేర్చారు. ''కనకరాజుకి జై... కనకరాజు... జిందాబాద్... కనకరాజుకు టికెట్ ఇవ్వాలి- యిలా నినాదాలు మారుమోగుతున్నాయి.

మంత్రి ఆ నలుగురికేసీ చూస్తూ ఆ నినాదాలను ఆపించమన్నాడు. ఆ నలుగురూ చేతు

లెత్తి జనాన్ని ఊరుకోమంటూ అరిచారు.

"కనకరాజు మనుమలా మీరు?" మంత్రి అడిగాడు.

"అవును" నలుగురిలో ఒకడు సమాధాన మిచ్చాడు.

"ఎందుకు చేస్తున్నారు ఈ అల్లరి?" మంత్రి నిలదీశాడు.

"మీరాయనకు టికెట్ ఇవ్వలేదుగా"

"ఎవరు చెప్పారు మీకు?"

"ఎవరేటండీ... ఆయనే హైద్రాబాద్ ఎల్లేట ప్పుడు మాకు చెప్పారు. ఒకేల టికెట్ రాకపోతే మేం హైద్రాబాద్ వచ్చి మీఇంటికాడ గేరావు చేయాలనుకున్నాం. మీరిక్కడికే వచ్చారు కాబ ట్టి సరిపోయింది. టికెట్ రాగానే మాకు చెబుతా నన్నారు. ఆయన మాకు చెప్పలేదు. కనిపించ లేదు. ఆయన బంధువులు మీరే టికెట్ ఇప్పించలేదని తిట్టారు. అందుకే మేమూ తిడ్తున్నాం. ఆయనకు గనక టికెట్ ఇవ్వకపోతే ఊరుకోమండీ అల్లరైపోద్ది" ఆ నాయకులలో ఒకడు హెచ్చరించినట్లుగా మాట్లాడాడు. మంత్రి ఆలోచనలో పడ్డాడు.

"కనకరాజుకి టికెట్ యిస్తానని నేనే స్వ యంగా చెప్పేనే, అంటే టికెట్ రాకపోతే... ఒకవేళ నేను ఏ పరిస్థితులోనైనా టికెట్ యివ్వ లేకపోతే నాయింటిమీద వీళ్ళచేత దాడిచే యించటానికి ముందే ప్లాను వేశాడన్నమాట! టికెట్ తనకే వస్తుందని తెలిసినా కనీసం ఈ జనానికి చెప్పలేదా? అంటే... నేను వైజాగ్ ఎందుకెళ్తాననుకున్నాడేమో! ఇదీ ఒకందుకు మంచిదేలే. ఈ జనం తిట్టినా పోనీ... వాడి సంగతి మాత్రం బయటపడింది... అమ్మా... ఆ కనకరాజుగాడు నామీద ఇంత రాజకీయం నడపాలనుకున్నాడా?..." మంత్రి మనసులోనే ఆవేశపడి ఆ జనాన్నీ... నాయకుల్నీ "కనకరా జుకి టికెట్ ఇచ్చే అధికారం నాదికాదనీ, వేరొకరిదనీ" చెప్పి తప్పించుకుని వాళ్ళని పంపించేశాడు.

మళ్ళీ తనే ఆలోచించుకున్నాడు.

"ఈ జనాన్ని హైదరాబాద్ కూడా రమ్మ న్నాడా కనకరాజు! నయమే ఇంకా వాడిని అధికారికంగా ప్రకటించకుండానే జనం నా ముందుకు వచ్చారు. ప్రజలతో ఆటలాడితే ఎలా? వాళ్ళని హైదరాబాద్ రమ్మన్నా... నేనిక్క డకు వస్తున్నా అని తెలిసి యిక్కడే నాకు వ్యతిరేకంగా నినాదాలిచ్చారన్నమాట. పాపం! వాళ్ళకేం తెలును... ఆ కనకరాజుగాడు చే సిందన్నమాట ఇదంతా" మంత్రిగారి మన సులో సెగలు రేగాయి.

ఆ రాత్రికిరాత్రి మంత్రిగారు తను మకాం చేసిన గెస్ట్‌హౌస్‌కు జిల్లా నాయకులను పిలి పించి పార్టీ అభ్యర్థి సమస్యను వాళ్ళముందు పెట్టాడు. ఆ నాయకులు చాలామందిని సూ చించారు. చివరికి రాయలు విషయం వచ్చింది. ఎవరూ మాట్లాడలేదు. రాయలుగు రించి విమర్శలు వినపడలేదు. ఆ నాయకు లకు రాయలు గట్టి అభ్యర్థి అనే అచంచల మైన నమ్మకం లేకపోయినా, ఆయనపట్ల ద్వేషం మాత్రంలేదు. అందుకే ఎవ్వరూ పె ద్దగా అభ్యంతరాలు లేవదీయలేదు.

ఆ పరిస్థితి మంత్రికి నచ్చి వెంటనే రాయ ల్ని పిలిపించి పార్టీ టికెట్ గురించి మాట్లాడా డు.

నాయకులందరూ ఇష్టపడితేనే తాను పోటీలో వుంటానని రాయలు అన్నాడు. ఆ వినయానికి నాయకులు చలించిపోయి రాయ లుకి తమ మద్దతు తెలిపారు.

రాయల్ని అధికారికంగా పార్టీ అధ్యక్షుడు అభ్యర్థిగా నిర్ణయించాడు. ఆ ప్రకటన మంత్రి విశాఖనుంచి హైద్రాబాద్ వెళ్ళిన మూడురోజు లకి వెలువడింది.

రాయలు, అభిషేక్‌ల ఆనందానికి అవధు లు లేకుండాపోయాయి.

రాయల్ని అభ్యర్థిగా నిర్ణయించటం కోసం వీళ్ళిద్దరూ ఆడిన నాటకంలో భాగంగా ఆరోజు సభలో గొడవ చేసిన కార్మికనాయకులు, వారి జనం ఆనందపడ్డారు.

ఈలోగా కనకరాజు ఢిల్లీ నుంచి హైద్రాబాద్ వచ్చి, మంత్రిమీద విరుచుకుపడ్డాడు. మంత్రి తనకేం తెలీదన్నాడు. కనకరాజు మంత్రిమీద దాడి చేసినంత దూకుడుగా ప్రవర్తించినా ఆయన మౌనం పాటించాడు. కారణాలు తనకు తెలీదన్నాడు. అధిష్ఠానవర్గ నిర్ణయమ



యిందని చెప్పి తప్పించుకున్నాడు.

పార్టీ అభ్యర్థిగా రాయలు నిలబడినా, ఇండి పెండెంట్‌గా పోటీ చేస్తానని ప్రతిజ్ఞ చేసి కనకరాజు నామినేషన్ వేశాడు.

పార్టీలోంచి సస్పెండ్ చేస్తామని అధిష్టానవర్గం బెదిరించగానే కనకరాజు పోటీనుంచి విరమించాడు. రాయలు ఓడిపోవటానికి కృషి చేసినా ఫలితం లేకపోయింది.

ఎన్నికల ప్రచారబాధ్యతంతా అభిషేక్‌దే. రాయలు కార్మికవర్గాల సహకారాన్ని పూర్తిగా వినియోగించుకొన్నాడు. రాయలు డిప్యూటీ మేయర్‌గా ప్రజలకు చేసిన సేవలని పెద్దగా ప్రచారం చేశారు. నిర్ణయం మీదే అన్నాడు అభిషేక్. వాడవాడల్లోని సమస్యలనూ, వారి ముందే ఏ కరువుపెడుతూ రాయలు ఎన్నికయిన మూడునెలల్లో ఆ సమస్యలను పరిష్కరించే ప్రయత్నాలు జరుగుతాయని నమ్మకంగా చెప్పాడు. ప్రజలకు హామీలు నోటితో కాక రాయలు సంతకంతో యిస్తామన్నాడు. నమ్మకంలేని ప్రజల్ని ముందుకొచ్చి రాయలు దగ్గర రాతపూర్వక హామీలు తీసుకోమన్నాడు. ప్రజాస్వామ్యం రాతకోతల వరకూ రాదని ఎవరికీ తెలియదు. కానీ ఆ ప్రచారం జనానికి నచ్చింది. నమ్మకం పెరిగింది.

అభిషేక్ సంచలనాత్మక ప్రచారం చూసి రాయలు ముందు కొంత కంగారుపడినా, ఆ ప్రచారప్రభావం చూసి తమాయించుకున్నాడు. ఈ ప్రచారం రాయలకి చాలా లాభాన్ని చేకూర్చింది.

ఈ కార్యక్రమంలో అభిషేక్ ప్రజలకు బాగా పరిచయమయ్యాడు. రాయలకి కొంత తలనొప్పి తగ్గింది. అభిషేక్‌చుట్టూ ఆ పనీ, ఈ పనీ అంటూ ప్రజలు తిరుగుతున్నారు. ఆ ప్రజల్ని ఎలా మెప్పించాలో అతనికి తెలుసు. చిన్నచిన్న పనులకోసం, రాయలు నిజంగా సమయాన్ని వృధా చెయ్యలేని స్థితికి వచ్చాడు. ఆ స్థితి అభిషేక్‌కి బాగా ఉపయోగపడింది. అభిషేక్ తన శక్తి, రాయలుపేరూ, పలుకుబడీ విలువకొద్దీ జనం పనులు చేసిపెట్టాడు. ఎన్నికల ప్రచారంలో అభిషేక్ మాట్లాడినా, ప్రజల్లో నమ్మకం కలగటానికి అదే ఉపయోగపడింది. ఏ సమాచారసాధనంకన్నా వ్యక్తినుంచి వ్యక్తికి... అలా వ్యక్తులనుంచి మరికొంతమందికి వెళ్ళే సమాచార ప్రభావం ఎక్కువగా వుంటుంది. ప్రజల్లో కలిగిన అభిప్రాయాలు అలా అలా ప్రాకిపోతాయి. గోరంతలు కొండంతలుగా మారవచ్చుగానీ, ఒకసారి "వాడు ఫర్వాలేదు" అనుకున్నాక ఆ ప్రజాభిప్రాయాన్ని మార్చటం చాలా కష్టం. అందుకే...

ఎలాంటి పెద్ద సమస్యా ఎదురుకాకుండానే రాయలుకి విజయం లభించింది. ఎం.ఎల్.ఎగా ఎన్నికయ్యాడు.

అంతలో జనంలో కలవరం వినపడేసరికి వాస్తవంలోకి వచ్చాడు అభిషేక్.

అతని కళ్ళు చమర్చాయి. రెండు కన్నీటి చుక్కలు రాలాయి.

"రాయలుకి ఏమీ అవగూడదు" అనుకున్నాడు మనసులోనే.

ఎవరో తన పక్కనే నిలబడి మాట్లాడుకుంటున్నారు. "కష్టమేమోరా" అని వినబడింది అభిషేక్‌కి. అంతే చివ్వునలేచి రాయలు ఆరోగ్యపరిస్థితిని పూర్తిగా తెలుసుకోవటానికి డాక్టర్లని కలుద్దామని బయల్దేరాడు.

ఈలోగా ఎవరెవరో వస్తున్నారు. "రాయలుగారి భార్య... పిల్లలూ" అని వినిపించింది అభిషేక్‌కి. అటువైపు చూసాడు. అంతే నివ్వెరపోయాడు. రాయలుగారి భార్య, అబ్బాయి, జ్యోత్స్న. జ్యోత్స్న అభిషేక్‌ని చూడలేదు.

"ఈ అమ్మాయి..." మనసులోనే మారుమ్రోగిన మాట పెదాలుదాటి వచ్చేసింది.

"రాయలుగారి అమ్మాయి... మీకు తెలీదా?" ఎవరో చెప్పారు.

కొంచెంసేపు ఆశ్చర్యం ముంచెత్తినా అంతకుమించి ఆ సమయంలో ఏమీ ఆలోచించలేకపోయాడు అభిషేక్. ఆ పరిస్థితి అలాంటిది. రాయల్ని చూడటానికి వస్తున్న వాళ్ళు అభిషేక్‌ని, రాయలు ఆరోగ్యం ఎలావుందని అడుగుతున్నారు. అభిషేక్ డాక్టర్లను కలిస్తే వాళ్ళు ఇదమిద్ధంగా ఏమీ చెప్పలేకపోయారు.

ఓ మూడుగంటలసేపు.

హాస్పటల్‌లోవున్న ప్రతీవారిని టెన్షన్‌లో పెట్టిన రాయలు గుండె ఆ తర్వాత ఇక





పనిచెయ్యనని మొరాయించింది.

రాయలు అనంతకాలగర్భంలో కల్సిపోయాడు. మృత్యువు ముందు హోదా, పలుకుబడి, పేరూ, డబ్బూ ఏవీ పనికిరావు. డాక్టర్లు ఎంత తీవ్రంగా కృషిచేసినా, రాయలు ప్రాణం వాళ్ళనుంచి తప్పించుకుని అనంతవాయువుల్లో కల్సిపోయింది. అభిషేక్‌కి రాయలు మరణం అసహజంగా తోచకపోయినా నవనాడుల్లోనూ సంచలనాన్ని కలిగించింది.

రాయలు రాజకీయంగా ఉన్నతస్థాయికి ఎదుగుతూంటే తన స్థితిలోనూ పెరుగుదల వుంటుందని నమ్మిన అభిషేక్‌కి రాయలు మరణం హృదయశోకంగా మారిపోయింది. ఒక వ్యక్తి మరణిస్తే... ఆ మరణం గురించి ఎవరేడుస్తారు? ఎందరేడ్చినా అది ఎప్పటికీ మరణమే. ప్రతీ ప్రాణికి పుట్టినతర్వాత జీవితం అశాశ్వతంగానీ మరణం శాశ్వతమే.

మరో జన్మలో ఏమవుతుందో ఎవరికి తెలుసు? మరో జన్మవున్నా ఈ మరణం శాశ్వతమే. ఒకరి మరణం రకరకాల కారణాలవల్ల మరొకరికి దుఃఖం కల్గిస్తుంది. వయసులోవున్న భార్యకు భర్తపోతే అమితమైన దుఃఖం కలుగుతుంది. ఎంతో జీవితాన్ని తనతో గడపాల్సిన భర్త సర్వసుఖాలకు తనను దూరంచేసి పోయాడనే, ఆమె బాధపడుతుంది.

అదే వయసులో వుండగా భార్య మరణిస్తే ఆమె పట్ల తన ప్రేమను చాటుకుంటూ ఇతరులముందు అమితంగా కుమిలిపోయి, ఆ భార్య మరణించిన రెండుమూడు నెలల్లోనే మరొకర్ని శ్రీమతిగా చేసుకొనేవారిదీ బాధే. అరవై ఏళ్లు పైబడి భార్యావియోగం కలిగిన పెద్దవారు కూడా మళ్లీ పెళ్లికి ఎగబడుతున్న సంఘటనలు అనేకం వున్నాయి. అంతమాత్రాన వాళ్లకి భార్య మరణం శోకం కలిగించలేదని ఎవరనగలరు?

పదవిలో, అధికారంలో వున్న వ్యక్తి మరణిస్తే ఆ కుటుంబానికే కాకుండా ఆ వ్యక్తి ఆశ్రితులకూ, ప్రయోజనం పొందుతున్నవారికీ కూడా బాధే. ఆ బాధ వారిని కృంగదీస్తుంది. పలుకుబడి వున్న పదవి వున్న మనకి తెలునున్న రాజకీయనాయకుడు మరణిస్తే మళ్లీ అలాంటి నాయకుడు దొరకాలి కదా. ఒకవేళ దొరికినా మనకి పనులు చెయ్యాలిగా అందుకే బాగా తెలునున్న పనికివచ్చే నాయకుడు మరణించాడంటే చాలామంది అవాక్కవుతారు.

రాయలు మరణం విషయంలో అదే జరిగింది. "రాయలు పదవిలో వుండగా కూతురి పెళ్లి కూడా చెయ్యలేకపోయాడు. పెద్దగా ఏంసంపాదించలేదట. పాపం! మంచి మనిషిలే... ప్రజల మనిషి. నవ్వుతూ, నవ్విoచేవాడు! ఎవరు వెళ్లినా చెయ్యను... కాదు... లేదు... అనేవాడుకాదు. ఆయన ఇంట్లో ఇరవై నాలుగ్గంటలూ జనమేనండీ! చాలా సహాయాలు చేశాడు పాపం? సంపాదించుకొన్నాడంటావా? ఏదో కొద్దిగా సంపాదించే వుంటాడు. కానీ మరీ కక్కుర్తి రకం కాదులే! పదవిలోకిరాగానే పదిళ్లు కట్టే బాపతూ కాదు. రాయలు ప్రజల్ని మాత్రం దోచుకోలేదు" రాయలు చనిపోయింతర్వాత ప్రజల సానుభూతిలోంచి వచ్చిన వ్యాఖ్యలివి.

రాయలు మృతదేహాన్ని విశాఖపట్నం తీసుకువచ్చారు. అభిషేక్ ఆ మృతదేహం పక్కనే దెబ్బతిన్న పక్షిలా వున్నాడు. రాయలు శవాన్ని విశాఖపట్నం పురవీధుల్లోంచి అధికారలాంఛనాలతో శ్మశానవాటికకు తీసుకువెళ్లారు.

జనం... విపరీతమైన జనం...

రాయల మరణానికి సానుభూతిగా వైజాగ్ బంద్ జరిగింది. ప్రతిపక్షనాయకుల దగ్గర్నుంచి, సాధారణ ఓటర్లదాకా సంతాపం ప్రకటించారు. అధికారపార్టీని నడిపించే ముఖ్యమంత్రి దగ్గర్నుంచీ, విశాఖపట్నం వార్డు కౌన్సిలర్స్ దాకా తమ పార్టీ ఓ గొప్ప త్యాగమూర్తిని కోల్పోయిందని బాధ వ్యక్తంచేశారు.

రాయల మృతదేహం బూడిద అయ్యేవరకూ అభిషేక్ అక్కడే వున్నాడు. "రాయల ఆప్తుడు... అంతరంగికుడూ అయిన అభిషేక్‌కు ఇది పెద్ద దెబ్బ" అన్నారు జనం. గొప్ప అండ పోయిందన్నారు. రాయలు మరణం అభిషేక్‌పట్ల సానుభూతిగా ప్రజల్లోంచి పైకివచ్చింది. ప్రతీవారూ బాధపడకు అని చెప్పేవారే. అభిషేక్ ముందు రాయలు గొప్పతనాన్ని అతనికీ రాయలుకీ వున్న బాంధవ్యాన్ని తలచేవారే. అభిషేక్ వ్యక్తిగతంగా బాధపడటమే కాకుండా వాళ్లతోపాటూ బాధపడాల్సివచ్చింది.

రాయలు కొడుకు ఆనంద్ ఎవరికీ పెద్దగా తెలీదు. అంతా తమకు తెలిసిన అభిషేక్‌నే పరామర్శిస్తున్నారు. ఓదార్చుతున్నారు. అభిషేక్ వారి అభిమానానికి కృతజ్ఞతలు ప్రకటిస్తున్నాడు. రాయలు భార్య మహాలక్ష్మికి రాజకీయ నాయకుల దగ్గర్నుంచి సాధారణ ప్రజలవరకూ అన్నిరంగాలవారినీ పరిచయం చేస్తూనే వున్నాడు. వారు ఆమె ముందు రాయల్ని అభిషేక్‌నీ, వారి సేవల్ని పొగుడుతూ రాయలు మరణానికి బాధపడుతూ కదలసాగారు.

రాయల మరణానంతరం ఆయన కుటుంబం వైజాగ్ తరలింది. అభిషేక్ ఆ కుటుంబానికి ఓదార్పూ, పెద్ద దిక్కూ అయ్యాడు. ప్రతిపనీ దగ్గరుండి చూసేవాడు.

రాయలతోపాటే ఆ కుటుంబంతో తన సంబంధం తెగిపోయిందనేలా అభిషేక్ ప్రవర్తించలేదు. జ్యోత్స్నకూ, మహాలక్ష్మిగారికీ ఎంతో ధైర్యం చెప్పాడు. రాయలు స్థానాన్ని ఆయన పేరునీ నిలబెట్టాలనీ, పెద్దరికాన్ని సంతరించుకుని ఆనంద్‌ని ప్రోత్సహించాడు.

★ ★ ★

ఆగని కాలచక్రంతోపాటూ మనుషులు కూడా మరుగునపడతారు. ఎంతటి గొప్పవారినైనా మరణం తర్వాత ప్రజలు పెద్దగా గుర్తుపెట్టుకోరు. వారంటే అభిమానం, సానుభూతి కనపర్చినా దైనందిన జీవితగమనంలో గొప్ప నాయకులు కూడా మరణం తర్వాత ప్రజల జ్ఞాపకాల మూలల్లోకి వెళ్లిపోతారు.

రాయలు మరణించినా అభిషేక్ కార్యక్రమాలు మామూలుగానే వున్నాయి. కొంతకాలం తాత్కాలికంగా అవి ఆగినా మళ్ళీ మామూలయ్యాయి. కార్మికులూ..., సమస్యలూ... ప్రజలూ... బాధలూ... రాజకీయాలు... పనులూ... కార్మికసంఘాల ఎన్నికలూ, కార్మికుల సమ్మెలూ, వివాదాలూ కొనసాగుతూనే వున్నాయి. అభిషేక్ వాటిల్లో చురుగ్గా పాల్గొంటూనే వున్నాడు.

★ ★ ★

"హీ ఈజ్ మిస్టర్ ఆనంద్" స్వరూప్ జగదీష్‌కి పరిచయం చేశాడు. అప్పటికే ఆనంద్ తాగివున్నాడు.

"గ్లాడ్ టూ మీట్ యూ" జగదీష్ పలకరింపు.

"యా! ఐ... నో... యూ... మీరు నాకు బాగా తెలుసు. జి.కె.ఎస్టేట్... యామై కరెక్ట్...?" ఆనంద్ మత్తులో గుర్తుచేసుకుంటూ అన్నాడు.

"యా" జగదీష్ చిద్విలాసం. ఆనంద్ తాగుతూనే వున్నాడు. జగదీష్‌కి ఆనంద్ తాగుడు నచ్చడంలేదు. కానీ ఆనంద్‌ని ఇప్పుడు చేరదీయాలి. తనవాణ్ణి చేసుకోవాలి. రాజకీయంగా ఆ పని తాను ఈ టైంలో చెయ్యకపోతే రేపు అభిషేక్‌గాడు ఎం.ఎల్.ఏ టికెట్ సంపాదించి మాయలు చేసి నెగ్గితే- నో... వాడు నెగ్గడు. వాడికి టికెట్ రాకుండా చేయాలి. ఆనంద్‌ని ఏమయినాసరే ఎంకరేజ్ చెయ్యాలి" జగదీష్ అనుకున్నాడు.

ఆనంద్‌ని రాజకీయాల్లోకి దిగమన్నాడు.

ఈ ప్రజలతో వేగలేనన్నాడు ఆనంద్. ఏదో బిజినెస్ పెట్టుకుంటానన్నాడు. జగదీష్‌ని ఎక్కడైనా లాభాలు వచ్చేచోట షేర్లు ఇప్పించమన్నాడు.

జగదీష్‌కి ఆనంద్ మాటలు నచ్చలేదు. షేర్లు తానే ఇస్తానన్నాడు. కానీ ఆనంద్‌ని రాజకీయాల్లోకి దిగమని బలవంతం చేశాడు.

అలా ప్రతిరోజూ రెండు మూడు గంటలు ఖాళీచేసుకుని నాలుగు రోజులు ఆనంద్‌తో గడిపాడు.

ఆనంద్‌కి జగదీష్‌లాంటి వ్యక్తి కావాలని తనతో గడపటం చాలా ఆనందంగా వుంది కానీ రాజకీయాల్లో పడి ఈ ప్రజల చుట్టూ తిరగటం తనకు ఎంతమాత్రం ఇష్టంలేదని చెప్పాడు జగదీష్‌తో.

జగదీష్, ఆనంద్, స్వరూప్‌ల మందు చర్చలు అలా ఓ వారం రోజులపాటు సాగాయి. కానీ ఏ విషయం తేలటం లేదు. ఆ చర్చలు అభిషేక్ మీదికి మళ్లటంతో వాటి స్వరూపమే మారిపోయింది.

అభిషేక్‌లాంటి అర్భకుడికి తన తండ్రి రాయలు ప్రాముఖ్యం ఇవ్వడం ఆనంద్‌కి చికాకు కల్గించింది. అదేవిషయం తండ్రి బతికుండగా నేరుగానే అన్నాడు. దానికి తండ్రి చిందులు వేశాడు. అభిషేక్‌ని గొప్పగా





చిత్రీకరించి చెప్పాడు. కొడుకు వ్యసనాలు తండ్రికి నచ్చకపోవటంతో ప్రతీసారి అభిషేక్‌ని పొగుడుతూ ఆనంద్‌ని తెగిడేవాడు. అలా పోలికతోనైనా ఆనంద్‌ని సాధించి బాగుచేద్దామని రాయలు బతికుండగా భావించాడు. కానీ కుదరలేదు. అభిషేక్ ఓ కంటగింపుగా చాలా కాలం కిందటే ఆనంద్ దృష్టిలో వున్నాడు. అదే విషయాన్ని ఆనంద్ జగదీష్‌తో మాట్లాడుతూ అభిషేక్‌ని అనవసరంగా తన తండ్రి పెంచాడని విమర్శించాడు. అభిషేక్ పెద్దరికాన్ని మీదేసుకుని తనకి సలహాలు ఇవ్వడం కంపరంగా వుందన్నాడు.

ఆనంద్ అలా తన మనసులోని మాటలన్నీ ఆ మందు ప్రభావంతో బయటకు కక్కేసాడు. సరిగ్గా అదే కావల్సిన జగదీష్ బేధోపాయం వుపయోగించి, ఆనంద్‌ని రెచ్చగొట్టాడు. అభిషేక్‌ని సాధించాలంటే ఆనంద్ రాజకీయాల్లోకి దిగకతప్పదని జగదీష్ సూచించాడు. లేకపోతే ఉపఎన్నికల్లో పార్టీ టికెట్ అభిషేక్ దక్కించుకొంటాడనే అనుమానాల్ని కలిగించాడు. అభిషేక్‌ని రాయలు కూడా దూరంగా వుంచిన విషయాన్ని విడమరచి చెప్పాడు. అభిషేక్ పైరవీలతో ప్రజలదగ్గర డబ్బు గుంజుతున్నాడని ఆనంద్‌కి నమ్మకం కలిగేలా తన మనుషులచేత చెప్పించాడు.

చివరికి అయిష్టంగానే ఆనంద్ రాజకీయాల్లో దిగటానికి నిశ్చయించుకొన్నాడు. అభిషేక్ రాజకీయంగా పెరగకూడదనేదే దానికి ముఖ్య కారణం.

ఆనంద్ నిర్ణయం జగదీష్‌కి ఆనందం కలిగించింది. అభిషేక్‌ని రాజకీయంగా దెబ్బ తీయాలంటే ఆనంద్ తన చెప్పుచేతల్లో వుండాలని జగదీష్ అనుకొన్నాడు.

★ ★ ★

అప్పటికే రాయలు మరణించి మూడు నెలలు దాటింది. ఉపఎన్నికలకోసం ఎన్నిక తేదీని కూడా ప్రభుత్వం ప్రకటించింది. అధికార పార్టీ తరపున పార్టీ టికెట్ రాయలు కుటుంబ సభ్యులకే యివ్వాలని అందరూ అభిప్రాయపడుతున్నారు.

ఆ నియోజకవర్గంనుంచి పోటీచేసే అభ్యర్థిని నిర్ణయించమని అధికార పార్టీ ముగ్గురు సభ్యులతో కూడిన ఒక పరిశీలన బృందాన్ని ఏర్పాటుచేసింది. ఆ బృందం హైదరాబాద్ నుండి వస్తున్నట్లు జగదీష్ ముందుగానే తెలుసుకున్నాడు. ఆ బృందంలోని సభ్యుల బలహీనతలు, అభిరుచులు పసిగట్టాడు. ఆ సభ్యులకు పరిచయమున్న రాజకీయపైరవీకారులను రంగంలోకి దింపాడు. ఆ బృందం వైజాగ్ వస్తూనే జగదీష్ అతిథులుగా మార్చిపోయారు. వారికి సకలమర్యాదలుచేసి ఆ బృందం ఎప్పటికీ మర్చిపోలేనివిధంగా పార్టీలిచ్చాడు. జగదీష్ గొప్పతనాన్ని ఆ బృందం సభ్యులు మనసులోనే మననం చేసుకొంటూ తమ పార్టీ అభ్యర్థిగా ఎవరు నిలబడితే నెగ్గగలరు అని వాళ్లు జగదీష్‌ని మర్యాదపూర్వకంగా సలహా అడిగారు.

మంత్రిగా పనిచేస్తూ చనిపోయిన రాయలు నియోజకవర్గ ప్రజల గుండెల్లో ఇప్పటికీ వున్నాడనీ, రాయలు మరణం ప్రజల్లో సానుభూతి పెంచిందనీ, అతని కుటుంబంపట్ల ప్రజలు చాలా అభిమానంతో వున్నారనీ, అధికార పార్టీ తరపున రాయలు కుటుంబానికి చెందిన ఎవరో ఒకరు పోటీచేస్తే గెలుపు తథ్యమని జగదీష్ ఆ సభ్యులకు నిక్కచ్చిగా చెప్పేశాడు. రాయలు కుటుంబంలో కొంచెం ప్రజలకు తెలునున్న వ్యక్తి ఆనందేనని, ఆనంద్ అధికార పార్టీకి, నాయకత్వానికీ వినమ్రుడై వుంటాడని, అలాంటి యువకుడికి పార్టీ టిక్కెట్టిస్తే ప్రజలు కూడా మెచ్చుకుంటారని జగదీష్ ఆ సభ్యులతో గట్టిగా చెప్పాడు.

ఆ పరిశీలక బృందం సభ్యులు అభిషేక్‌ను కూడా కలిసి అతని అభిప్రాయాన్ని అడిగారు. అధికారపార్టీ ఎవరిని అభ్యర్థిగా నిర్ణయించినా తాను ఆ అభ్యర్థి విజయానికి పాటుపడతానని అభిషేక్ వాళ్ళకి హామీ యిచ్చాడు. రాయల కుటుంబసభ్యుల మీద ప్రజలలో సానుభూతి వుందని అభిషేక్‌కి అంగీకరించాడు. అయితే ఆ కుటుంబసభ్యులలో ఎవరికి టికెట్ యివ్వాలి అనే విషయంపై అభిషేక్ ఎలాంటి అభిప్రాయాన్ని వ్యక్తంచేయలేదు.

ఆ విషయంలో నిర్ణయం పరిశీలక బృందానికే వదిలేశానన్నాడు. ఆ బృందం సభ్యులు అభిషేక్ సూటిగా ఏ అభిప్రాయాన్ని చెప్పకపో

వటంతో కొంచెం కంగారుపడ్డారు. అభిషేక్ వ్యవహారం ఆ బృందం సభ్యుల ఆలోచనలను, గందరగోళంలో పడేసింది.

రాయలుకి కుడిభుజమైన అభిషేక్ ఇదమిత్థంగా ఏ అభిప్రాయాన్నీ వ్యక్తం చేయకపోవటంతో ఆ బృందం సభ్యులు అనేకరకాలుగా రాజకీయపు అంచనాలలోకి వెళ్లిపోయారు. అభిషేక్ నియోజకవర్గంలోని కార్మికసంఘాలకి తిరుగులేని నాయకుడు, మంత్రితోపాటూ రాజకీయాలు నెరపిన వ్యక్తి. రాయలుతో ఇంచుమించు సమానంగా ప్రజలతో దగ్గర సంబంధాలు వున్న నాయకుడు. మంత్రి రాయలు మరణించిన తర్వాత ప్రజలు, కార్మికులు, సంఘాలు ఏ పనికోసమైనాసరే నేరుగా వెళ్లి ముందుగా కలిసేది అభిషేక్‌నే. అలాంటి వ్యక్తిని, అతని అభిప్రాయాన్ని రాజకీయంగా తక్కువ అంచనా వేయటం మంచిదికాదని ఆ సభ్యులు గుర్తించారు. కానీ అతని అభిప్రాయాన్ని తెలుసుకుని పార్టీ టికెట్ ఎవరికి యివ్వాలో నిర్ణయించుకోవాలనుకున్న ఆ సభ్యులకి అభిషేక్ స్థిరమైన అభిప్రాయం అందలేదు. అందుకే వాళ్లు కొంత కలవరపడినా రాయలు కుటుంబ సభ్యులలో ఎవరికి టికెట్ యివ్వాలని నిర్ణయించే అధికారాన్ని రాయలు భార్య మహాలక్ష్మిగారికి అప్పగించారు.




నియోజకవర్గంలో ఉపఎన్నికల సంరంభం ఆరంభమయింది. అధికార పార్టీ అభ్యర్థిగా అభిషేక్ పోటీ చేస్తున్నాడు. అధికారపార్టీ అభ్యర్థిగా అతన్ని ఎలా నిలబెట్టారు?- అనేది ఆ నియోజకవర్గంలోని అన్నిరంగాల ప్రజలకూ అర్థంకాని ప్రశ్న. అధికారపార్టీ నిర్ణయం జగదీష్‌కీ, ఆనంద్‌కీ ఓ దారుణంలా తోచింది.

రాయలు మరణిస్తే, అందునా పదవిలో వుండగాపోతే కూడా ఆయన కుటుంబసభ్యులకు టికెట్ యివ్వకుండా అభిషేక్‌కి ఎలా యిచ్చారు? ఆనంద్ రాజకీయాల్లో దిగటానికి సుముఖత చూపించిన తర్వాత కూడా ఇదెలా జరిగింది? ఆ ఎన్నికల్లో అభ్యర్థిని ఖరారు చెయ్యటానికి వచ్చిన కమిటీ అభిషేక్ అధికార పార్టీ అభ్యర్థి అని హైదరాబాద్‌కి విమానంలో వెళ్లేటప్పుడు ఎయిర్‌పోర్ట్‌లో తన నిర్ణయాన్ని ప్రకటించింది. ఆ మర్నాడు వార్తాపత్రికల్లో ఆ వార్త ప్రముఖంగా చోటుచేసుకొంది కూడా. మరి ఇదెలా... ఎలా...? ...ఎలా...? ...ఎలా జరిగింది?

జగదీష్ తలపగిలిపోతోంది. ఆనంద్ మందు ఎక్కువై అభిషేక్‌ని నానాతిట్లూ తిడుతున్నాడు. అతగాడిని తన ఇంటి ఛాయలకు రానివ్వకూడదని తీర్మానించాడు. ఆ నిర్ణయానికి ఆనంద్ ఇంట్లోవాళ్లు తలలు ఆడించారు. ఆనంద్‌కి ఇది రాజకీయాల్లో తొలి దెబ్బ. నవనాడుల్లోనూ మత్తు దించిన మొదటి దెబ్బ. ఆవేశాన్ని రెచ్చగొట్టే దెబ్బ. ప్రతీకారాన్ని పెంచిన దెబ్బ. అన్నీ తాను అనుకున్నట్లే జరుగుతాయని భావించిన ఆనంద్‌కి ఆ పరిణామం బాధాకరంగా, అవమానకరంగా, ఆందోళనకరంగా మారిపోయింది. దాన్ని తట్టుకోటానికీ, మత్తులో మునగటానికీ ఆనంద్ చేస్తున్న మందు ప్రయోగాలు విఫలమవుతున్నాయి.

"ఆనంద్... ఇది నీకేగాదు నాకూ అవమానమే! ఇటీజ్ ఏన్ ఇన్‌సల్ట్. మనం ఊరుకోకూడదు. దెబ్బకు దెబ్బ తియ్యకతప్పదు. ఎంత ఖర్చయినా నేను భరిస్తాను. నువ్ ఇండిపెండెంట్‌గా పోటీకి దిగు. నువ్ పోటీ చేస్తే అభిషేక్ పోటీ నుంచి తప్పుకోవాలి. రాయలుగారి మీద గౌరవం, అభిమానం, ఆ కుటుంబంపట్ల సానుభూతి ప్రకటించుకుంటూ పోటీ నుంచి నిష్క్రమిస్తాడు. నువ్ పోటీ చేయాలి, నామినేషన్ వెయ్యి" జగదీష్ ఆలోచనాపరంపరలోంచి ఆనంద్‌కి సలహా ఇచ్చాడు.

"వాడు పోటీనుంచి తప్పుకుంటాడని నమ్మకం ఏముందీ? వాడు తప్పుకోకపోతే మనం దెబ్బతింటాం. నేను రాజకీయాల్లో





పడకుండానే దెబ్బతిన్నాను. మళ్లీ ఓడి పోతే భరించటం కష్టం" ఆనంద్ చాలా నిరాశగా అన్నాడు.

జగదీష్ సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు. ఆనంద్ మాటలను అన్ని కోణాలనుంచి పరిశీ లిస్తున్నాడు.

"నువ్ పోటీచేస్తే ఓడిపోవటం జరగదు. రాయలుగారి కుటుంబంలోని వ్యక్తికి వ్యతిరే కంగా అభిషేక్ పోటీచేస్తే అభిషేక్ రంగు బయటపడుతుంది. రాజకీయాల్లో ఓనమాలు దిద్దించిన రాయలుగారిని మర్చిపోయిన విశ్వా సఘాతకుడనీ, రాయలు కుటుంబంపట్ల సాను భూతి చూపించటం మానేసి స్వార్థం చూసుకొ న్న దుర్మార్గుడనీ ప్రజలు అనుకొంటారు. అభి షేక్‌ని తిడతారు. ఆ సమయంలో మనం మన ప్రచారం చేసుకోవాలి"! జగదీష్ పదునైన బుర్రలోంచి చాకులాంటి ఆలోచన ఆనంద్ హృదయంలో సూటిగా దిగింది.

"కరెక్ట్...కానీ ఒక్క విషయం. రాజకీయాలు నాకంతగా తెలియవనుకోండి. ఇప్పుడు...పార్టీ టికెట్ అభిషేక్‌కి వచ్చింది. అతనికది ఎలా వచ్చింది? అతను రాయలు కుటుంబాన్ని దెబ్బతీశాడా? స్వార్థపరుడా? విశ్వాసఘాత కుడా?- అని ఎవరు ఆలోచిస్తారు? ఈ ప్రజలు ఏ విషయాన్నైనాసరే త్వరగా మర్చిపోగల రు...అలానే ఎప్పటికీ జ్ఞాపకం పెట్టుకోనూగల రు. ఏది మర్చిపోతారో ఏది గుర్తుంచుకుంటారో ఎవ్వరు చెప్పగలరు?"

ఆనంద్ సందేహం జగదీష్‌ని వ్యూహరచన వైపు నడిపించింది.

"నువ్వు చెప్పింది నిజం. ఈ ప్రజల్ని నమ్ముకొని మనం రంగంలోకి దిగకూడదు. ఎన్నికల్లో ఎవరికి ఓటు వెయ్యాలని ఎవరు ఆలోచిస్తారు? మనదేశంలో రైట్ థింకింగ్ లేదు. ఏదో చేస్తారు. ఏమి చేస్తారో వాళ్ళకే తెలీదు. పూర్‌ఫెలోస్. అభిషేక్ దుర్మార్గుడు అని ఓ పాంప్లెట్ తీద్దాం. పోస్టర్లు తయారుచే యించి ఇంటింటికీ అతికించాలి. అన్ని సెంట ర్లలోనూ పెద్దపెద్ద వాల్‌పోస్టర్లు అంటించాలి. ప్రజలందరూ అభిషేక్‌ని అసహ్యించుకునేలా చెయ్యాలి. దీనికి సమర్థుడు స్వరూప్. హైదరా బాద్ నుంచి వెంటనే రమ్మని ఫోన్ చేశాను. ఈరోజు మధ్యాహ్నం ఫ్లైట్‌లో రావచ్చు. నీకెందుకు ఆనంద్... నువ్వెళ్ళి నామినేషన్ ఫైల్ చెయ్యి. మిగతా సంగతులన్నీ నేను చూసుకుంటా. ఐ యామ్ హియర్ టూ లుక్ ఆఫ్టర్ ఎవ్విరిథింగ్. బెస్ట్ ఆఫ్ లక్"! యి లాంటి మాటలతో జగదీష్ ఆనంద్‌ని ఉత్తేజప రచి ఉద్రేకంగా ముందుకురికేటట్టు చేశాడు.

"థేంక్స్" అని చెబుతూ ఆనంద్ కదిలా డు. జగదేష్ ఇచ్చిన మందీ మార్బలంతో మూడు జీప్‌లు, ఓ కారు, ఓ వేను... వాటి నిండా జనం అరుపులు కేకలతో నామినేషన్ వెయ్యటానికి ఆనంద్ చాలా హడావిడి చేశాడు.

ఆ జనం నోటినిండా 'ఆనంద్ జిందా బాద్'లే. రాయలుకి రాజకీయవారసుడనీ, దు ర్మార్గుల పాలిట యముడనీ, స్వార్థపరులని ఖండించమనీ ఆ జీప్‌లూ, వేన్, కారూ పట్టించుకున్న జనం అరుస్తున్నారు. ఈ కేక లు, అరుపులు వినడం అలవాటైపోయిన సాధారణ జనం చిరునవ్వులు తమలో తామే చిందించుకొంటూ సాగిపోతున్నారు.

"రాయలు కొడుకు ఆనంద్ నామినేషన్ వెయ్యటానికి, అభిషేక్‌ని తిట్టటమెందు కు?" ఎవరో అన్నారు.

"రాజకీయాలు మరీ నికృష్టంగా తయార య్యాయండీ- ఎవడు ఎప్పుడు ఎక్కడ నాయ కుడిలా ప్రత్యక్షమవుతాడో తెలీటం లేదు. ఈ తనూజ తృష్ణ యిప్పటిది కాదులెండి. మనజా తిలో అనాదిగా వస్తూనే వుంది" ఓ కవిగారు ఉద్ఘోషించారు.

"తనూజ తృష్ణ ఏమిటి గురూగారూ?" పని లేని ఆయన అభిమాన శిష్యుడు అడిగాడు.

"నాయనా... పూర్వంనుంచీ అంటే త్రేతా యుగం, ద్వాపరయుగం అన్నమాట- ఆనాటి నుంచీ ఈ తృష్ణ కొనసాగుతోంది. రాముడే తన తదనంతరం రాజుకావాలని దశరథుడు నిర్ణ యించాడు. కైకేయి తన స్వంత కుమారుడే రాజు కావాలంది. దాంతో రామాయణం కావ్య మైంది. ఆపైన ఇతిహాసమైంది. మన దేశానికి నేటికీ ఎన్నటికీ మరువరాని మహత్తు సంప్రదా యక సిద్ధాంతమైంది. ఇహ ద్వాపరయుగం... ధృతరాష్ట్రుడు పుట్టు గుడ్డివాడు. ఆ అంధ





రాజు తన కుమారుడే రాజు...రారాజు అవ్వా లని మనసావాచాకర్మణా కోరుకొన్నాడు. అదే కురుపాండవ పరస్పర ద్వేషాగ్నికి కారణ మయింది. మహాభారతంలోని రాజకీయాలే ఇప్పటికీ మనదేశంలో వున్నాయి. మహాభా రతం గ్రంథం అనుకునేవ్...కాదు...అదో రాజకీ యాల పుట్ట. ప్రస్తుతం మన కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ కూడా అదే కీచులాట జరుగు తోంది. జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ, మరి ఆ తర్వాత...ఏమో...ఇక మనరాష్ట్ర రాజకీయాల సంగతి వేరే నేను చెప్పనక్కర్లేదు" కవిగారు ఆగారు.

"అయ్యో... ఆ తృష్ణ ఏమిటోగానీ అది చూపించటానికి ఇప్పుడు రాయలుగారు లేరు గా"! శిష్యుడు అడ్డంకొట్టాడు.

"రాయలు లేకపోతేనేం! మనరాజు వున్నా డు కదయ్యా. రాయలు పోయినా ఆయన ఆత్మ వాళ్లకి చెప్పి వుంటుందిలే. అదేకాకపో యినా ఇవాళ రాయలు పోయాడని వాడి కొడుక్కో, పెళ్లానికో పార్టీ టికెట్ ఇవ్వకపోతే రేపు ఆ ఇచ్చేవాడు ఛస్తే వాడి కుటుంబసభ్యు లకి పార్టీ టికెట్ రావద్దూ... అర్థమయిందా? అంతర్లీనంగా వుండే తృష్ణ అలాచేయి స్తుంది" కవిగారు శిష్యుడిని కంగారుపెట్టా రు.

"నన్ను యిలా చంపకండి సార్. అసలు జరిగింది వేరు. రాయలు చచ్చిపోయాడా? ఆఁ మీకు తెలుసుకదా... రాయలు పదవిలో వుండ గానే చచ్చినప్పుడు పార్టీ టికెట్ రాయలు పెళ్లానికో, కొడుక్కో యివ్వాలిగా... అలా యివ్వ లేదు. అందుకే ఈ న్యూసెన్సంతా రాయలు కొడుకు ఇండిపెండెంట్‌గా పోటీ చేస్తున్నా డు"! అసలు సంగతి అతికష్టం మీద శిష్యు డు బయటపెట్టాడు.

"అధికార పార్టీ అభ్యర్థి ఎవరూ?"

"అభిషేక్"

"అభిషేక్! అంటే రాయలు దగ్గర... ఆఁ... చూశావా నాయనా... తిన్న ఇంటివాసాలు లెక్కపెట్టటం రాజకీయాల్లో చాలా సాధారణ విషయం అన్నమాట" కవిగారు కంటిన్యూ చేస్తున్నారు.

ఆనంద్ సైన్యం గొడవ చేసుకుంటూ వెళు తోంది. అంతలో ఆ వర్గానికి అభిషేక్ జీప్ ఎదురైంది.

అభిషేక్ డౌన్... డౌన్

అభిషేక్... ద్రోహి

అభిషేక్... డౌన్ డౌన్

దుర్మార్గుడు అభిషేక్... ఛీఛీ... డౌన్ డౌన్- అరుపులు అభిషేక్ జీప్‌ని చుట్టుముట్టాయి.

అభిషేక్ నవ్వుతూ జీప్‌లోంచి దిగాడు. అవతలి నుంచి కారులోంచి ఆనంద్ దిగాడు.

"హలో ఆనంద్... హౌ ఆర్ యూ..." అభి షేక్ ముందుగా పలకరించాడు.

"వెరీ హేపీ! నువ్ చేసిన సిగ్గుమాలిన పనికి చాలా ఆనందపడుతున్నాను. నా మాట జాగ్రత్తగా విను. ఈ పోటీ నుంచి నువ్ తప్పుకో, లేకపోతే నిన్ను ఈ ఊళ్లో లేకుండా చేస్తాను. ఎం.ఎల్.ఏ అవుతానని కలలుకనకు. ఏదో మా నాన్నగారి దయాధర్మం వల్ల ఈ స్థితికి వచ్చావు. దాంతో తృప్తిపడు. అత్యాశలకుపోకు. ఇప్పటికే నీవల్ల మా కుటుంబానికి తీరని నష్టం జరిగింది. కావాలని మా కుటుంబానికి పార్టీ టికెట్ దక్కకుండా చేశావ్. పార్టీ టికెట్ సంపాదించగానే పండుగకాదు ముందుంది అసలు పండగ. దీసీజ్ మై ఫస్ట్ అండ్ ఫైనల్ వార్నింగ్"! అని ఆవేశంగా అంటూ ఆనంద్ అభిషేక్ మాట్లాడటానికి కూడా అవ కాశం ఇవ్వకుండా అరుపులు, కేకలతోపాటు వెళ్లిపోయాడు.

అభిషేక్‌కి ఆనంద్ ఓ కుర్రాడిలా కని పించాడు. రాజకీయాలు ఏమాత్రం ఒంటబ ట్టినా అలా నలుగురిలో ప్రత్యర్థి అనేవాడిని బహిరంగంగా ఎవ్వరూ బెదిరించరు. "నిన్ను ఈ ఊళ్లో లేకుండా చేస్తాను". "ఫైనల్ వార్నింగ్" అవి ఆనంద్ మాటల్లా అని పించటం లేదు. ఆనంద్‌తో మనసువిప్పి మాట్లాడాలని అంతవరకూ అభిషేక్ చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి.

పైగా ఆనంద్ తనకు వార్నింగ్ ఇవ్వడం అతని ఆలోచనలను వెనక్కు మళ్లించింది. అభిషేక్ ముందుకు సాగిపోయాడు. అధికార పార్టీ అభ్యర్థిగా నామినేషన్ వేశాడు.

ఈ సంఘటన జరగకముందే అభిషేక్‌లో



అనేక భావాలు చెలరేగాయి. "ఆనంద్ రాజకీయాల్లోకి రావటం నాకూ సమ్మతమే, అతనికి పార్టీ టికెట్ ఎందుకు దొరకలేదో, నాకు ఎలా యిచ్చారో అంతా పజిల్‌గా వుంది. ఈ పోటీ నుంచి నేను తప్పుకోవటం మంచిది. ఆనంద్‌కి మద్దతుగా నేను విరమిస్తే ప్రజలు కూడా హర్షిస్తారు. ఓసారి ఆనంద్‌తో మాట్లాడి ఈ విషయం చెప్పాలి" అని అనుకున్నాడు అభిషేక్. అప్పటికి అభిషేక్‌కి "జగదేష్ ఆనంద్‌ని చేరదీశాడనీ, ఆనంద్‌ని పాడుచేశాడనీ" చాలా మంది చెప్పారు. తను ఆనంద్‌ని జగదీష్ నుంచి వేరుచేసి తాను పోటీనుంచి విరమించుకొని ఆనంద్‌కి మద్దతు ప్రకటించాలనుకొన్నాడు. కానీ జరిగింది మరొకటి. అంతలోనే ఆనంద్ వచ్చి అభిషేక్‌ని బెదిరించి వెళ్లాడు.

"ఈ పరిస్థితుల్లో నేను విరమిస్తే పార్టీ ఆదేశాన్ని ధిక్కరించిన వాడినేకాక, ఆనంద్ వెనకుండి బెదిరిస్తున్నవాళ్లకి బెదిరినట్లే అవుతుంది. ఏ తప్పుచెయ్యకుండా నేనెందుకు నిందలువడాలి? ఆనంద్‌చే వార్నింగ్‌లు ఇప్పించినవాళ్ల పనిపట్టాలంటే, పోటీ చెయ్యక తప్పదు. ఇక ఎలాంటి పరిస్థితులనైనా ఎదుర్కోవాలి" అలా నిర్ణయించుకొన్నాడు అభిషేక్.

అభిషేక్ పోటీనుంచి తప్పుకోలేదని తెలిసి జగదీష్ మండిపడ్డాడు. ఆ మంటకి ఆజ్యంపోశాడు స్వరూప్. కరపత్రాల ముద్రణ కార్యక్రమం మొదలైంది. ఎన్నికల ప్రచారం ప్రారంభమైంది. చిన్న పోస్టర్లనుంచి పెద్దపెద్ద వాల్‌పోస్టర్లలో అభిషేక్‌ని దారుణంగా తిడుతూ, దుయ్యబడుతూ అచ్చయ్యాయి. ఆ తర్వాత గోడల మీదకు, ఇళ్ల తలపుల మీదకు వచ్చేశాయి. అంతవరకూ అభిషేక్ గురించి ఆలోచించనివాళ్లు కూడా అభిషేక్ వివరాలు అడిగి తెలుసుకొంటున్నారు. "అంత దారుణమా"? అని నిట్టూర్పులు విడుస్తూ ముక్కుల మీద వేళ్లు వేసేసుకుంటున్నారు.

"రాయలు ఉప్పుతిని అతని కుటుంబానికే ఎసరుపెట్టిన అభిషేక్, పార్టీ టికెట్‌కోసం మాయచేసిన అభిషేక్, రాయలు సహకారాన్ని మర్చిపోయిన దుష్టుడు అభిషేక్. ఛ...ఎంత అవినీతి! ఎంత అన్యాయం! ఎంత మోసం! ద్రోహి! ఇలాంటి వెధవలు వుండబట్టే రాజకీయాలు ఇలా తగలడుతున్నాయి. పాపం ఆనంద్ ఎంత బాధపడుతున్నాడో! ఛీఛీ... అభిషేక్‌ని ఓడించాలి. రాయలుకే అంత ద్రోహం చేసినవాడు రేపు మనకేం చేస్తాడూ? ఇలా అభిషేక్ మీద వ్యాఖ్యలు వస్తున్నాయి.

ఇంతలోనే పెనుతుపానులా ఓ పుకారు బయల్దేరింది. "రాయలు చనిపోవటానికి కారకుడు అభిషేకే" ఇదీ ఆ పుకారు. అది దావాగ్నిలా వ్యాపిస్తోంది. దాన్ని ప్రజలంతా నమ్ముతున్నారు. అభిషేక్ పేరెత్తితేనే ఆవేశంగా ఉరిమి చూసి ఛీత్కారాలతో దూషిస్తున్నారు.

ఆ నియోజకవర్గమంతా అభిషేక్ పట్ల ఏహ్యాభావాన్ని ప్రకటిస్తోంది. అభిషేక్ ఓడిపోయే అవకాశాలున్నాయని పత్రికలు రాశాయి. అభిషేక్‌ని వాడుకొన్నవాళ్లూ, ఆ వ్యక్తి చేత పనులు చేయించుకొన్నవాళ్లూ, యువకులూ, విద్యార్థులూ, మహిళలూ, కార్మికుల్లో కొంతశాతం — అభిషేక్‌కి వ్యతిరేకమయ్యారు. అధికారపార్టీకి చెందిన కొందరు పెద్దలు తమను విస్మరించి, రాయలు కుటుంబసభ్యులను కాదని, ఎవడో ఊరూపేరూ లేనివాడికి టికెట్ ఇచ్చినందుకు విమర్శిస్తూ తమపార్టీ అభ్యర్థి ఓడిపోవటానికి ఇతోధికంగా కృషిచేస్తున్నారు.

ఎన్నికల తేదీకి ఇంకా పదిరోజుల వ్యవధి వుంది. మొత్తానికి ఎవరు లేపారోగానీ ఆ పుకారుతో అభిషేక్‌కి చాలామంది వ్యతిరేకమయ్యారు. అయితే అభిషేక్‌కు ఆ సమయంలో ఈ విషయం ఆలోచిస్తే కుదరదు. "దావానంలా వ్యాపిస్తున్న ఆ పుకారును ఎలా తట్టుకోవాలి? రాయలు మరణానికి నేను కారణమా? నా మీద ఎందుకింత కక్ష వీళ్లకి? నేను పార్టీ టికెట్ అడగలేదే. వాళ్లే యిచ్చారు. ఆనంద్‌కి మద్దతుగా పోటీనుంచి విరమించాలనుకొంటే అదీ కుదరలేదు. ఇప్పుడేమో ఈ పుకారు లేపారు. నన్ను అన్నిరకాలుగా దెబ్బతియ్యటానికి పథకం ప్రకారం జరిగే కుట్ర యిది. దీన్ని నేను ఖండించినా లాభం లేదు. ప్రజలు నామాట ఈ పరిస్థితుల్లో వింటారనే నమ్మకంలేదు. ప్రజలు వినకపోయినా, నేను ఓడిపోయినా





ఫర్వాలేదు ఓసారి మహాలక్ష్మిగారిని కలవాలి. నిజానిజాలు తెల్సుకోవాలి" అభిషేక్ ఆవిడద గ్గరకి వెళ్లడానికి నిశ్చయించుకొన్నాడు.

అభిషేక్ వచ్చాడని వింటూనే మహాలక్ష్మి ఎదురువచ్చి ఆప్యాయంగా "రా-బాబూ" అంటూ లోపలికి ఆహ్వానించారు. మరోపక్క నుంచి జ్యోత్స్నవచ్చి "రండి...రండి" అంటూ స్వాగతం పలికింది.

ఆ ఆదరణ చూసి అభిషేక్ చలించినా తమాయించుకొని "మీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడటానికి వచ్చాను. నేను ఈ విధంగా రావటం తప్పో, ఒప్పో నాకు తెలీదు. రావాలని పించింది, వచ్చేశాను. మీకు తెలుసుకదా... అధికారపార్టీ నన్ను అభ్యర్థిగా నిలబెట్టింది. నాకు పార్టీ టికెట్ ఎలా వచ్చిందో ఈ రోజుకీ నాకు తెలీదు. ఇది ఎవరికైనా చెబితే నేను రాజకీయంగా మాట్లాడుతున్నాననీ, వీడికి తెలీకుండా టికెట్ ఎవరిస్తారని అంటారు ఈ జనాలు. కానీ మీరు నమ్మినా నమ్మకపోయినా ఈ క్షణంలో కూడా అది నాకు పజిలే. ఆనంద్ పోటీ చేస్తున్నాడని నాకు తెలిసింది. వెంటనే అతన్ని కలవటానికి ప్రయత్నంచేశాను. నాతో పనిలేదనీ, టైంలేదనీ, అనవసరమనీ అంటూ ఆనంద్ నా ప్రయత్నం విఫలం చేశాడు. నామినేషన్ వేసేరోజు కూడా నేను నామినేషన్ వెయ్యకుండా అతన్ని కలవాలనుకొన్నాను. దారిలో కలిశాను. నేను మాట్లాడే అవకాశం ఇవ్వకుండా నన్ను బెదిరించాడు. ఫైనల్ వార్నింగ్ అని హెచ్చరించాడు. అవి అతని మాటలు కావనీ, అతని వెనకాల ఎవరో వుండి నడిపించే మాటలనీ నాకు తెలుసు. అందుకే పోటీనుంచి తప్పుకుంటే పిరికివాడినవుతానని ఆలోచించి పోటీలోకి దిగాను. నా మీద ఎన్నో నిందలు వచ్చాయి. ఆరోపణలు ప్రచారం చేశారు. నేను దానికీ ఏంబాధపడలేదు. ఎందుకంటే రాజకీయాల్లో అవన్నీ మామూలే. కానీ కానీ... ఈరోజున నన్ను బాధించేది ఒక్కటే...రాయలుగారి మరణానికి నేను కారణమంటూ పుకారు లేపారు. కరపత్రాలు పంచారు. ఆయన చనిపోతే ఆ స్థానంలోకి రావాలని ముందే నేను పథకం వేశానట. చాలా పకడ్బందీగా పథకం అమలు జరిపానట. పార్టీ పెద్దలతోనూ, రాయలుగారి వ్యతిరేకులతోనూ చేతులు కలిపానట. ఆయన్ని నేనే చంపానట"! అభిషేక్ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. అది చూసి చలించిపోయారు మహాలక్ష్మి, జ్యోత్స్న.

మళ్ళీ మొదలుపెట్టాడు అభిషేక్.

ఈ నియోజకవర్గమంతా ఆ పుకారుని నిజమని నమ్ముతోంది. ప్రజలు అమాయకులు కాకపోయినా ఇలాంటి తప్పుడు మాటల్ని నమ్మే స్వభావం వున్నవాళ్ళు. అందుకే ఈ పుకారు కావాలని సృష్టించి సరిగ్గా సమయంచూసి ప్రజల్లోకి వదిలారు. దానికీ నాకు బాధలేదు. నేను ఓడిపోయినా దిగులుపడను. ఆనంద్ నెగ్గితే సంతోషపడేవాళ్ళల్లో మొదటివ్యక్తిని నేను.

కానీ మీరు చెప్పండి ఒక్కమాట చెప్పండి... రాయలుగారి మరణానికి నేను కారణమా? ఎవరు నమ్మినా నమ్మకపోయినా ఫర్వాలేదు. మీరు నమ్మకపోతే నాకదేచాలు. ఆ తృప్తితో వెళ్ళిపోతాను" దాదాపు ఏడుపు కంఠంతో చెప్పిన ఆ మాటలువిని మహాలక్ష్మి ముఖం ఎర్రగా మారిపోయింది.

"ఇప్పుడే వస్తా బాబూ"! అంటూ జ్యోత్స్నని తీసుకుని వెనకగదిలోకి వెళ్ళింది మహాలక్ష్మి. వెళ్ళిన పది నిముషాలకి మళ్ళీ వచ్చారు. మహాలక్ష్మి నవ్వుతూ అభిషేక్‌కి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

"చూడు బాబూ... నీకు పార్టీ టికెట్ ఇప్పించింది ఎవరో తెలుసా... నేనే! అవును... అప్పుడో కమిటీ వచ్చింది గుర్తుందా? వాళ్ళు పోటీ చెయ్యటానికి నన్నుగానీ, ఆనంద్‌నిగానీ ఎంపికచెయ్యాలని వచ్చారు. ఆనంద్‌కి పార్టీ టికెట్‌యిస్తే మీకు అభ్యంతరమా అన్నారు. ఆనంద్‌కి టికెట్ ఇవ్వద్దని నేను సూటిగా చెప్పాను... అలా అయితే నన్ను పోటీ చెయ్యమన్నారు, వద్దన్నాను. నీకు టికెట్‌యిస్తే ప్రజలకు మంచి జరుగుతుందని చెప్పాను. రాయలుగారి ఆత్మ శాంతిస్తుందని చెప్పాను.

"వాళ్ళు నా మాట వినలేదు. నన్ను పోటీచెయ్యమన్నారు. లేకపోతే ఆనంద్‌కి టికెట్ యిస్తామన్నారు. అప్పైన నామాట వినలేదు. ఆనంద్‌కి టికెట్ యిస్తున్నట్లుగా ప్రకటించి వెళ్ళిపోయారు. ఆ ప్రకటనచూసి నేను ముఖ్య



మంత్రిగారికి స్వయంగా ఫోనుచేశాను.

ఏ కళనున్నారో ఆయన నేను చెప్పింది పూర్తిగా విన్నారు.

నేను ఆయనకు ఒక్కటే చెప్పాను అభిషేక్ సమర్థుడు. అలాంటివాళ్ళకి టికెట్ యిస్తే ప్రజలకు న్యాయం జరుగుతుంది. కొంత మందికైనా సహాయం లభిస్తుంది. ఎలాంటి దుర్గుణాలులేని అభిషేక్ తప్పక నెగ్గుతాడు అన్నాన్నేను. ఆయన సరేనమ్మా అన్నారు. దాని పర్యవసానం నీకు పార్టీ టికెట్ లభించటం. ఆనంద్‌కి ఈ విషయం చెప్పాను. వాడు అయినా వినలేదు. ఎన్నికల పేరుచెప్పి ఇంటికి రావటమే మానేశాడు. మరి ఎవరు ఎందుకు ఇంత డబ్బు ఖర్చు పెడుతున్నారో అర్థంకాదు. ఒక్క విషయం చెప్పనా - రాయలుగారి మరణానికి ఎవరయ్యా కారకులు...?

"ఎవరైనావుంటే ఆ భగవంతుడు మాత్రమే! అది మా తలరాత. రాయలుగారు అవస్మారక స్థితిలోకి వెళ్ళకముందు కూడా నీ గురించే మాట్లాడారు... అలాంటిది ఈ పిచ్చిజనానికి నువ్ రాయలుని చంపావని అనటానికి సిగ్గులేదు. ఛీ ఛీ... వెధవలు, వెధవ రాజకీయాలు. ఎంత దారుణంగా పుకార్లు లేపుతారు. ఆనంద్‌కేమో ఈ వెధవబుద్ధి ఎవరో నూరిపోస్తున్నారు. ఎవరేమైనా అనుకోనీ బాబూ... రేపట్నుంచి నేనూ, జ్యోత్స్న ఇద్దరం నీ తరఫున ప్రచారానికి వస్తున్నాం. ఇంకా పదిరోజులు సమయంవుంది. నియోజకవర్గమంతా తిరుగుతాం. అసలు వాస్తవాల్ని వారిముందుంచుతాం, వాళ్లనే తేల్చుకోమంటాం. నిజానిజాలు తెలుసుకొంటే ప్రజలే వాళ్ళకి బుద్ధిచెబుతారు." అభిషేక్‌కి మహాలక్ష్మి కొత్తఊపిరి పోసింది. అభిషేక్ ఎంతగానో కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. దానికి ఆమె అది తన బాధ్యత అని చెప్పింది. అభిషేక్‌ని ఉత్సాహపరిచింది.

మర్నాడునుంచి మహాలక్ష్మి ఒకవైపు, జ్యోత్స్న మరోవైపు సుడిగాలుల్లా నియోజకవర్గమంతా చుట్టుముట్టసాగారు. బహిరంగసభల్లో మహాలక్ష్మి ప్రజల అనుమానాలకు సరైన సమాధానాలు ఇస్తోంది.

అప్పటికే అభిషేక్ పేరు ఆరోపణల పర్వంలో మారుమోగింది. ఇప్పుడు రాయలుగారి ధర్మపత్నే ప్రత్యక్షంగా అభిషేక్ మీది ఆరోపణలనూ, పుకార్లనూ బహిరంగంగా ఖండిస్తోంది.

ఆనంద్ తల్లినీ, చెల్లినీ బెదిరించాడు. వాళ్ళు లెక్కచెయ్యలేదు. ఆ బెదిరింపు సంగతి కూడా వేదికలమీదకు వచ్చింది.

అభిషేక్ తల్లీకూతుళ్లను మోసంచేసి అలా చెప్పించుకున్నాడంటూ ప్రత్యర్థివర్గం ప్రచారం చెయ్యటం మొదలుపెట్టింది.

ప్రజలు ఇరువర్గాలనూ పట్టించుకొంటున్నారు. వారు చెప్పింది వింటున్నారు. చర్చించుకొంటున్నారు. తర్కించుకొంటున్నారు.

ప్రచారాల హోరు పెరిగింది. ఆ సమయంలో ఎవరు నెగ్గుతారని ప్రశ్నిస్తే ఎవరూ సమాధానం చెప్పలేకపోతున్నారు.

పోటీ హోరాహోరీగా మారింది.

ఆ నియోజకవర్గ ప్రజల ఆలోచనాసరళిలో అనేక మార్పులు వస్తున్నాయి. వాదోపవాదాలు చెలరేగుతున్నాయి. ఈ జోరు సాగుతుండగానే పోలింగ్ తేది హడావిడిపడుతూ వచ్చింది.

జగదీష్ డబ్బుని ప్రవహింపచేశాడు. వాడలకు వాడలనే కొనెయ్యాలనేటట్లుగా ఖర్చుపెట్టాడు. ఆ డబ్బు తీసుకునే జనం తీసుకున్నారు.

ఎన్నికలముందుగా మద్యం అమ్మకం నలభై ఎనిమిది గంటలముందుగా అధికారికంగా నిలిపేసారు. కానీ ఆ మద్యం, అనధికారికంగానే తాగే జనం ముందు పారింది. డబ్బు తీసుకొనేవారూ, సారా, ఇతర మద్యాలు తాగేవారు తమ పని కానిచ్చేశారు.

పోలింగ్ తేదీ రోజున అత్యధిక సంఖ్యలో వోటర్లు వోట్లు వేశారు. డెబ్బై అయిదునుంచి డెబ్బై ఎనిమిది శాతం వోట్లు పోలయ్యాయన్నారు.

ఆ మర్నాడు వోట్ల లెక్కింపు. అన్ని వాడలా ఆసక్తి. అందరిలో ఆతృత. ఓటర్లు వోట్లు ఎలా వేస్తారో ఊహించడం కష్టం. అయిన ఈ రోజుల్లో ఆ ఉపఎన్నిక మరింత గందరగోళాన్ని సృష్టించింది. అందుకే జనం విపరీతమైన ఆసక్తిని కనపరుస్తున్నారు.




ఉదయం ఎనిమిదిగంటలకే ఓట్ల లెక్కింపు మొదలెట్టారు. పన్నెండు గంటల ప్రాంతంలో వెలువడిన ఎన్నికల ఓట్ల లెక్కింపు వార్త ఆ నియోజకవర్గంలోని సంచలనాన్ని రేపింది. పన్నెండు గంటలప్రాంతంలో అప్పటివరకూ జరిగిన లెక్కింపు ప్రకారం ఆనంద్, అభిషేక్ కన్నా లక్షా ఇరవైవేల ఓట్లు వెనకబడి వున్నాడు. ఆనంద్‌కి డిపాజిట్ రావటానికి యింకా మూడువేల పైచిలుకు రావాలన్నారు. అప్పటివరకూ స్థబ్దుగా మౌనంగ వున్న ప్రజలు అభిషేక్‌కి జైజైధ్వానాలు పలుకుతూ రోడ్లమీదకు వచ్చేశారు. అభిషేక్‌కి వ్యతిరేకంగా కట్టిన బేనర్లు, పోస్టర్లను చింపుతున్నారు. రోడ్లు కోలాహలంతో నిండిపోయింది. ప్రజలు అభిషేక్‌కి ఊపిరి సలపనివ్వటం లేదు. దండలు, నమస్కారాలు, అభినందనలు, శుభాకాంక్షలు. అభిషేక్ ఇల్లు ఉత్సవం జరిగే స్థలంలా మారిపోయింది.

సాయంత్రం ఆరింటికి అధికారికంగా అభిషేక్ ఎన్నికయినట్లు ప్రకటించారు. ప్రత్యర్థులకు ఎవరికీ డిపాజిట్ దక్కలేదు. సుమారు లక్షా ఎనభై వేలకు పైబడి మెజారిటీయే వచ్చింది. ఈ మెజారిటీ రాష్ట్రంలో రికార్డు అన్నారు. ప్రత్యర్థులందరికీ డిపాజిట్లు పోవటం కూడా ఘనతే అన్నారు. అభిషేక్‌ని ఆకాశానికి ఎత్తేస్తూ మాట్లాడుతున్నారు.

అంత ఉత్సాహ సమయంలో కూడా అభిషేక్ మామూలు చిరునవ్వుతోనే వున్నాడు. పది రోజుల కిందట ఇదే ప్రజలు తనను నానారకాలుగా విమర్శించి, దూషణ, తిరస్కార, ఛీత్కారాలు ప్రదర్శిస్తూ అసహ్యించుకొన్నా అదే చెదరని చిరునవ్వు. ఇప్పుడూ అదే, ప్రజలమాటలూ.. హడావిడీ చూసి మనసులోనే అభిషేక్ చిన్నగా నవ్వుకొన్నాడు.

ఎన్ని నమస్కారాలో ఎన్నెన్ని ప్రతి నమస్కారాలో ఆ ఎన్నికల ఫలితం అభిషేక్‌ని మరింతగా పెంచింది. పార్టీ పెద్దలు, ముఖ్యమంత్రి, జిల్లాలోని పెద్దనాయకులు అభినందనల సందేశాలు పంపారు. వాడవాడల్లోని ప్రజలూ విజయోత్సవాల్లో అభిషేక్ పాల్గోవాలని కోరుతున్నారు. ఎవరి కోరికనూ తిరస్కరించలేని సమయమిది.

విజయోత్సవ సభలు జరుగుతూనే వున్నాయి. కార్మిక సంఘాలనీ సంయుక్తంగా జి.కె.ఎస్టేట్ పక్కనున్న పెద్ద మైదానంలో అభిషేక్‌కి ఘనసన్మానం ఏర్పాటుచేశారు.

జగదీష్ సెగలమధ్యన కూర్చున్నాడు. ఆ విజయధ్వనులు, ఆ జై జై నాదాలు, భయంకరంగా భరించలేనివిగా మారిపోయాయి. "తన ఎస్టేట్ పక్కనే ఘనసన్మానమా? వీడు ఎంత ఎత్తుకి ఎదిగిపోయాడు?'.

అభిషేక్ విశ్వరూపం జగదీష్ కళ్ళముందు అతిపెద్దదిగా కనిపిస్తోంది. ఆ రూపాన్ని చూసి జగదీష్ ఉగ్రుడవుతున్నాడు. ఆ ఓటమిని ఆనంద్ మత్తులో మునిగి తట్టుకొన్నా జగదీష్ గుండెల్లో నిలువెత్తులేచిన మంటలు చల్లార్చటానికి ఏమత్తుమందూ పనికిరావటంలేదు. ఆ మంటలు చల్లారాలి. ఎలా...? జగదీష్ కళ్లు అగ్నిగోళాలయ్యాయి. మెదడులోని అశాంతి మనిషిని నిలువెల్లా దహించేస్తోంది.

జగదీష్ మానవత్వాన్ని ఒక్కక్షణం మర్చిపోయాడు. ఆ ఆవేశంలో, ఆ గుండె మంటతో, ఆ భయంకర ఓటమితో సెగల ఆలోచన చేశాడు.

ఆ ఆలోచన కార్యరూపం దాల్చటానికి ఏర్పాట్లు నిముషాల మీద జరిగిపోయాయి.

★ ★ ★

ఏనాడూ అలుపురాని సూర్యుడు తన కిరణాలతో పుడమిని ప్రభావితం చేస్తున్నాడు. సూర్యుడు అది అనాదిగా చేస్తున్నా పుడమి ప్రభావితమవుతున్నదా అనే సంగతి మనకి తెలియకున్నా మానవజన్మలోని అరిషడ్వర్గాలు మటుకు దివ్యంగా వెలుగుతున్నాయి. "సూర్యుడు విధికాబట్టి తన బాధ్యతను నిర్వర్తిస్తున్నాడు. గాలిది వీచే స్వభావం కాబట్టి వీస్తోంది. ఈ ప్రకృతి ఎవరికోసం... నా కోసం. ఈ నీరు... ఈ చెట్లు... ఈ పువ్వులు... అవసరమయితే మొగ్గలూ అన్నీ నావే. వాటి బాధ్యతగా అవన్నీ నాకు అందుతున్నాయి. వాటిని అనుభవించే హక్కు నాకుంది. సూర్యుడు ఉదయించక ఏం చేస్తాడు... నిద్రపోతాడా? అరుణకాంతులు ప్రసరిస్తాడు. ఉదయాన్నే నన్ను విసిగించకుండా, చిరాకు పెట్టకుండా మెత్తని కిరణాలను అందిస్తాడు, అందించాలి. లేకపోతే చిరాకు కలిగి

నాకు నిద్రాభంగం కాదూ. మిట్టమధ్యాహ్నంలా సూర్యుడు ఉదయాన్నే వుంటే లాభంలేదని అతనికీ తెలుసు. అందుకే ఎన్నో తిట్ల ప్రవాహ నాలను కురిపించే ఈ జనం నోళ్ళధాటికి దడిసి అలా మెల్లగా వస్తాడు. తెల్లవారుజా మున ఎంత మంచి నిద్రలోనో వుండే మందు బాబులను, మిగిలిన అన్నిరకాల జనసమూహా లను ఎంత చక్కగా లేపుతాడు. సూర్యుణ్ణి పొగడటం ఏమిటి? ఎంత సూర్యుడయినా తనపని తాను చెయ్యవల్సిందేగా?'' పుడమి తల్లి అనుకుంది.

అప్పటికి సూర్యుడు తన పని మొదలుపెట్టి మూడుగంటలు దాటింది. సరిగ్గా ఉదయం ఎనిమిదిన్నర అవుతోంది. రోడ్లమీద చిన్నగా రద్దీ మొదలయింది. ఆ చిరురద్దీలోంచి ప్రశాంతవదనంతో కారు డ్రైవ్ చేసుకుంటూ జగదీష్ వస్తున్నాడు. జగదీష్ మొహం చాలా



తేటగా వుంది. నిర్మలంగా కనిపిస్తోంది. అతని పక్కనే మీరా కూర్చుని వుంది. తనని 'లానన్స్ బే'కి తీసుకెళ్ళటానికి ఉదయమే రెడీ అయిన జగదీష్‌ని చూసి మీరా ఆశ్చర్యపోయింది. ఉదయమే జగదీష్ ఎక్కడికీ కదలడు. అలాంటిది తనకోసం స్వయంగా అన్నగారు వస్తున్నాడని తెలిసి ఆనందపడింది. అంతకు



రెట్టింపు ఆశ్చర్యపడుతోంది. ఆ ఆశ్చర్యాన్ని జగదీష్ ముందుపెట్టి సమాధానపడాలను కుంది. ఆ ప్రయత్నంలో వుండగా జ్యోత్స్న రోడ్డు మీద రిక్షాలో కనబడింది మీరాకి.

''జగదీష్... కారాపు''– మీరా దాదాపు అరిచింది.

''ఎందుకూ?'' అని అడుగుతూనే కారాపేశాడు జగదీష్.

''జ్యోత్స్న''

''ఎక్కడ?''

''అదుగో...'' అంటూ రిక్షాలో వస్తున్న జ్యోత్స్నని చూపించింది మీరా.

ఇద్దరూ కారు దిగారు.

జ్యోత్స్న రిక్షాలో వస్తోంది. కార్లలో, ఫ్లైట్లలో తిరగాల్సిన మాజీ మంత్రిగారి అమ్మాయి రిక్షాలో వస్తోంది. నాతో వుంటే జ్యోత్స్న ఎలా వుండేది? ఇప్పుడైనా ఆమె నన్ను కోరుకుంటే స్వీకరించటానికి అభ్యంతరమేమీలేదు. ఈ రోజు ఉదయం నుంచీ అన్నీ శుభసూచనలే ! జగదీష్ మనసులోని భావాలు కళ్ళల్లో చూపిస్తూ రిక్షా తమను సమీపించేసరికి 'హలో'! అని జ్యోత్స్నని పలకరించాడు.

ఆ కళ్ళల్లోని భావాలు అర్థం అయినా అవి పట్టనట్లుగానే జ్యోత్స్న బదులు పలికింది. మీరా జ్యోత్స్నతో మాట్లాడుతోంది. ''రోడ్డు మీద ఎందుకు... అలా వెళ్ళి కాఫీ తాగొద్దాం రండి'' అని ఆహ్వానించాడు జగదీష్. కాదనలేకపోయింది జ్యోత్స్న. రిక్షావాడిని పంపించేసి కారు ఎక్కింది. కారు సాగిపోయింది. అలా వెళ్లి ఓ అతి ఖరీదైన కాఫీబార్‌లో ముగ్గురూ కూర్చున్నారు. జగదీష్ ఆర్డరిచ్చాడు. అదయిన తర్వాత జ్యోత్స్నకేసి చూసి అన్నాడు జగదీష్ ''మంత్రిగారి డాటర్... మీరు... ఇలా... రిక్షాలో...'' ఆగాడు జగదీష్. ఏదో మాట్లాడాలని మాట్లాడుతున్నాడని గ్రహించింది జ్యోత్స్న. ''కారు రిపేర్‌కి వెళ్ళింది. దగ్గరేకదాని రిక్షా ఎక్కాను. మంత్రిగారి కూతురన్నారే, నేను మంత్రి కూతురుగా ఉన్నరోజుల్లోనూ రిక్షాలు ఎక్కాను. అయినా నేను ఓ సామాన్యురాలిని ఏం మీరా?'' మీరాకేసి చూస్తూ అంది జ్యోత్స్న.

''మా జ్యోత్స్న ఎప్పుడూ సింపుల్‌గానే వుంటుంది.'' అని మాట పూర్తిచేస్తుండగానే ఆ హోటిల్లో ఏదో హడావిడి మొదలైంది. హోటల్ మూసేస్తున్నారు. జనాలు, బేరర్లూ అటూయిటూ తిరుగుతున్నారు. గేట్లు బంద్ అవుతున్న శబ్దాలు. ఆ హోటల్ పని ఎక్కడికక్కడ ఆగిపోయింది.

''ఏం జరిగింది?'' మీరా, జ్యోత్స్నా ఒకేసారి అడిగారు.

''వైజాగ్ బంద్''- ఎవరో అరిచారు.

''ఎందుకూ?''- జ్యోత్స్న మళ్ళీ అడిగింది.

''అభిషేక్‌ని తెల్లారగట్ట ఎవరో దారుణంగా కొట్టించారట. ఆయన చావుబతుకుల్లో వుండగా కె.జి.హెచ్ ఆస్పత్రిలో చేర్పించారట. చాలా ప్రమాదకరంగా వుందట. అందుకే ఈ బంద్. నిన్నకాక మొన్ననే గెలిచిన ఎం.ఎల్.ఏ. పాపం. అయినా ఈ దేశంలో ప్రధానమంత్రికే రక్షణలేదు. ఇక ఎం.ఎల్.ఏ.ల సంగతేం చెబుతాం'' ఆ వ్యక్తి మాట్లాడుతుండగానే- ''అభిషేక్‌ని కొట్టారా? మైగాడ్ చావుబతుకుల్లో వున్నారా?'' అంటున్న జ్యోత్స్నకి కొంచెంసేపు తలతిరిగినట్లయింది. వెంటనే లేచి పక్కనున్న మీరా, జగదీష్‌లను కూడా మరిచిపోయి బయటకు పరిగెత్తింది.

అభిషేక్ చావు బతుకుల్లో వున్నాడు. బతుకుతాడనే ఆశను డాక్టర్లు వ్యక్తం చేస్తున్నా కె.జి.హెచ్ ఆస్పత్రికి అన్నివైపులా అరమైలు దూరం వరకూ చేరిన ప్రజలు 'అనుమానాలు' వెలిబుచ్చుతున్నారు. ఆ తెల్లారుజామున రెండుగంటలకు అభిషేక్ జి.కె.ఎస్టేట్ దగ్గర్లోని విజయోత్సవ సభలో పాల్గొని తిరిగి ఇంటికి వస్తుండగా అకస్మాత్తుగా మూడుగుంపులు దాడిచేశాయి. అభిషేక్ జీప్‌లో ఆరుగురే వున్నారు. ఆ గుంపుల్లో పాతికమంది దాకా వున్నారు. అభిషేక్‌ని వాళ్ళు చావబాదారు. మూడు కత్తిపోట్లు దిగాయి. ఈ అరుపులకూ, కేకలకూ చుట్టుపక్కల జనం రాకపోతే అభిషేక్ అక్కడికక్కడే చనిపోయేవాడు.

సన్నగా మామూలుగా వుండే అభిషేక్ ఏనాడూ ముష్టియుద్ధాలు చెయ్యలేదు. అందుకే మేధస్సుతో ఏ సమస్యనైనా సులభతరంగానో, కష్టంగానో పరిష్కరించే అభిషేక్ ఈ దాడికి బలైపోయాడు. వాళ్ళెవరో... ఎందుకు తనమీద




దాడి చేస్తున్నారో తెలుసుకొనే అవకాశమివ్వలేదు ఆ గూండాలు. డబ్బే ప్రధానంగా తీసుకుని బతికే ఆ కిరాయి గూండాలు అభిషేక్ గురించి ఎందుకు ఆలోచిస్తారు? మతంపేరు మీదో, కులంపేరు మీదో, భాషాబేధం ప్రాతిపదికగానో సామాన్యజనం కూడా రెచ్చిపోయే ఈరోజుల్లో డబ్బు ఎరచూపితే గూండాయిజానికి తిరుగేమిటి? మానవత్వం... న్యాయం... ధర్మం... ఇవన్నీ ఆ యిజానికి వందలమైళ్ళ దూరంలో వుంటాయనేది ఎవరికి తెలియదు? అవతలి వ్యక్తి ఎవరైనా అనవసరం, డబ్బిస్తే ప్రాణం తియ్యటం మా వృత్తి. అంటూ సంఘంలో బాహాటంగా విజృంభిస్తున్న ఈ దుష్టశక్తుల అణచివేత సాధ్యమా? అర్థబలంలేని ఈ అంగబలం డబ్బున్నవాడి చేతుల్లో తిరుగులేని అహంకార బలంగా మారింది. నీతిగా బతకటానికి దారులులేని ఈ సమాజంలో అర్థబలంలేని అనేకమంది రౌడీయిజాన్ని వృత్తిగా స్వీకరిస్తున్నారు. విడివిడిగా చూస్తే ప్రతీవాడూ ఏదో సమస్యతో పోరాడుతూనే వుంటాడు. ఆవేదనతో నలిగిపోతూంటాడు. ఆ మనసును విడిగా తట్టిలేపితే ఎన్నో బాధాప్రవాహనాలు ప్రవహిస్తాయి. మరెన్నో కష్టనిష్ఠూరాలు కన్నీళ్లు ఉబికివస్తాయి. విడిగా ఎవడైనా మానవత్వం మూర్తీభవించిన దయాసముద్రుడే కానీ నలుగురితో కలిశాడా, ఆ గుంపు సమస్యలు ఆందోళనగా మారతాయి. అశాంతిని రేకెత్తిస్తాయి. తీవ్రవాదాన్నీ హింసనీ పెంచుతాయి. ఆ గుంపు హింసావాదాన్ని నమ్ముకుంటూ బతుకుతుంది. ఆ బతుకు అలవాటై ఆనందంగా కనిపిస్తుంది. హింసాకాండ సాగించడానికి మనసును జోకొట్టాలి. అందుకే మెదడులో ఎలాంటి శాంతి వచనాలు లేకుండా దాన్ని మందుతో తడిపేస్తారు. మొద్దుబారిన మెదడు హింసను ప్రతిఘటించదు. ఈ హింసావాదులు కిరాయికీ, తాగుడుకీ బానిసలై అరాచకాన్ని ప్రబలింపచేస్తారు. ఆ అరాచకానికి గురైన అభిషేక్ శరీరంలోకి సీసాలతో రక్తం ఎక్కుతోంది. అభిమానుల, వోట్లేసిన ప్రజల, ఆశగా అభిషేక్‌ని గెలిపించిన యువకుల కళ్లల్లోని నీరు సముద్రజలంలా కనుకొలకులను దాటి కెరటాల్లా బుగ్గలనే ఇసుకతిన్నెలపై ప్రవహిస్తోంది. అభిషేక్‌ని చూడాలని ప్రజ ప్రవాహంలా కదిలింది. ఎక్కడలేని పోలీసులూ అక్కడే వున్నారు. పోలీసు ఉన్నతాధికారుల దగ్గర్నుంచి కానిస్టేబుల్ వరకూ కంగారు ప్రదర్శిస్తున్నారు.

జ్యోత్స్న అతికష్టంమీద అభిషేక్‌ని వుంచిన ప్రత్యేకవార్డు గుమ్మం వరకూ రాగలిగింది. అక్కడ డాక్టర్లు కంగారుపడుతున్నారు. ఆస్పత్రికి చెందిన ప్రత్యేక నిపుణులంతా అక్కడే వున్నారు. అభిషేక్‌కి ఇవేమీ తెలియడంలేదు. ఊహాతీతమైన మైకం. వర్ణించలేని అపస్మారకస్థితిలో అభిషేక్ వున్నాడు. భావాలకు అందని మానసిక ఆందోళనా ప్రకంపనల మధ్య జ్యోత్స్న వుంది.

ఆస్పత్రి లోపల డాక్టర్ల హడావుడి.

బయట పోలీసుల ప్రతాపం.

పోలీసుల బెదిరింపులను కూడా ఖాతరు చెయ్యక అక్కడే గుమిగూడింది ప్రజానీకం.

కార్మికనాయక బృందాలు బంద్ కార్యక్రమంలో నిమగ్నమయ్యాయి.

పరిస్థితి వేడెక్కుతోంది అందరిలోనూ.

సరిగ్గా పదవుతూండగా ముఖ్యమంత్రి అభిషేక్‌ని చూడటానికి వస్తున్నారనే కబురు వచ్చింది.

"అభిషేక్‌కి సరైన సెక్యూరిటీ ఏర్పాట్లు ముందుగానే ఎందుకు చెయ్యలేదు" అని ముఖ్యమంత్రిగారు వస్తూనే అడిగే ప్రశ్నకు సమాధానం చెప్పటం కోసం పోలీస్ సూపరింటెండెంట్ తయారవుతున్నాడు.

"అభిషేక్ మీద, అతని అనుచరుల మీద దాడిచేసిన వాళ్లని పట్టుకొన్నారా?" అని ముఖ్యమంత్రిగారు అడిగే రెండో ప్రశ్నకు దాడి జరిగిన ప్రాంతం సర్కిల్, సబ్‌ఇన్‌స్పెక్టర్లూ, కానిస్టేబుళ్లూ, డి.ఎస్.పి సమాధానం అందించటానికి కృషిచేస్తున్నారు.

అసలిది ప్రతిపక్షాల కుట్రా? అలా అవటానికి వీల్లేదు. అధికారపార్టీకున్న గూండాల బలం ప్రతిపక్షాలకి ఎక్కడిది?

లేక

ఓడిపోయిన ఆనంద్...

వాడే డిపాజిట్ పోయి ఏడుస్తూ ఎక్కడో



మందుకొట్టి పడిపోయి వుంటాడు. వాడికి ఊళ్లో ఏ బేసూ లేదు.

"బహుశా అధికారపార్టీ నాయకులే కావచ్చు...అభిషేక్ ఓడిపోవటానికి బాగా కష్టపడ్డారు. కానీ ఈయన రాజకీయాల్లోనే రికార్డు సృష్టించాడు. ఈయన ఇలాగే పెరిగితే మిగతా వాళ్లకి ఎడ్రస్‌లు వుండవు. అందుకే ఈయన్ని చంపటానికి ప్లానేసుంటారు" ఓ హెడ్‌కానిస్టేబుల్ నిదానంగా అన్నాడు.

"నువ్ నోర్మూయవయ్యా ఏదో వాగుతావ్... అసలే టెన్షన్‌తో నేనుంటే" ఎస్.ఐ విసుక్కున్నాడు.

"నా నోరెంతండీ మూసుకుంటాను. కానీ నేను చెప్పిన పాయింట్ ముయ్యటం కష్టమండీ" ఆ హెడ్ కానిస్టేబుల్ చుట్టూ ఉన్న కానిస్టేబుళ్లను చూస్తూ ఎస్.ఐతో అన్నాడు.

ఎస్.ఐ మౌనంవహించాడు.

హెడ్ ఇకిలించాడు.

అక్కడ విమానాశ్రయంలో స్పెషల్ రన్‌వే మీద ఆగిన హెలికాప్టర్‌లోంచి ముఖ్యమంత్రిగారు దిగారు. ఆయనకు స్వాగతం చెప్పటానికి పురప్రముఖులంతా హాజరయ్యారు.

ఆయన హెలికాప్టర్ దిగుతూనే ఎస్.పిని పిలిచి పరిస్థితి అడిగారు. జిల్లా కలెక్టర్‌తో మాట్లాడారు. పెద్దలు ముఖ్యమంత్రిని కలిశారు. ఆ వెంటనే పోలీస్ వాన్లు, జీప్‌లు, పైలట్, ముఖ్యమంత్రి కారు, సెక్యూరిటీ వ్యాన్, హోంమంత్రి కారు, ఇంటెలిజెన్స్, ఎస్.బిల చీఫ్‌ల కార్లు, వాటిముందు డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ కారు, ఆతర్వాత పురప్రముఖుల కార్లు, వాటిననుసరిస్తూ మరో పది కార్లు రోడ్డు మీద సాగిపోయాయి. ఆస్పత్రికి ఆ హెలికాప్టర్ ఆగిన స్థలంనుంచి పదకొండు కిలోమీటర్లు. ఆస్పత్రి సూపరింటెండెంట్ ముఖ్యమంత్రికి స్వాగతం పలికారు. ఆయనతోపాటు వార్డ్‌కేసి నడుస్తూ అభిషేక్ సంగతడిగారు. అభిషేక్ కోలుకునే అవకాశం ఉందని సూపరింటెండెంట్ వినమ్రంగా తెలియజేశారు. ఏ సదుపాయాలు కావల్సినా వెంటనే కలిగిస్తామని, అభిషేక్‌ని అహర్నిశలూ కనిపెట్టుకొని ఉండాలని ముఖ్యమంత్రి డాక్టర్లకు ఆదేశాలు యిచ్చారు. ముఖ్యమంత్రి అభిషేక్‌ని చూశారు. ఆతర్వాత అభిషేక్‌కి కొంచెం దూరంలో నిలబడిన జ్యోత్స్నని చూశారు.

"ఎవరమ్మా నువ్వు?" ముఖ్యమంత్రి అడిగారు.

"డాక్టర్ జ్యోత్స్న... రాయలుగారి అమ్మాయిని"

"అభిషేక్‌ని జాగ్రత్తగా చూసుకోవాలి, మన నాయకులను మనమే కాపాడుకోవాలి" ముఖ్యమంత్రిగారు ప్రసంగం మొదలెట్టేటట్టుండటం చూసి, ఆయన అంతరంగిక సలహాదారుడైన ఓ అధికారి "సర్... బయట ప్రజలు మీకోసం చూస్తున్నారు" అన్నాడు.

"పదండి" అంటూ ముఖ్యమంత్రి సర్దుకుని బయటికి కదిలారు.

ఆస్పత్రి ఆవరణ బయట రోడ్డుకి పక్కగా స్టేజిలా అమర్చారు. దానిమీద ఓ మైక్, ఆ స్టేజీలాంటి దానిముందు వేలాది ప్రజలు. వారిని చూడగానే ముఖ్యమంత్రిగారికి ఆవేశం వచ్చింది.

"ఇదెంత దారుణం, మీరంతా కలిసి అత్యధిక మెజారిటీతో గెలిపించిన మీ ప్రతినిధి మీద దాడిజరిగింది.

"పాపం..."

"అతనిప్పుడు చావుబతుకుల మధ్య ఉన్నాడని డాక్టర్లు చెప్పారు"

అంతలో ఓ వ్యక్తి స్టేజెక్కాడు. అతను ఎస్.ఐ చెవిలో ఏదో చెప్పాడు. అలా చెప్పిన ఆ వార్త ముఖ్యమంత్రి అంతరంగిక సలహాదారుని ద్వారా ముఖ్యమంత్రి చెవిలోకి పాకింది.

మళ్లీ అందుకున్నారు మంత్రిగారు- "అందరూ ఆనందించదగ్గ విషయమేమిటంటే, అభిషేక్‌కి ప్రాణాపాయం తప్పిందట. ఇప్పుడే డాక్టర్లు నిర్ధారణ చేశారు." అని అన్నారో లేదో అభిషేక్‌కీ జై, అభిషేక్ జిందాబాద్, ముఖ్యమంత్రి జిందాబాద్ అన్న నినాదాలతో ఆ ప్రదేశమంతా అదిరిపోయింది. ఆ నినాదాలు ముఖ్యమంత్రి ఆవేశాన్ని మరింత పెంచాయి.

"ఒక నాయకుడి మీద దాడిచేసి ఇలా దారుణాలు చేస్తే నా ప్రభుత్వం చూస్తూ ఊరుకో





దని నేను హెచ్చరిస్తున్నాను. ఈ దాడివెనుక వున్నవారు ఎంత పెద్దలయినా కఠినచర్యలు తీసుకొంటాం. పోలీసులకి యిప్పుడే చెప్పాను. రెండురోజుల్లోగా ఆ గూండాలను అరెస్ట్‌చేసి కోర్టుముందు వుంచాలని, అనేక పనులున్నా ఇక్కడికి నేనెందుకు వచ్చానంటే ఈ అభిషేక్ గొప్పతనమే కారణం. విద్యావంతుడు, సంస్కారవంతుడు. మీ అందరికీ నచ్చిన నాయకుడు. అలాంటి నాయకుడి సేవలు మీకెప్పుడూ వుండాలి. ప్రభుత్వానికి కూడా కావాలి. రికార్డు స్థాయిలో మెజారిటీ సంపాదించటమే కాకుండా ప్రత్యర్థులకు డిపాజిట్ గల్లంతు అయిందంటే మాపార్టీపట్ల ప్రజలకు ఎంత విశ్వాసముందో అర్థం అవుతోంది.

ఆడపడుచులకోసం ఎన్నో పథకాలు ప్రవేశపెట్టాం... పెడ్తున్నాం... ఎన్నో... ఎన్నెన్నో పథకాలు... ఎవరికోసం... ఎందుకోసం... మీకోసం.., మీ అభివృద్ధికోసం. అయితే యిలాంటి ఘోరాలు జరిగినప్పుడు ప్రజలు ప్రతిఘటించాలి. మా ప్రభుత్వం ప్రజలకోసమే. మీరే పాలకులు. మేం మీ సేవకులం. ధనబలంతో, గూండాయిజంతో హింసాకాండని పెంచుతూ మాపార్టీ ప్రతిష్టని దెబ్బతియ్యాలని కొన్ని శక్తులు ప్రయత్నిస్తున్నాయా అనే అనుమానం వస్తోంది. ఈ సంఘటన మనకీ, మన రాష్ట్రానికీ, మన దేశానికీ... తలవంపులు తీసుకొస్తుంది. అందుకే యిలాంటి సంఘటనలు జరగకూడదు. అందుకోసం మనమంతా సమైక్యంగా కృషిచెయ్యాలి. దేశం ఎవ్వరిది... మనందరిదీ. భాషాబేధాలు, మతపరమైన కలహాలు, పేదా గొప్పా తారతమ్యాలు మనం విడిచిపెట్టాలి. సమైక్యంగా కదిలి దేశఐక్యతకూ, భద్రతకూ మనం నడుం కట్టాలి - జైహింద్'' ! మైక్ ముఖ్యమంత్రి గుప్పిట గజగజలాడింది. ముఖ్యమంత్రి మాటలు విన్న శ్రోతలకి, తాము ఏం చెయ్యాలో, తమని ఆయన ఏం చెయ్యమన్నారో అర్థం కాలేదు.

''అదర గొట్టేశాడురా''

''ఏం స్పీచ్''

''ముఖ్యమంత్రి అంటే మాటలా''

''అబ్బా... ఏం జనం''

''ముఖ్యమంత్రి వస్తున్నాడని తెల్లారగట్ట నుంచీ ఇక్కడే వున్నారట జనం''

''ఛీ... పోరా... అభిషేక్‌ని కొట్టిందే తెల్లారగట్ట. ఎదవ కబుర్లు చెప్పకు. ముఖ్యమంత్రి ఏదో పోగ్రాం మీద కాకినాడ వచ్చి ఇదిగో ఈ ఏషయం తెలిసి యిలాగొచ్చేసినాడు''

''నీకెవడు చెప్పాడ్రా?''

''ఎవరైతే ఏటి- అదిగో ఆ పోలీసోళ్ళు అనుకుంటూంటే యినేసినాను''

''ఇంతకీ ఈ అభిషేక్‌ని కొట్టినోడెవడురా?''

''ఎవడేటీ... ఎవడో...''

''ఎవడో... కాకపోతే నువ్వుగానీ కొట్టినావేటి?''

''పోరా నాకేటిపని''

''మరి ఎవడై వుంటాడు?''

''పోలీసోళ్ళు పట్టేసుకుంటారేవిటి''

''పోలీసోళ్లా? నీగ్గాని పిస్సి లేసినాదేట్రా! ఆల్లవల్ల ఏమవుద్ది? కొట్టేసినాడు ఇక్కడున్నా రారా అంటాడేవిటి?''

''మరయితే ఏమవుద్ది?'

''ఏదో అవుతుంది. అది మనకెలా తెలుద్ది?''

''మరంతేనంటావా?''

''అంతేగాదేటి''

''ఓస్... అంతే''...

''నువ్ నడు- పనిలోకి రావేటి''

ఎవరిపని వారిది.

ముఖ్యమంత్రిగారిది అసలు సిసలైన ప్రసంగమని అన్నారు జనం. ఆయన హాయిగా నవ్వుకుంటూ పైకి విషాదం ఒలకబోస్తూ వెళ్ళిపోయారు.

అంతవరకూ కంగారు, భయం, ఆందోళన, బెదురుచూపులు, భక్తిభావాలు, అడుగులకి మడుగులు ఒత్తే ప్రయత్నాలు మొదలైనవన్నీ నటించిన అధికారం జనం తేలికయిపోయారు.

పోలీస్ అధికార్లకు మాత్రం నటించటం యింకా పూర్తికాలేదు. హోంమంత్రి అక్కడే దిగబడ్డాడు. ఆయనతోపాటు డి.జి.పి ఆగిపోయాడు. హోంమంత్రికి, ముఖ్యమంత్రికి మధ్య కొంచెం పొరపొచ్చాలొచ్చాయని, అందు

కే ముఖ్యమంత్రి హోంమంత్రిని ఆ వ్యవహారం చూసుకురండి అనేవంక మీద తనతోపాటు తీసుకెళ్ళలేదనీ పురప్రముఖులు అనుకొంటున్నారు.

హోంమంత్రి వెళ్ళలేదని డి.జి.పి కూడా ఆగిపోయాడు. హోంమంత్రి మూడ్ ఆరోజు ఎందుకో అంత బాగోలేదు. ముఖ్యమంత్రి తన తోపాటూ వద్దన్నారనో లేక ఒకరోజు అనవసరంగా ఇక్కడే వుండాల్సొచ్చిందనో లేక పార్టీలోని తన ప్రత్యర్థివర్గం ఈ చిన్నవిషయాన్ని పెద్దదిగా చేసి ముఖ్యమంత్రి దగ్గర తన పలుకుబడి తగ్గిందని ప్రచారం మొదలుపెడతారనో మరేదయినా అనో మొత్తానికి ఆయన చిరాగ్గా వున్నాడు.

ఆ చిరాకంతా ఎస్.పిని పిలిచి ఆయన మీద చూపించాడు. అసలు దాడెలా జరిగిందన్నాడు? జరక్కూడనిది జరుగుతుంటే ఏం చేస్తున్నారన్నాడు. అలా ఓ ఐదు నిముషాలు అక్కడవున్న పోలీస్ అధికార్లముందు తన ప్రతాపం చూపించి గెస్టుహౌస్‌కి వెళ్ళిపోయాడు. జిల్లా పోలీస్ ఉన్నతాధికారులు హోంమంత్రికి, డి.జి.పికి నదుపాయాలు ఎలా వున్నాయంటూ సి.ఐలనూ, ఎస్.ఐలనూ నిలదీస్తున్నారు. 'బాగానే ఏర్పాట్లు చేస్తున్నాం' అంటూనే వాళ్లు కానిస్టేబుళ్ళను అదిలిస్తున్నారు. వాళ్లేమో ఎస్.ఐల దగ్గర్నుంచి, హోంమంత్రివరకూ అందర్నీ మనసులోనే బండబూతులు తిట్టుకుంటూ పరుగులు పెడుతున్నారు.



అభిషేక్ ఆందోళనకర పరిస్థితిని దాటేసరికి పదిరోజులు పట్టింది. ఈలోగా రాష్ట్ర ముఖ్యమంత్రి దగ్గర్నుంచి, గ్రామాల్లోని వార్డుల సభ్యులవరకూ అందరూ అభిషేక్ గురించే చర్చించేవారు. ఉన్నతాధికారుల సమావేశాలు జరిగాయి. రాజకీయనాయకులు తీవ్రంగా చర్చలు చేశారు. పోలీసులు విపరీతంగా గాలించామని రిపోర్టులు రాసుకొన్నారు. అసలు నేరస్థుల అజలేదు. ఇలాంటివి ఎన్నో వినీ, చూసి, మౌనం పాటించే ప్రజలు నాలుగు రోజుల తర్వాత మర్చిపోయారు.

అభిషేక్ మృత్యువుతో పోరాడి గెలిచాడు.

కార్మిక సంఘాలన్నీ ఏకమై ఒకే వేదికమీద అంత ఘనంగా సన్మాన వేడుకలు, అందునా తన ఎస్టేట్ పక్కనే జరపడం భరించలేని, సహించలేని జగదీష్, సంస్కారాన్ని వదలి, ధనబలంతో పైశాచికత్వం సందించుకుని ఆపని చేయించాడనీ, అభిషేక్‌ని చావబాదించాడని మామూలు జనాలకి తెలీదు. కొందరు పెద్దలకు తెలిసినా సాక్ష్యం లేక ఏంచెయ్యలేకపోయారు.

ధనబలంతో గూండాలనుకొని హింసాకాండ సాగించటం రాజకీయాల్లో కొత్త విషయం కాదు. లక్షలాది ప్రజలు వోటుశక్తితో గెలిపించుకున్న అభిషేక్‌మీద దాడి చెయ్యటానికి గూండాలు నహితం వెనుకాడారు. రాజకీయనాయకులను అల్లరిచేస్తారేతప్ప వారిపై దాడిచెయ్యటానికి సాధారణంగా గూండాలు అంగీకరించారు. అందుకు అంగీకరింపచెయ్యాలంటే ఎంత మత్తు వాళ్ళ మెదళ్ళను ముంచిందో, మరెంత డబ్బు ఆ గూండాల మనసులను దోచుకుందో, జగదీష్‌కే తెలియాలని, పోలీసులు రహస్యంగా చర్చించుకున్నారు. అదీ అసలు విషయం. ఆ అసలును, అస్సలు లేకుండా చెయ్యటానికి ఆ సంగతిని సమాధి చెయ్యటానికి పోలీసులు ఎంతగా ఆలోచించారో...? ఆ ఆలోచనకు ఎన్ని వేల, లక్షల రూపాయలు మత్తు సీసాలుగా, కరెన్సీగా వారిచేతుల్లో తాండవమాడాయో...?

డబ్బు...

డబ్బుతో హింస...,

డబ్బుంటే అనాయాచితంగా పేరుప్రఖ్యాతులు..., డబ్బుతో అధికార బలాన్ని బలగాన్ని ఆకట్టుకుంటే సంఘంలో పరపతి...

డబ్బుతో లోకంలో ఏమైనా చేయవచ్చు...

కానీ ఆ డబ్బు...

అభిషేక్‌ని ఏంచేసింది...?

శారీరకంగా బాధించింది. మానసికంగా మరింత ఎత్తుకి పెంచింది.

ఆ డబ్బు అభిషేక్ శరీరం మీద గాయాలు చేయగల్గింది. మనిషిని మృత్యువుకు చేరువ లోకి తీసుకువెళ్ళగల్గింది. కానీ మేధస్సును మాత్రం ఏంచెయ్యలేదు.

డబ్బుకీ... మేధస్సుకీ...-సహజ తెలివికీ, సిరిసంపదలు తెచ్చిపెట్టిన ఉన్నత విద్యకీ, సంస్కారానికీ, హోదాకీ సంఘంలో గెలుపు కోసం జరిగే ప్రయత్నానికీ, సంఘంలోని వ్యక్తుల తెలివిని ఓడించాలనే పట్టుదలకీ!

ఎప్పుడూ ఆదొకరకమైన పోరాటం.

జగదీష్‌కి అభిషేక్‌కీ మధ్య పోరాటం. అభిషేకంటే జగదీష్‌కి వ్యక్తిగతంగా అసహ్యం... ఎందుకు...?

అభిషేక్ తనకంటే అందగాడు కాదు. తనకి పోటీగా వున్న పారిశ్రామిక వేత్తకాదు. తనని దెబ్బతీసినవాడు కాదు. తనని అణచాలని ప్రయత్నించిన సాహసికాదు.

అయినా...

ఎందుకు వైరం?

ఆ వైరం అభిషేక్ మీద కాదు...

అభిషేక్ వ్యక్తిత్వం మీద కూడా కాదు.

అభిషేక్ తెలివీ, చాకచక్యం మీదా?... ఎందుకు?

అభిషేక్ ఎదగటం జగదీష్‌కి నచ్చలేదు, నచ్చటంలేదు, నచ్చదు. అతన్ని ఏ విధంగానూ ఎదగనియ్యకూడదనేదే జగదీష్ పట్టుదల. అలాగని తన పనులన్నీ మానుకొని ఆ ప్రయత్నాలు చెయ్యటంలేదు. తన ఫ్యాక్టరీ వ్యవహారాలు చక్కగా చూసుకుంటూనే ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాడు.

అదేమిటో... జగదీష్ అతన్ని ఎంతగా ఎదగనివ్వకూడదనుకుంటున్నాడో అతను తీసే ప్రతి దెబ్బా అభిషేక్‌ని ఒకో మెట్టు పైకెక్కిస్తోంది.

ఆ సంగతి గుర్తించటంలేదు జగదీష్. ఒకోసారి అలా అనిపించినా, "తాను చేసింది నూటికి నూరుపాళ్ళు కరక్టే" అనుకుంటూ తనను తాను సమర్థించుకుంటాడు. జగదీష్‌కి "ఇది నీ తప్పు" అని చెప్పగలిగే స్థాయి మిత్రులు లేరు. కన్నతండ్రి కూడా కొడుకు చేసే ప్రతి పనీ పట్టించుకొనే తీరికలేని వ్యక్తి. జగదీష్ సమర్థతవల్లే కొన్ని కొత్త ప్రాజెక్టులు చేపట్టగలిగినందుకు పారిశ్రామికవేత్తగా చంద్రశేఖర్ సంతోషిస్తూంటాడు.

అభిషేక్ జగదీష్‌ని పట్టించుకోడు. ఆనాడు ఆ సమయంలో ఎదురయిన సమస్యను ఎలా పరిష్కరించాలనేదే అభిషేక్ బాధ్యతగా స్వీకరిస్తాడు. దాని పరిష్కారంకోసం తెలివిగా ఆలోచించి బయటపడతాడు. సమస్య ఎలా వచ్చిందనే విషయంకంటే సమస్యా పరిష్కారమే అభిషేక్‌కి ముఖ్యం. ప్రతి నిముషం పొరపాటు లేకుండా జాగ్రత్తలు తీసుకొనే మనస్తత్వం.

అభిషేక్ చావుదెబ్బలు తిన్నా ప్రాణాపాయ పరిస్థితి ఎదురయినా అందరిలా ఆవేశపడలేదు. ఉద్రేకాలకు లోనుకాలేదు. ఎవరెంత రెచ్చగొట్టినా నిలకడ పాటించాడు. ఆస్పత్రిలో పోలీసులు అనుమానాస్పదుల జాబితా యివ్వమని బలవంతం చేసినా 'నాకు శత్రువులా' అని చిరునవ్వునే సమాధానంగా యిచ్చాడు.

తనమీద జరిగిన దాడి కుట్ర అని అభిషేక్‌కి తెలుసు. ఎందుకు ఊరుకొన్నాడనేదే అర్థంకాక అతని మద్దతుదార్లు తికమకపడుతూంటారు. ప్రత్యర్థివర్గాలకు ఆందోళన కలిగించే మౌనం జగదీష్‌లో చిన్న కదలికను కూడా తీసుకురాలేదు. అభిషేక్‌ని చావుదెబ్బ కొట్టాలనేదే జగదీష్ అభిమతం. చంపాలని మాత్రం ఏనాడూ అనుకోలేదు. కానీ గూండాల విజృంభణలో ఎలాంటి పరిస్థితులు ఏర్పడతాయో ఊహించటం కష్టం. దాడిలో ప్రతిఘటించేవారుంటే గూండాలు హత్యలకైనా సిద్ధపడతారు.

అవన్నీ తనకి అనవసరమని భావించాడు జగదీష్.

కానీ...

ఆ అనవసరమే అభిషేక్‌కి ఎనలేని కీర్తిని తెచ్చిపెట్టింది. వార్తల్లో చర్చనీయాంశమై ప్రభుత్వ ఉన్నత పీఠాలవరకూ అభిషేక్‌ని తీసు




కుపోయింది. అధికారపార్టీ పెద్దలు అనవసరం అనుకోకుండా అభిషేక్‌ని గుర్తించారు. ప్రజల్లో అభిషేక్‌పట్ల సానుభూతి అకారణంగా పెరిగింది.

రెండు నెలలకుపైగా ఆస్పత్రిలో ఉన్న అభిషేక్‌కి జ్యోత్స్న దగ్గరయింది. ఆ సమయంలో అభిషేక్ ఆమె సేవలను అందుకొన్నాడు. ఆ అభిమానాన్ని గుండెల్లో దాచుకొన్నాడు. జ్యోత్స్న అభిషేక్ ఇద్దరూ పరస్పరం ప్రేమించుకొంటున్నా ఎవరికి వారే పరిధి ఏర్పరచుకొని మనసులోనే ఆ ప్రేమను అదిమిపట్టారు. అభిషేక్ ఆమె అభిమానాన్ని బాహాటంగా ప్రశంసించినా గౌరవప్రదంగా ఉంటాడు. గౌరవంగా చూసే అభిషేక్ మనోభావాలు అర్థంకాక జ్యోత్స్న దూరంగా జరుగుతోంది.

ఆగని కాలం మూడునెలలను కాలగర్భంలోకి నెట్టేసింది.

అభిషేక్ శాసనసభా కార్యక్రమాలకు హాజరవటానికి హైదరాబాద్ వెళ్ళాడు. స్వంత క్లినిక్ పెట్టాలంటూ జ్యోత్స్న కూడా రాజధానీ నగరానికి బయల్దేరింది.

"మీరు ఆ ఎం.ఎల్.ఏ మీద క్రమశిక్షణ చర్య తీసుకొంటారా?" ఓ విలేకరి ముఖ్యమంత్రిని ప్రశ్నించాడు.

"ఎందుకూ?"

"మీ పార్టీలో వుంటూ పోలీస్ శాఖను దుయ్యబట్టి న్యాయవిచారణ జరిపించాలని డిమాండ్ చేశాడుగా"

"మా పార్టీ ఎం.ఎల్.ఏ డిమాండ్ చెయ్యకూడదా? వ్యక్తిగత హోదాలో పత్రికా సమావేశం పెట్టివుంటాడు. సమస్య చెప్పి వుంటాడు. ఆయన న్యాయవిచారణకు డిమాండ్ చేస్తే తప్పేమిటి?" ముఖ్యమంత్రి ఎదురుప్రశ్న వేశారు.

"పోలీస్ శాఖను తిట్టడమంటే మీ ప్రభుత్వాన్ని విమర్శించడమేకదా" మరో విలేకరి అడిగాడు.

"ఆయన ఏ సమస్య ఎదుర్కొన్నాడో... ముందా సమస్యను పరిశీలించి అవసరమైతే న్యాయవిచారణ జరిపిస్తాం. అంతేగానీ క్రమశిక్షణ చర్య అనేది ఈ విషయంలో తలెత్తదు" ముఖ్యమంత్రి సూటిగా చెప్పాడు.

"అధికార పార్టీ సభ్యుడు కదా ! ఆయన ఇలా పత్రికా ప్రకటన యివ్వడం పార్టీ ప్రతిష్ఠను దిగజార్చినట్లు కాదా?" ఓ విలేకరి అడిగాడు.

"ఆ విషయం పార్టీ ఆలోచిస్తుంది" ముఖ్యమంత్రి సమాధానమిచ్చాడు.

"రాష్ట్ర హోంమంత్రికి, మీకూ భేదాభిప్రాయాలు వచ్చాయని కొన్ని పత్రికల్లో రాశారు. ఆ తర్వాత పోలీస్ శాఖను విమర్శిస్తూ అధికార పార్టీ సభ్యుడు ప్రకటన చేశాడు. ఈ రెండింటికీ సంబంధం ఏమయినా వుందా?" సీనియర్ రిపోర్టర్ ఒకతను ప్రశ్నించాడు.

"అదేదో మీకే తెలియాలి... నాకయితే తెలీదు" ముఖ్యమంత్రి చెప్పాడు.

ముఖ్యమంత్రిని అనేకరకాలుగా ప్రశ్నించి ఎలాగైనా రాజకీయ అంతర్యుద్ధాలను వెలికితీయాలని పత్రికా ప్రతినిధులు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

అంతకుముందురోజు అధికార పార్టీకి చెందిన శాసనసభ్యుడు అభిషేక్, పత్రికా ప్రతినిధులను పిలిచి ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టాడు.

తన నియోజకవర్గంలోని ఒక కుటుంబాన్ని పోలీసులు ఛిన్నాభిన్నం చేశారనీ, భర్తను అమానుషంగా పోలీస్‌స్టేషన్లో చంపారనీ అభిషేక్ ఆరోపించాడు. పోలీసుల కిరాతకానికి అతని భార్య బలయిందనీ, చావుబతుకుల మధ్య ఆమె ఆసుపత్రికి చేరిందనీ తెలిపాడు. ఆ దారుణానికి చెందిన వాస్తవాలు, రుజువులూ పత్రికా ప్రతినిధుల సమావేశంలో చూపించాడు. ఆ వాస్తవాలనూ, రుజువులనూ హోంమంత్రి ముందుంచినా ప్రయోజనం లేకపోయిందనీ, అందుకే ప్రజలముందు ఉంచుతున్నాననీ అభిషేక్ ప్రకటించాడు. ముఖ్యమంత్రి ముందుకు ఆ వివరాలు పంపించాననీ, వాటిని ఆయన హోంమంత్రికి పంపించినా ఏ చర్యా యింతవరకూ తీసుకోలేదనీ అభిషేక్ విలేకరులకు చెప్పాడు. ఆ కేసు గురించీ, అభిషేక్ ఆరోపణలు, వాస్తవాలనీ క్రోడీకరించి పత్రికలన్నీ ప్రకటించాయి. ఆ మర్నాడే విలేకరులు ముఖ్యమంత్రిని కలిశారు. ఆ కాన్ఫరెన్స్ జరుగుతోంది. అయితే దీనికో




కారణం వుంది. హోంమంత్రి చెప్పుచేతల్లో నడిచే కొందరు జర్నలిస్టులు ముందుగా రాష్ట్ర సచివాలయంలోని ప్రెస్‌రూంకి చేరి ముఖ్యమంత్రిని కలునుకోవాలని ప్రతిపాదన పెట్టారు. అభిషేక్ ప్రకటనకు ఆయన చర్య కనుక్కోవాలనీ, అదే ఆనాటి వార్త అనీ మిగతావారిని కదిలించారు. దాంతో ముఖ్యమంత్రిని కలవడం, ప్రశ్నించడం జరిగాయి. ముఖ్యమంత్రితో సమావేశం అయింతర్వాత ఆ ప్రతినిధుల్లో కొందరు వెంటనే హోంమంత్రిని కలిశారు. అభిషేక్ చర్యమీద ముఖ్యమంత్రి వైఖరిని అందించారు. హోంమంత్రి ఉగ్రుడయ్యాడు.

"అభిషేక్ అనే ఓ ఎం.ఎల్.ఏ చావుదెబ్బలు తిని బ్రతికిన, ఓ ఛోటా రాజకీయనాయకుడు. ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి వాగుతాడా వాడు? అది వాడు వాగిందా లేక ఈ ముఖ్యమంత్రి మద్దతు చూసుకొని వాగాడా? ఏమైనా వాడి అంతుచూడాలి. రాజకీయాల్లోంచి వాడిని తరిమెయ్యాలి. ఈ ముఖ్యమంత్రి పనికిమాలిన వెధవలను ఎంకరేజ్ చేస్తున్నాడల్లే వుంది. లేకపోతే వాడికెంత ధైర్యం... ఈ విషయం వెంటనే తేల్చుకోవాలి." అనుకున్నదే తడవుగా హోంమంత్రి ముఖ్యమంత్రిని కలిశాడు. అభిషేక్‌ని దుయ్యబట్టాడు. పార్టీనుంచి సస్పెండ్ చెయ్యాలన్నాడు. ప్రతిపక్షాల ఏజెంట్ అని ముద్రవేశాడు. అభిషేక్‌కి చరిత్ర లేదన్నాడు. రాజకీయాల్లో అలాంటివాళ్ళను ప్రోత్సహిస్తే పార్టీకే దెబ్బ అన్నాడు. అధికారపార్టీ సజావుగా పరిపాలన చెయ్యాలంటే అభిషేక్‌లాంటి చీడపురుగుల్ని ఏరిపారెయ్యాలన్నాడు. ఆ చీడపురుగులు దేశానికే నష్టమన్నాడు. తక్షణం తగుచర్య తీసుకోవాలన్నాడు. తాను ఏనాడూ నాయకత్వానికి విధేయుడనేనన్నాడు. నాయకుడైన, సమర్థుడైన, సౌశీల్యుడైన, రాజకీయదురంధురుడైన ముఖ్యమంత్రే ఈ విషయంలో జోక్యం కలిగించుకుని అభిషేక్‌ని పార్టీనుంచి తొలగించాలని ఓ వైపు ముఖ్యమంత్రిని పొగుడుతూ మరోవైపు అభిషేక్‌ని తెగిడాడు హోంమంత్రి.

ఆ సమస్యను తానే స్వయంగా తెల్చుకొంటానని ముఖ్యమంత్రి హోంమంత్రికి హామీ ఇచ్చాడు. ఏ విషయం తెలుసుకోకుండా చర్య తీసుకోవడం అవివేకమని హోంమంత్రికి నచ్చజెప్పి పంపేశాడు.

అభిషేక్‌కి ముఖ్యమంత్రినుంచి కబురు వచ్చింది. సాయంత్రం తనను కల్సుకోవాల్సిందిగా ముఖ్యమంత్రి ఆదేశం.

★ ★ ★

"ఏవయ్యా... ఏమిటీ గొడవ- ప్రెస్‌కాన్ఫరెన్స్ ఎందుకు పెట్టావ్?
హోంమంత్రిని కల్సి మాట్లాడలేకపోయావా?"

"హోంమంత్రిగారిని నాలుగుసార్లు కలిశాను సార్. ఆయన ఎంతసేపూ పోలీసు అధికారులనే సమర్థిస్తున్నారే తప్ప సమస్యను పట్టించుకోవడంలేదు" అని అభిషేక్ చెబుతుండగానే "కొంచం గట్టిగా చెప్పాల్సింది"- ముఖ్యమంత్రి అన్నాడు.

"ఏభైమందిని తీసుకెళ్ళి మరీ చెప్పాను. నేను సమస్యను వినండని గట్టిగా చెబితే నన్ను చిన్నబుచ్చి నీకేం తెలీదంటూ ఆయన నన్ను విసిరికొట్టారు. దానికీ నేను బాధపడలేదు. మీరు ఆయనకు లెటర్ మార్కు చేసినా దానిని కూడా ఖాతరు చెయ్యకుండా ముఖ్యమంత్రిగారి దగ్గరికెందుకెళ్ళావ్? అన్నారాయన. శాసనసభ్యుడుగా నాకు ఆ హక్కుంది అన్నాను. దానికే ఆయనకు కోపం వచ్చింది. 'నిన్నగాక మొన్న రాజకీయాల్లోకి వచ్చి హక్కు అని మాట్లాడుతున్నావంటే నీ వెనక ఎవరున్నారో... ఎవరిదంతా చేయిస్తున్నారో నాకు తెలును అని హోంమంత్రి అన్నారు. నాకు అదేం అర్థం కాలేదు. అదే చెప్పాను. పార్టీకి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నానన్నారు. నన్ను పార్టీలోంచి బహిష్కరిస్తానన్నారు. నేనవేమీ పట్టించుకోలేదు సార్. కానీ ఆయన నన్ను మరీ దారుణమైన మాట అన్నారు సర్. ఎం.ఎల్.ఏ టికెట్ కోసం 'ముఖ్యమంత్రికెంతిచ్చావ్.' అని ఆయనడిగారు. అయిదు లక్షలు మీరు నాదగ్గర తీసుకున్నారని ఆయనకు తెలిసిందట. 'లంచగొండి ముఖ్యమంత్రి మాటలు వినొద్దు, హోంమంత్రిని కలిసేసి పో'! అని ఆయన ఎవరెవరితోనో నాకు చెప్పించారు. ఈ సమస్య

తోపాటు, నాకు జరిగిన అవమానం మీకు చెప్పుకోవాలనిపించింది, కుదరలేదు. అందుకే ప్రజలకు, హోంమంత్రి ఆయన శాఖలో జరిగే అన్యాయాల గురించి చెప్పటానికే ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టాను''- అభిషేక్ వివరించాడు.

''సర్లే... ప్రెస్ కాన్ఫరెన్స్ విషయం వదిలేయ్. ఇంతకీ ఆ హోంమినిష్టర్ సంగతేమిటి? అసలు మీ యిద్దరికీ ఎప్పుడైనా... ఏదైనా?''

ముఖ్యమంత్రి మాటకి అడ్డం వస్తూ ''ఏం లేదుసర్'' అభిషేక్ అన్నాడు.

''ఆ తర్వాత....'' ముఖ్యమంత్రి.

''ఈ రోజు మధ్యాహ్నం ప్రతిపక్షాలకు చెందిన సీనియర్ నాయకులు నాకు ఫోన్ చేశారు సర్. హోంమినిష్టర్‌తో గొడవలు ఎందుకయ్యా అనే అన్నారు సార్ వాళ్ళు.

''సాధారణంగా ఇలాంటి విషయాలను ప్రతిపక్షాలే ఎక్కువగా పట్టించుకుంటాయి కదా... అధికారపార్టీ సభ్యుడిగా సమస్యను నేనే ప్రజల ముందుంచినందుకు వాళ్ళు నన్ను అభినందిస్తారనుకొన్నాను. కానీ వాళ్ళు అందుకు భిన్నంగా మాట్లాడారు. నేను వాళ్ళని అదే అడిగాను. హోంమినిష్టర్ వల్ల పనులు అవుతాయి. రాజకీయాల్లో పోరాటాలకంటె పనుల సాధనే ముఖ్యమని వాళ్ళన్నారు సర్. నేను వాళ్ళని నిలదీశాను సర్. వాళ్ళు కంగారుపడి నాకు మద్దతు ప్రకటిస్తూ ప్రకటనలు చేసారు సర్''! అభిషేక్ మాట్లాడుతున్నంతసేపూ ముఖ్యమంత్రి అది ఓ పక్కవింటూనే మరోపక్క బేరీజు వేసుకొంటున్నాడు.

ఎం.ఎల్.ఎలను పిలిపిస్తే చాలు అనవసర వినయాలు ఒలకపోస్తూ ఏదో ఆశించే చూపులు చూస్తూ నిలబడి కాకాబట్టే రకాలను అనేకంగా చూశాడు. ఈ అభిషేక్ హోంమంత్రి బాధితుడు. సూటిగా మాట్లాడే అభిషేక్ తత్వం ముఖ్యమంత్రిని ఆకట్టుకొంది. ఎంతసేపూ పదవులు ఆశిస్తూ వెంటబడేవారినే ఎక్కువగా చూసిన ముఖ్యమంత్రికి అభిషేక్ సంస్కారం నచ్చింది.

అభిషేక్‌ని అసలు సమస్యగురించి ముఖ్యమంత్రి అడిగాడు. అన్ని వివరాలనూ అభిషేక్ ముఖ్యమంత్రి ముందుంచాడు. అప్పటికప్పుడు అధికారులను పిలిచి ఆ సమస్య చర్చించాడు. అభిషేక్ అధికారులతో చర్చించిన తీరును ముఖ్యమంత్రి ప్రశంసించాడు. అభిషేక్ లేవనెత్తిన సమస్యమీద న్యాయవిచారణ జరిపిస్తామని ముఖ్యమంత్రి ప్రకటించారు.

అభిషేక్ ముఖ్యమంత్రి కలయికనూ, న్యాయవిచారణ వార్తనూ వివిధ పత్రికలు రకరకాలుగా రాశాయి. ఊహాగానాలు, వ్యాఖ్యలూ వెలువడ్డాయి. హోంమంత్రి పనిహుళక్కే అన్నట్లు పత్రికలు పేర్కొన్నాయి. అయితే హోంమంత్రి పదవివపదిలంగానే వుంది గానీ ముఖ్యమంత్రితో రాజకీయ భేదాభిప్రాయాలు మాత్రం పెరిగిపోయాయి.

అధికార పార్టీలో అసమ్మతివర్గం తీవ్రంగా తలఎత్తింది. ఆ అవకాశాన్ని ప్రతిపక్షాలు సద్వినియోగం చేసుకోవటానికి వ్యూహం పన్నాయి. ప్రతిపక్షాలు రాష్ట్రంలోని సమస్యలను ఎలుగెత్తి చాటకముందే అభిషేక్ తానే స్వయంగా వాటిని ప్రజలముందు పత్రికాముఖంగా బయటపెడ్తున్నాడు. అధికార పార్టీ సభ్యులు మరికొందరు అభిషేక్ మార్గాన్ని ఎంచుకొన్నారు. ప్రతిపక్షాలకు ఎలాంటి ఆస్కారం ఇవ్వకుండా అధికార పార్టీ సభ్యులు చేసే ప్రకటనలను ముఖ్యమంత్రి వెంటనే పరిశీలించి చర్యలు తీసుకొంటున్నాడు. దాంతో అధికార పార్టీ సభ్యులు, తద్వారా పార్టీ ప్రతిష్ట పెరగటం ముఖ్యమంత్రి గమనించాడు.

అభిషేక్ ముఖ్యమంత్రికి దగ్గరయ్యాడు. అసమ్మతివర్గాన్ని తగ్గించటానికి అభిషేక్ ముఖ్యమంత్రికి సహకరించాడు. ముఖ్యమంత్రి సన్నిహితవర్గంలో, అనతికాలంలోనే అతిముఖ్యుడయిన అభిషేక్ తన నియోజకవర్గంలోనే ప్రజలకు నచ్చిన రీతిలో పనులు చేయించాడు. నిరుద్యోగుల విషయంలో మొదటినుంచీ శ్రద్ధ తీసుకుంటున్న అభిషేక్, నియోజకవర్గంలో ఎంతోమంది జీవనోపాధికి కారకుడయ్యాడు. ఉద్యోగాలు దొరకనివాళ్లకి నిరుద్యోగుల పథకాల ద్వారా, గ్రామోదయ స్కీంద్వారా చిన్నచిన్న వ్యాపారాలు చేసుకునే అవకాశం కల్పించటానికి ప్రయత్నంచేశాడు.

ఒళ్లొంచి పనిచేయలేనివారూ, సోమరిత





నంతో వెనుకంజ వేసేవారూ అభిషేక్‌ని విమర్శిస్తూనే వున్నారు. ఉద్యోగం వేయించలేనివాడు నాయకుడుకాడనే దృష్టి ప్రజల్లో చోటుచేసుకొంది. రాజకీయనాయకుడు లంచగొండి అయినా, అవినీతిపరుడయినా, అన్యాయాలు చేసినా రాజకీయాల్లో ఆమాత్రం వుంటుందిలే అని జనం సరిపెట్టుకొంటారు.

రాజకీయనాయకులు సకలపాపాలూ చేయాలనేది ప్రజల అభీష్టమవుతున్నది. అన్యాయంగా కాంట్రాక్టులు సంపాదించటం, ఇష్టంలేని అధికార్లను బదిలీ చేయించటం, ప్రత్యర్థులను దెబ్బతీయటం, వ్యాపారాలకు ఆలవాలం కావటం, పరిశ్రమలకు అనుమతులు ఇప్పించటం, రూట్‌పర్మిట్లు దక్కించటం, పోలీస్ కేసులనుంచి తప్పించటం, తప్పుడు పనులు చేసినా రక్షణ కల్పించటం ఇలాంటివన్నీ రాజకీయ నాయకుల దగ్గర్నుంచే ప్రజలు ఆశిస్తారు.

ఒక చిన్న ఉద్యోగి పదిరూపాయలకు అనవసరంగా కక్కుర్తిపడితే దాన్ని చిలవలు పలవలుగా వర్ణించి విమర్శించే ప్రజలు రాజకీయ నాయకులకు రహస్యంగా తమ పనులకోసం మధ్యవర్తి ద్వారా డబ్బు అందించి ఆ నాయకునిముందు వినయం ప్రదర్శిస్తారు. 'ఫలానా నాయకుడి దగ్గర డబ్బు ఖర్చుపెడితే పనులు అవుతాయని' ప్రచారం చేస్తారు. లేకపోతే పని కిమాలిన నాయకుడిలా ప్రసిద్ధి చెందుతాడు. క్రమక్రమంగా ఈ అరాజకీయాన్ని అర్థంచేసుకొన్న అభిషేక్ ఎవరికి ఏ సమయంలో ఏపని ఎలా చేయించాలనే విషయాలను నేర్పుగా, ఓర్పుగా పరిశీలించి కార్యరంగంలోకి దిగుతాడు. సాధించటానికి ప్రయత్నంచేస్తాడు. ఆ పనులను సాధించటానికి అభిషేక్ చేసే కృషిని జనం మెచ్చుకుంటారు. పనులు కాకపోయినా అది తమ దురదృష్టం అనుకొంటూ అభిషేక్ ప్రయత్నాలను ప్రశంసించుకొంటూ వెళ్లిపోతారు.

అభిషేక్ దగ్గర దొరికే చనువూ, ఆప్యాయతా ప్రజల్ని ఆకర్షించటంతో పనిలేనప్పుడల్లా చాలామంది అభిషేక్ చుట్టూ వుంటూంటారు. స్వంత నియోజకవర్గంలో అభిషేక్ పలుకుబడి బాగా పెరిగిపోయింది. ముఖ్యమంత్రికి ప్రధాన సలహాదారులలో ఒకడయ్యాడు.

అంచలంచెలుగా ఎదిగిపోతున్న అభిషేక్ వ్యక్తిత్వం, పేరు, పలుకుబడి చూసి జగదీష్ కృంగిపోతున్నాడు. అతన్ని ఏరకంగా దెబ్బతియ్యాలా అని తెగ ఆలోచిస్తున్నాడు. కొండంతగా ఎదిగిపోతున్న అభిషేక్ తనకి అందుతాడా? రాష్ట్ర రాజకీయాల్లోకి దిగి, ముఖ్యమంత్రి సరసన చేరినవాడిని మనం ఎలా అణచాలి? జగదీష్ మెదడు మొద్దుబారింది. ఆలోచనలు శూన్యమై మనిషి కోపం, ఉద్రేకాలకు లోనవుతున్నాడు. అభిషేక్ గురించి టాపిక్ వస్తేనే చాలు మండిపడుతున్నాడు. జగదీష్ ఎందుకంత ఉద్రేకానికి గురవుతున్నాడో తెలియనివాళ్లు "అర్థం లేని ఆవేశం" అంటూ జగదీష్‌ని చాటుగా విమర్శిస్తున్నారు.

ఆ సమయంలోనే జగదీష్‌కి పరిచయమయ్యాడు ముత్యాలరావు. ముత్యాలరావు హోంమినిష్టర్ తమ్ముడు. హోంమినిష్టర్‌కి కుడిచెయ్యి. హోంమంత్రి స్వంత వ్యవహారాలన్నీ చూసే సమర్థుడు.

శత్రువు శత్రువు మిత్రుడన్నట్లు హోంమంత్రి తాత్కాలికంగా అభిషేక్‌ని శత్రువుగా భావిస్తున్నాడు. ఆ శత్రువుకి శత్రువు జగదీష్. అందుకే జగదీష్ హోంమంత్రి తమ్ముడయిన ముత్యాలరావు దృష్టిలోపడ్డాడు.

ముత్యాలరావు, జగదీష్ కలిసి అభిషేక్‌ని దెబ్బతీయటానికి చేతులు కలిపారు. ముఖ్యమంత్రి దగ్గర్నుంచి అభిషేక్‌ని తప్పించాలి.

ఆ భారాన్ని తన భుజస్కంధాలమీద వేసుకుంటానని హామీ ఇచ్చాడు ముత్యాలరావు.

★ ★ ★

జి.కె ఎస్టేట్‌లోని పరిశ్రమల్లో అత్యాధునిక యంత్రాలున్నాయి. వాటిలో పనిచేసే కార్మికులకి సకలసదుపాయాలు కల్గించారు. కార్మికులకు బట్టల దగ్గర్నుంచీ వసతి, భోజన సౌకర్యాలు ఫ్యాక్టరీల ఆవరణలోనే ఏర్పాటు చేశారు. పిల్లల చదువుకోసం, కుమార్తెల పెళ్లిళ్లకోసం, రోగాలకు చికిత్సకోసం, ఇతరత్రా కార్మికుల అవసరాలకు ఆర్థిక సహాయాలు అందిస్తున్నారు.

జగదీష్ ఎం.డిగా బాధ్యత స్వీకరించిన నాటినుంచి సౌకర్యాలను పెంచినమాట

వాస్తవం. పారిశ్రామికరంగంలో ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దిన పరిశ్రమలను చూడటానికి కొందరు విదేశస్థులు వచ్చారు.

రాష్ట్రమంతటా ఆ విదేశస్థులను జి.కె ఎస్టేట్ సందర్శించమని కోరి అధికారులను వారివెంట పంపించాడు. ఆ విదేశస్థుల సందర్శన తన ప్రాముఖ్యాన్ని కీర్తిని పెంచుతుంది కనుక జగదీష్ వారికి ఏలోటూ లేకుండా స్వయంగా ఏర్పాట్లు చేయించాడు. జగదీష్ జి.కె ఎస్టేట్ పరిశ్రమలను తాము ఎలా తీర్చిదిద్దిందీ వారికి సగర్వంగా చెబుతూ సగౌరవంగా ఆహ్వానించాడు. కార్మికుల తిండి, వసతి, భద్రత విషయాల్లోనూ, ప్రత్యేకంగా వారి వస్త్రధారణ విషయంలోనూ తామెంత శ్రద్ధతీసుకునేదీ జగదీష్ వారికి అందంగా చెప్పాడు. జగదీష్ ఆతిథ్యాన్ని అందుకొని అతనిభావను ఎంజాయ్ చేస్తూ ఎస్టేట్‌లోని పరిశ్రమల సందర్శనానికి వారొచ్చారు.

యంత్రాలు తయారుచేసే పరిశ్రమలోకి అడుగుపెట్టారు. వాళ్లందరూ, వాళ్లతోపాటు జగదీష్ కూడా నడుస్తున్నాడు. వందలాది కార్మికులు క్రమశిక్షణగా వాటి తయారీలో నిమగ్నమై వున్నారు. ఆ యంత్రాలు, వాటి ఉపయోగం గురించి జగదీష్ చెబుతున్నాడు. ఆ బృందం ఆ పరిశ్రమలోని ఓ కన్వేయర్‌బెల్ట్ మీద నడుస్తోంది. ఆ కన్వేయర్‌బెల్ట్ మీద ఓ మూలగా ఓ వృద్ధకార్మికుడు సోల్డరింగ్ చేస్తున్నాడు. మనిషి చాలా నీరసంగా కనిపిస్తున్నాడు. తాగుడులాంటి అలవాటేదో ఉన్నవాడిలా బక్కగా బలహీనంగా ఉన్నాడు. "అతను మీ కార్మికుడేనా? అలా వున్నాడేం?" అని నవ్వుతూ ప్రశ్నించారు ఆ పాశ్చాత్యబృందంలో ఎవరో. ఆ ప్రశ్న జగదీష్ గుండెల్లోబాణంలా దిగింది. ఎందుకో ఆ సాధారణ విషయం అతనికి వారిముందు అవమానంగా తోచింది. ఏదో సర్దిచెప్పాడు. మనసులో అవమానభారంతోనే వున్నా తెచ్చిపెట్టుకొన్న నవ్వుముఖంతో వాళ్లతో వుండి సాగనంపాడు. వాళ్లు వెళ్లిపోగానే అంతవరకూ అణుచుకుని వున్న ఆవేశం ఒక్కసారిగా పొంగింది. ఆలోచన ఆ పొంగుకి వక్కకి జరిగింది.

చకచకా ఆ కన్వేయర్‌బెల్ట్ మీదకు వచ్చాడు. అప్పటికీ ఆ కార్మికుడు అదే స్థితిలో వుండి సీరియస్‌గా పనిచేసుకుంటున్నాడు. కోపావేశం ధాటికి తట్టుకోలేక జగదీష్ ఆ కార్మికుణ్ణి బలంగా కొట్టాడు. ఊహించని ఆ పరిణామానికీ, ఆ బలమైన దెబ్బకీ అసలే బలహీనంగా ఉన్న ఆ కార్మికుడు తూలి ఆ ఫ్లైఓవర్ మీద నుంచి ఎగురుకుంటూ ఆర్తనాదం చేస్తూ దభీమని కిందపడ్డాడు.

★ ★ ★

క్లబ్‌లో వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. లాన్స్‌లో ఓ పక్కగా బేరర్లూ, క్లబ్ మేనేజరూ హడావుడిపడుతున్నారు. క్లబ్‌కి రాత్రి ఏడవుతూనే సభ్యులు రావటం మొదలుపెడతారు. అనేక కార్యక్రమాల రూపకల్పన ఆ క్లబ్ వాతావరణంలో జరుగుతుంది. సభ్యులూ...వారి స్నేహితులూ ఖరీదైన కార్లలో వస్తూంటారు. ఆ క్లబ్ బేరర్లలో సహితం అందరికీ ఆ సభ్యులు సుపరిచితులే. ఏ సభ్యుడి ప్రాముఖ్యం ఎలా వుంటుందో వారికి తెలుసు. సభ్యుల విలువను బట్టీ, హోదానుబట్టీ వినయవిధేయతలు ప్రదర్శిస్తారు. సంఘంలో విలువలేనివారు అక్కడికి రానేరారు. వచ్చినా పెద్దగా వారికి మర్యాదలు అందవనేది సభ్యులకు తెలుసు.

లాన్స్‌లో రాత్రి తొమ్మిదిగంటలకు ఓ మూల హడావుడి గమనించిన సభ్యులు, "ఎవరో పెద్దలొస్తున్నారు" అనుకొన్నారు. తొమ్మిదిన్నర ప్రాంతంలో రెండుకార్లు క్లబ్ ఆవరణలోకి దూసుకువచ్చాయి. ఆ కార్లోనుంచి ఖాదీబట్టల కరకరతో ఓ ఆరుగురు దిగారు. నలుగురు ఆ లాన్స్‌లోని ఓ మూలకి వెళ్లిపోయారు. ఆ మూలలో మూలగా సర్దుకొన్నారు. వారి వెనకగా వచ్చిన ఇద్దరు రాజకీయనాయకులు వారికి దూరంగా, సభ్యులందరికీ కూడా దూరంగా కూర్చున్నారు.

వాళ్లిద్దరూ మాటల్లో మునిగిపోయారు. "రోజులు చాలా దారుణంగా మారుతున్నాయి దామోదరం. మనం ఎంత కష్టపడినా పేరొచ్చేది ఆయనకేగా. ఆ... అన్నట్లు ఈవాళ పేపర్ చూశావా?" హోంమంత్రి రాజశేఖరం అడిగాడు.

"చూశాను... మళ్లీ మంత్రివర్గ మార్పులు అని రాశారు. వాళ్లు ఏదో రాస్తుంటారు. మనం




వాటిని పట్టించుకొంటే లాభంలేదు''— వ్యవసాయశాఖమంత్రి దామోదరం అన్నాడు.

"ఛ... పట్టించుకోవటం కాదయ్యా. ఆయన ముఖ్యమంత్రి ఓ ఆలోచన చేశాడనుకో....దాన్ని బయటకి వదులుతాడు. ఆ ఆలోచనలకి ఎలాంటి రియాక్షన్ వస్తుందో చూస్తాడు. అప్పుడు దాన్నిబట్టి అమలుపరుస్తాడు." రాజశేఖరం చెప్పాడు.

ఆ మంత్రులిద్దరూ చీకట్లోనే కూర్చున్నారు. ఒకరి ముఖాలు మరొకరికి కనిపించవు. మాటల్లోని భావాలు వెతుక్కోవాలి. హోంమంత్రి ఎందుకు తనని ఇలా తీసుకువచ్చాడో వ్యవసాయ శాఖ మంత్రికి తెలియదు. దామోదరానికి విషయం ఎలా బోధపరచాలా అనే విషయాన్ని హోంమంత్రి రాజకీయంగా తర్కించుకొంటున్నాడు.

"ఎందుకు ఆయన అలా మారిపోతున్నాడో తెలుసా?"

"మారిపోతున్నాడంటావా?" దామోదరం ప్రశ్న.

"ఖచ్చితంగా- మనకు తెలియకుండా తన సంబంధమైన నిర్ణయాలు చాలా చేస్తున్నాడు. అంతెందుకు- వ్యవసాయ శాఖమంత్రిగా నువ్వుండగా కనీసం నీతో మాటైనా చెప్పకుండా ఆ సంఘాలేవో ఏర్పాటుచేశాడా?" రాజశేఖరం కొంచెం కదిపాడు దామోదరాన్ని.

"ఆఁ... ఏం ఏర్పాటుచేశాడు అది అతని తరమా?- ఏదో ప్రకటించాడు. అది ఎప్పుడు అమలులోకి రావాలి?" దామోదరం కదలడం చూసి.

"వచ్చినా రాకపోయినా నిన్ను చిన్నబుచ్చడమేగా. నా విషయంలోకి వస్తే ఒక ఎస్.ఐని బదిలీచేసే అధికారం కూడా నాకు లేదు. ఇదేం పదవయ్యా? ఆయనే న్యాయవిచారణ చేస్తాడు. ఇక మనకి విలుకుబడి ఏంవుంటుంది?" రాజశేఖరం కంఠంలో బాధ తొణికిసలాడింది.

"అదే నా బాధ కూడా... అధికారుల్లో పరపతి లేకపోతే మనమేం చెయ్యలేం. ఇంతకీ ఆయనెందుకలా మారిపోతున్నాడంటావ్?" దామోదరం ప్రశ్న.

"ఆయనికి ఓ సలహాదారు బయల్దేరాడులే. వాడికేమో రాజకీయం స్పెల్లింగ్ కూడా రాదు. అందుకే అన్నీ సన్నాసి సలహాలు యిస్తున్నాడు. వాడిమాటలు ఈయనికి వేదం అయిపోయింది. వాడదే అదనుగా తీసుకొని ఆయన నెత్తికెక్కుతున్నాడు. ఎప్పుడో దెబ్బ తినేవరకూ ఇది సాగుతుంది. ఈలోగా మనం దెబ్బ తినేట్టున్నాం". రాజశేఖరం రాజకీయ వివరణ యిచ్చాడు.

"వాడేకదా...అదే ఎం.ఎల్.ఏ. అభిషేక్..వాడు మనల్ని దెబ్బతియ్యటం ఏమిటి? అయినా వాడిని అక్కడినుంచి విసిరికొట్టించటం పెద్ద పనా?" - దామోదరం పరిష్కారం చిటికెలో వుందన్నట్లుగా సూచించాడు.

"అదంత సులభం కాదు దామోదరం! వాడు ఆయన్ని బాగా పట్టేశాడు. ఆయనేమో అంతకంటె బాగా కట్టేశారు వాడిని. వాడిని అక్కణ్ణుంచి తప్పించాలంటే నీలాంటివాళ్ళు ఇద్దరు ముగ్గురు వాడికి వ్యతిరేకంగా నిలబడాలి. వాడిమీద ఎలాంటి ఆరోపణలు, ఏ సమయంలో చెయ్యాలో జాగ్రత్తగా ప్లాన్ చేద్దాం" - రాజశేఖరం దామోదరాన్ని రంగంలోకి దింపే వ్యూహరచన మొదలుపెట్టాడు.

అభిషేక్‌ని ముఖ్యమంత్రి దగ్గర్నుంచి దూరం చెయ్యటం, రాజకీయంగా అభిషేక్‌ని దెబ్బతీయటం, ముఖ్యమంత్రి ఆలోచనాసరళిని మార్చుకొనేవిధంగా తెలియజెప్పటం ఇలాంటి అనేక భావిప్రణాళికలు ఆ మంత్రుల చర్చల్లో కదిలాయి. ఆ చర్చలు రాత్రి పన్నెండింటివరకూ సాగాయి.

ఆ చర్చల సారాన్ని ఎవరూ వినటానికి ఆస్కారం లేదు. వారి కలయికలోని అంతరార్థం మరెవరికీ అందడానికి వీలులేదు. కానీ వారి కలయిక మాత్రం రహస్యంగా దాగలేదు. వారిద్దరూ అక్కడ కలవడం, చాలాసేపు చర్చించటం ముఖ్యమంత్రి అనుంగు అనుచరుడయిన పార్టీ సభ్యుడు ఒకడు చూశాడు.

ముఖ్యమంత్రి దగ్గరకు ఏదో విషయాన్ని మోసుకెళ్ళి ఆయన ప్రసన్నదృష్టిని ప్రసరించుకోవాలని అనేకమంది ప్రయత్నిస్తారు. ప్రతీ చిన్నవిషయాన్ని భూతద్దంలో చూస్తూ పెద్ద రహస్యంగా చిత్రీకరించి ముఖ్యమంత్రి మెచ్చు





కునేటట్లు చెప్పటం చాలామంది వృత్తిగా స్వీకరించారు. అందుకోసం అహర్నిశలూ శ్రమిస్తారు.

మంత్రుల కలయిక ముఖ్యమంత్రికి తెలిసెంది. రకరకాలుగా ఆ విషయాన్ని చెప్పారు. హోంమంత్రి అసమ్మతివర్గాన్ని పెంచటానికి చేస్తున్న కుట్రగా వర్ణించారు. మంత్రులను కూడదీసుకొని ప్రభుత్వాన్ని కూలదొయ్యటానికి పథకం వేస్తున్నారని ప్రచారం చేశారు. వారి వైపు ఎందరు ఎం.ఎల్.ఏ.లు వున్నారో బేరీజులు వేశారు. తమవైపు బలాన్ని అంచనా వేసుకొన్నారు. ముఖ్యమంత్రిని వారేం చెయ్యలేరని ధైర్యం చెప్పుకొన్నారు. ఏమైనా సరే ఈ విషయాన్ని తీవ్రంగా పరిగణించి తగినచర్యలు తీసుకోవాలని ముఖ్యమంత్రి మీద ఒత్తిడి తీసుకువచ్చారు. ముఖ్యమంత్రి వెంటనే అభిషేక్‌ని పిలిపించాడు. ఆ పరిణామం మీద చర్చలు సాగాయి.



జి.కె.ఎస్టేట్‌లోని మేనేజింగ్ డైరెక్టర్ గది ముందున్న విశాలమైన హాలు జనంతో నిండి వుంది. రణగొణ ధ్వనితో ఆ హాలంతా గొడవగా వుంది. జగదీష్ కొట్టిన దెబ్బకు 'ఫ్లై ఓవర్ మీదనుంచి కిందపడిన కార్మికుడి చెయ్యీ, కాలూ విరిగాయి. ఆసుపత్రి పాలయ్యాడు.

జగదీష్ అలా మూర్ఖంగా ప్రవర్తించడాన్ని ఖండిస్తూ జి.కె.ఎస్టేట్ కార్మికవర్గం న్యాయం కోరింది. కార్మిక నాయకులు జగదీష్‌ని కలవటానికి వచ్చారు. ఆ నాయకబృందం కూడా కార్మికజనం.

కార్మిక నాయకులు, కార్మికులు జగదీష్ గదిలోకి చొరబడ్డారు. ఆ గదిలో స్థలం లేకపోవటంతో మిగతావాళ్ళు హాల్లో బైఠాయించారు. జగదీష్‌ని నానాతిట్లు తిడుతున్నారు. ధనబలంతో విర్రవీగుతున్నాడన్నారు. డబ్బుతో మదించాడన్నారు. పొగరుతో కార్మికుడిని చచ్చేలా కొట్టాడన్నారు.

ఆ గొడవ లీలగా వింటున్న జగదీష్‌లో ఆవేశం కమ్ముకొచ్చింది.

గదిలోకి వచ్చిన కార్మికనాయకులను చూస్తూ "మీరు నాతో ఏదైనా మాట్లాడదలచుకుంటే బయట ఆ రాస్కెల్స్‌ని నోర్మూసుకుని ఉండమని చెప్పండి" కఠినంగా అన్నాడు జగదీష్.

"రాస్కెల్స్ అంటారా? ఆ కార్మికులు రాస్కెల్సా? ఏమిటి మాట్లాడుతున్నారు? ఓ కార్మికుడిని అన్యాయంగా కొట్టి ఆ కార్మికుడు చెయ్యీ, కాలూ విరిగి ఆస్పత్రిలో ఉన్నా చీమకుట్టినంత కూడా మీకు బాధ లేదే? తోటి కార్మికుడి బాధ కార్మికులంతా అనుభవిస్తారు. వాళ్ళు ఇపుడు మీ తప్పును చూపుతున్నారేకానీ గతంలో ఏనాడయినా మీ జోలికి వచ్చారా?" ఓ కార్మిక నాయకుడు అడిగాడు.

"వాళ్లెవరు నా తప్పును చూపించటానికి? మీరంతా ఇక్కడికి రావటం అనవసరం. వాడు కంపెనీ రూల్స్‌కి వ్యతిరేకంగా యూనిఫామ్ వేసుకోలేదు. అందుకే నేను హెచ్చరించాను. వాడు పడిపోతాడనీ, కాళ్లూ చేతులూ విరక్కొట్టుకొంటాడనీ నేను అనుకోలేదు. ప్రమాదవశాత్తూ జరిగిన సంఘటనని మీరు పెద్దగా చిత్రీకరించి నా గదిలోకి ఎందుకు వచ్చారు? ఈ జనాన్ని ఎందుకు తీసుకువచ్చారు? పైగా నా రూంబయట ఏమిటా అరుపులు? ఇదేనా కార్మికనాయకత్వం? మీరు నాయకుల్లా ప్రవర్తించండి. ఫస్ట్ గో... నా అనుమతి తీసుకుని లోపలికి రండి. వెళ్లండి" జగదీష్ ఆజ్ఞాపించాడు.

కార్మికనాయకులు జగదీష్ మాటలను అవమానంగా భావించారు. జగదీష్‌కి మర్యాద ఇస్తే లాభంలేదనుకొనే స్థితికి, నిర్ణయానికి వచ్చారు. ఆ కార్మికులలో ఒక్కడు కూడా కదలలేదు.

"జగదీష్... నీ ఇష్టం వచ్చినట్టు మాట్లాడకు. కంపెనీకి నువ్వు ఎం.డి.వే కావచ్చు. మేం కంపెనీని పెంచిన వర్కర్లం. అప్పలరాజుని

ఎందుకు కొట్టావు? నువ్ కొట్టకపోతే పనిచేసు కుంటున్నవాడు అలా కింద పడివుండేవాడు కాడు. అప్పలరాజుని కొట్టడానికి అసలు కారణం ఏమిటో చెప్పు" ఓ కార్మికనాయకుడు గట్టిగా అడిగాడు.

"యూ డర్టీ ఫెలో... నన్నే బెదిరిస్తున్నావా? నీకెందుకు చెప్పాలిరా? నువ్వెవడవు అడగటానికి? ముందీ గదిలోంచి బయటకు ఫో"- జగదీష్ అరిచాడు.

"ఈ గదిలోంచి వెళ్లం. ఏం చేస్తావ్?"- ఆ నాయకుడు నిజంగా బెదిరించాడు.

జగదీష్ సెక్యూరిటీ గార్డులను పిలిచాడు. వాళ్లు రాలేదు. జగదీష్ ఒళ్లు మండింది. ఆ కార్మికనాయకులనూ, కార్మికులనూ పొమ్మని అరిచాడు. వాళ్లకి సంజాయిషీ ఇవ్వనవసరం లేదన్నాడు. వాళ్లని ఇడియట్స్ అన్నాడు. తనతో చర్చించేస్థాయి వాళ్లకు లేదని విసిరికొట్టాడు. అప్పలరాజుని తాను కొట్టడాన్ని సమర్థించుకొన్నాడు. ఆ కార్మికనాయకులనూ, వాళ్ల ప్రవర్తననూ విమర్శించాడు. కార్మికుల్లా ప్రవర్తించమని చెబుతూ రోగ్స్‌లా మాట్లాడవద్దన్నాడు. వాదప్రతివాదనలు చెలరేగాయి. కార్మికనాయకులు చెలరేగారు. కార్మికులు ఆవేశపూరితులయ్యారు. ఆ గది తక్షణం ఖాళీ చెయ్యకపోతే తీవ్ర పరిణామం ఎదురవుతుందని జగదీష్ ఆ కార్మికవర్గాన్ని హెచ్చరించాడు. ఆ హెచ్చరికలకూ, బెదిరింపులకూ వాళ్లు లొంగలేదు. కానీ అవిమాత్రం వాళ్లని రెచ్చగొట్టాయి. జగదీష్ మీద మీదకువస్తూ వాళ్లని బెదిరించాడు. మాటకుమాట, తిట్టుకు తిట్టు, బెదిరింపుకు బెదిరింపూ సాగాయి.

జగదీష్ సహనం నశించింది...

ఆ కార్మికవర్గం తిరుగుబాటును భరించలేక రివాల్వర్ తీసి బెదిరించాడు. దానికి కూడా వాళ్లు బెదరక ముందుకొచ్చారు.

కాల్చమంటూ జగదీష్ వైపు వచ్చారు.

బెదిరించేవాడు కాల్చలేడని వాళ్ల నమ్మకం.

బెదిరిస్తే పారిపోతారని జగదీష్ నమ్మకం.

కానీ పరిస్థితి చేయిదాటింది.

కార్మికులు తనని ఏంచేస్తారోననే భీతి జగదీష్‌లో ఆ క్షణంలో ప్రవేశించింది.

అంతే...

అప్పుడు జరిగింది...

జరక్కూడనిది జరిగింది...

జగదీష్ ఏం జరక్కూడదనుకున్నాడో అదే ఆ క్షణంలో జరిగింది.

మీదకు వస్తున్న కార్మిక గుంపును బెదరగొట్టడానికో

తనలోని భీతిని ఎదుర్కొనడానికో అనుకోకుండా

జగదీష్ చేతిలోని రివాల్వర్ పేలింది.

రివాల్వర్‌నుంచి దూసుకుని వచ్చిన గుండు ఓ కార్మికుడి భుజాన్ని చీల్చుకుంటూ వెళ్లింది.

కార్మికులు తెగించి రెచ్చిపోయారు.

జగదీష్‌కు ఏంచెయ్యాలో తెలీక రివాల్వర్‌ను గాలిలో పేలుస్తూ వాళ్లని తప్పించుకుని ఎస్టేట్‌నుంచి బయటపడ్డాడు.

★ ★ ★

"దామోదరం... నీమీద నాకు పూర్తి నమ్మకం వుంది. నిన్ను ఏనాడూ అనుమానించలేదు. అనుమానించనుకూడా. నీ విషయంలో ఎవరేం చెప్పినా వినలేదు... వినను కూడా. నామీద ఎవరు ఏంచేస్తున్నారో నీకు తెలుసు. నేను ఎవరికీ వ్యతిరేకిని కాను. ఎవరికీ అన్యాయం చెయ్యలేదు. కానీ అనవసరంగా నామీద కక్ష కడుతున్నారు. నన్ను దెబ్బతియ్యాలని ప్రయత్నిస్తున్నారు. నువ్ చెప్పు... రాజశేఖరానికి హోంశాఖనిచ్చాను. అన్ని అధికారాలు వున్నాయి. అయినా ఎందుకో అతనికి ద్వేషం" దామోదరాన్ని చూస్తూ తాపీగా అన్నాడు ముఖ్యమంత్రి.

దామోదరం అంతకుముందు విషయాన్నే మనసులో మననం చేసుకొంటూ మాట్లాడటానికి ఉద్యుక్తుడవుతున్నాడు. దామోదరం పెదవి విప్పకుండానే ముఖ్యమంత్రి మళ్లీ మొదలుపెట్టాడు.

"మంత్రివర్గం సమర్థవంతంగా పనిచెయ్యటానికి మార్పులు చెయ్యాలనుకొన్నాను. ఆ ఎక్సైజ్, కమర్షియల్ టేక్స్‌లు నీలాంటి సమర్థులకు ఇవ్వాలనుకున్నాను. అది పసిగట్టి

నీమీద అనుమానం రావటానికి, నిన్ను పిలిచి రహస్యంగా మాట్లాడాడు. అయితే నిజానిజాలు నాకు తెలియకపోవు. నీమీద నాకున్న నమ్మకం సంగతి నీకు తెలియందికాదు. అందుకే డైరెక్ట్‌గా నిన్ను పిలిచి మాట్లాడుతున్నాను'' ముఖ్యమంత్రి రాజకీయాన్ని ప్రయోగించి మాట్లాడమన్నట్లు దామోదరంకేసి చూశాడు.

ఎక్సైజ్ కమర్షియల్ టేక్స్‌లశాఖ, వాటి ప్రాముఖ్యత దామోదరం ఎరగనివి కావు; వాటి వల్ల లాభాలు తెలియనివి కావు. ముఖ్యమంత్రి రాజకీయపు ఎరవేశాడనే సంగతి కూడా దామోదరం ఊహించలేని విషయం కాదు.

కానీ ఆ పదవి...

పదవీకాంక్ష... ఆశ...

మానవుడిని ఆఖరిక్షణంలో కూడా ఆలోచింపచేస్తాయి. దామోదరం తన పదునైన బుర్రలోంచి ఆలోచనలను, అవకాశవాదంవైపు తిప్పాడు.

"నేను మిమ్మల్ని ఉదయంనుంచీ కలుసుకోవాలని ప్రయత్నించాను కానీ మీరు బయటకు వెళ్లారు. ఆ తర్వాత కలుద్దామంటే మీరు ఏదో సెమినార్‌కి వెళ్లారని తెలిసింది. ఈలోగా మీ కబురు అందింది. వెంటనే వచ్చేశాను. నిన్నరాత్రి హోంమంత్రి రాజశేఖరం నన్ను డిన్నర్‌కి రమ్మన్నారు. డిన్నరే కదాని వెళ్లాను'' అని దామోదరం మొదలుపెట్టి రాజశేఖరం ముఖ్యమంత్రిని దెబ్బతియ్యటానికి ఆలోచన చేస్తున్నాడనీ, అందులో భాగంగా ముఖ్యమంత్రికి ప్రధాన సలహాలిచ్చే ఎం.ఎల్.ఏ అభిషేక్‌ని తప్పించాలని ప్రయత్నిస్తున్నాడని, అభిషేక్‌ని, ముఖ్యమంత్రినీ విడదీస్తే ముఖ్యమంత్రిని దెబ్బకొట్టటం తేలికని రాజశేఖరం భావిస్తున్నాడనీ ఆ కార్యక్రమంలో సహకరించవల్సిందిగా తనను కోరాడనీ, దానికి తాను నిరాకరించాననీ, రాజశేఖరం తనకు అనేక ఆశలు చూపించాడనీ, ఈరోజు ముఖ్యమంత్రిని దెబ్బతీసినవాడు 'రేపు తనను మాత్రం దెబ్బతీయడా' అని తాను ఆలోచించానని, అలా అనేక అనీలను దామోదరం ముఖ్యమంత్రిముందు అనేశాడు.

హోంమంత్రి వ్యవహారం శృతిమించకుండానే తగిన చర్యలు తీసుకోవాలని ముఖ్యమంత్రికి సూచనకూడా అందించాడు. అభిషేక్‌లాంటివాడు పార్టీకి, ప్రభుత్వానికీ అవసరమని పొగిడేశాడు. ఎలాంటి పరిస్థితి ఎదురైనా తన మద్దతు, తన జీవితం ముఖ్యమంత్రికే అంకితమని ప్రతిజ్ఞచేశాడు. రాజశేఖరానికి ఎప్పటినుంచో ముఖ్యమంత్రి కావాలని వుందనీ, అందుకే రాజకీయపు ఎత్తుగడలు వేస్తున్నాడనీ గట్టిగా చెప్పాడు.

దామోదరం ఇచ్చిన సమాచారం ముఖ్యమంత్రిని కొద్దిగా కలవరపరిచింది. హోంమంత్రి రాజశేఖరం ఆటలు సాగనివ్వకూడదనే నిర్ణయానికి వచ్చాడు. రాజకీయాల్లో మనిషి విలువ తగ్గించడమంటే ఏమిటో ముఖ్యమంత్రికి బాగా తెలుసు. ఆ తెలుసున్న మార్గాన్ని అనుసరించడానికి ఆయత్తమయ్యాడు. ఆరోజు రాత్రికి రాత్రే మంత్రుల శాఖలను ముఖ్యమంత్రి స్వయంగానే మార్చేశాడు. కొందర్ని మంత్రి పదవులనుంచి తప్పించాడు. కొత్తవారికి స్థానం కల్పించే ఆలోచన కూడా సాగింది. ఆ మార్పుల, చేర్పుల రాజకీయపు ఎత్తుగడలతోనే, ఆ ఆలోచనలతోనే రాత్రి గడిచింది. మంత్రులు కంగారుపడ్డారు. దామోదరం మటుకు హాయిగా నిద్రపోయాడు.

జగదీష్ ఫ్యాక్టరీలో జరిగిన కాల్పులతో కార్మికులు రెచ్చిపోయారు. వారి కంప్లయింట్‌మీద అకారణంగా కాల్పులు జరిపిన ఆ ఎస్టేట్ మేనేజింగ్ డైరెక్టర్ జగదీష్‌ని పోలీసులు మర్నాడు ఉదయమే అరెస్ట్‌చేశారు.

కార్మికులు సమ్మె ప్రకటించారు.

ఆ కార్మిక పోరాటానికి మిగిలిన కార్మిక సంఘాలు మద్దతు తెలిపాయి.

బంద్ జరిగింది.

అల్లర్లు, గొడవలు మూలంగా పోలీసులు లాఠీఛార్జి, భాష్పవాయువు ప్రయోగించారు. చెదిరిన గుంపుల్లోంచి రాళ్ళవర్షం కురిసింది.

ఆ రాళ్లదెబ్బలకు పోలీసు అధికార్లు సహితం దెబ్బలు తిన్నారు. పోలీస్ కాల్పులవరకూ పరిస్థితి దిగజారింది. ఆ పోలీస్‌కాల్పు





లలో యిద్దరు కార్మికులు మరణించారు. ఆరు గురు తీవ్రగాయాలతో ఆసుపత్రి పాలయ్యారు.



హైదరాబాద్‌లోవున్న అభిషేక్ ఆ రోజు వైజాగ్ ప్రయాణమవుతున్నాడు. విమాన ప్రయాణానికి యింకా అరగంట టైంవుందనగా ముఖ్యమంత్రి రమ్మని కబురుపంపాడు. ప్రయాణం రద్దుచేసుకోవల్సిందిగా ఆజ్ఞాపించారు.

అభిషేక్ విమానప్రయాణం రద్దు అయింది.

ముఖ్యమంత్రి రమ్మని ఆదేశించిన ప్రదేశానికి అభిషేక్ బయల్దేరాడు.

ఖైరతాబాద్ ప్రాంతంలో రోడ్డుపక్కగా కారు ఆగింది. దానికి కారణం రోడ్డుకి అటుపక్కగా జ్యోత్స్న ఆగివుంది. అభిషేక్ జ్యోత్స్నని పిలిచాడు. కారెక్కమన్నాడు. జ్యోత్స్నకి మరోమాట మాట్లాడే అవకాశమివ్వకుండా కారు ఎక్కి కూర్చున్నాడు అభిషేక్. జ్యోత్స్న కూడా వేరేదారిలేక కారు ఎక్కింది.

కారు రాజ్‌భవన్‌లోకి వెళ్లింది.

అప్పటికే అక్కడ ఏర్పాట్లు పూర్తి అయ్యాయి.

ఎంతోమంది కొత్త పాత మంత్రులతో, రాష్ట్ర గవర్నర్ ప్రమాణ స్వీకారం చేయిస్తూండగా అభిషేక్ కేబినెట్ మంత్రిగా ప్రమాణం చేశాడు. నిరాడంబరంగా జరిగిన ఆ ప్రమాణస్వీకారోత్సవం అనంతరం అభిషేక్‌కి రాష్ట్ర హోంమంత్రి పదవీబాధ్యతలను అప్పగించారు ముఖ్యమంత్రి. ఆ కార్యక్రమం అటెండ్‌చేసిన జ్యోత్స్న అభిషేక్‌ని అభినందించింది.

అభిషేక్ పక్కనే వున్న జ్యోత్స్నని చూసిన ముఖ్యమంత్రి మందహాసం చేశాడు. దానికి సిగ్గుపడిన జ్యోత్స్న అభిషేక్‌కేసి అభిమానంగా చూసింది. ఆ చూపును అర్థంచేసుకొన్న అభిషేక్ మౌనం పాటించాడు.

హోంమంత్రి పదవి చేపట్టిన మరునిముషంలోనే అభిషేక్‌కి మొట్టమొదటి సమస్యగా తన స్వంత నియోజకవర్గంలోని అశాంతి, హింసాకాండ ఎదురయ్యాయి.

ఆ సాయంత్రం అన్నా వదినలతోనూ, మహాలక్ష్మి, జ్యోత్స్నలతోనూ కలిసి అభిషేక్ ముఖ్యమంత్రిని కలిసి ఆయన ఆశీర్వాదాన్ని అందుకొన్నాడు. ఆరోజే ఊరెళ్ళడానికి ముఖ్యమంత్రి అనుమతి తీసుకొన్నాడు.

అయితే ఆ రోజు సాయంత్రం ఫ్లయిట్ లేదు. మర్నాడు ఉదయమే తాను తన నియోజకవర్గంలో వుండాలంటే గోదావరీ ఎక్స్‌ప్రెస్సే శరణ్యమనుకొన్నాడు.

మళ్లీ...

గోదావరిలో ప్రయాణం...

నిరుద్యోగిగా....

రాజకీయాల్లోకి వచ్చిన ఓ యువకుడిగా...

ఎం.ఎల్.ఏగా....

ఆ ట్రైన్‌లో ప్రయాణం చేశాడు అభిషేక్

ఒక్కొక్కసారి ఒక్కో హోదాలో...

ప్రస్తుతం...

మంత్రిగా గోదావరిలో ప్రయాణానికి ఉద్యుక్తుడయ్యాడు అభిషేక్.

సెకెండ్‌క్లాస్ ఏ.సిలో టికెట్లు రిజర్వ్ అయ్యాయి. అధికార్లూ, అనధికార్లూ, మద్దతుదార్లూ, జ్యోత్స్న వెంటరాగా మంత్రి అభిషేక్ ప్రయాణం అయ్యాడు.

మంత్రి అయిన తొలిసారిగా వస్తున్న అభిషేక్‌కి పెద్దపారిశ్రామికవేత్తలు తమ గెస్ట్‌హౌస్‌లలో ఆతిథ్యమివ్వాలనుకున్నారు. రాజకీయనాయకులు తమ ఇళ్లకే రమ్మన్నారు. అనేకమంది తమతమ ఆహ్వానాలు అందించారు. వాటన్నిటినీ నవ్వుతూనే కాదని తన స్వంత నియోజకవర్గంలో వున్న విశాలమైన రెవెన్యూ

గెస్టుహౌస్‌లో దిగాడు అభిషేక్.

అభిషేక్ రాక తెలిసి ఆ గెస్టుహౌస్ కంగారు పడింది. అక్కడ ఏనాడూలేని ఎయిర్‌కూలర్ ఓ గదిలో సర్దుకొంది. మిగిలిన సౌకర్యాలన్నీ క్షణంలో ఏర్పడ్డాయి.

గెస్టుహౌస్ కిక్కిరిసిపోయింది.

కానీ అభిషేక్ అక్కడలేడు.

గెస్టుహౌస్ బయట తండోపతండాలుగా వున్న ప్రజలమధ్య అభిషేక్ నిలబడ్డాడు.

మంత్రిగా అతన్ని చూసి పరిచయమున్న వారు కూడా పక్కకు జరుగుతున్నారు. వారిని పేరుపేరునా పలకరిస్తూ పాత అభిషేక్‌లాగే మాట్లాడుతున్నాడతను.

కానీ మంత్రి అభిషేక్‌ని ప్రజలు మామూలుగా చూడటానికి చాలా కష్టపడ్డారు. తాను వారిలో ఒకడినేకానీ, మంత్రి పదవితో దూరం చెయ్యద్దనీ వాళ్ళని కోరాడు అభిషేక్. నిర్మలంగా, నిరాడంబరంగా వున్న అతని కోరికను ప్రజలు మన్నించేసరికి మరికొంత సమయం పట్టింది.

కార్మికనాయకుల భుజాలమీద ఎప్పటిలాగే చెయ్యివేసి మాట్లాడుతున్న అభిషేక్‌ని చూసి ప్రజలు అతనికి దగ్గరగా వచ్చారు. అదే అభిషేక్ కోరుకున్నది... కోరుకునేది. ఆ ప్రజల సమస్యలూ, కోర్కెలు వింటూ సమయాన్నే మర్చిపోయాడు.

కార్మికనాయకులు, జి.కె.ఎస్టేట్ గొడవ అక్కడే చర్చించారు. ఆ చర్చలు అలా సాగుతూండగానే ఓ కారు ఆ గెస్టుహౌస్‌లోకి వచ్చింది.

జామీను మీద విడుదలైన జగదీష్, తండ్రి చంద్రశేఖర్ వున్నారు ఆ కార్లో.

వాళ్ళని చూసిన కార్మికులు వారికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు.

అభిషేక్ కార్మికులను వారించాడు.

సమస్య పరిష్కారానికి మార్గం అది కాదన్నాడు.

ఓ కార్మికనాయకుడిని పంపించి వారిని గెస్టుహౌస్‌లోని తన గదిలో కూర్చోపెట్టించాడు.

"నేను మంత్రిగా ఇక్కడకు వచ్చినా మీ ముందు నేనొక సేవకుడినే. కార్మిక నాయకుడిగా ఈ సమస్య పరిష్కరించటానికి నేను వచ్చాను. నాకు సహకరించండి... మీరు కోరిన విధంగానే మీతోనే నేనుండి సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నిస్తాను. వాళ్లు ఎందుకు వచ్చారో తెలుసుకుని వస్తాను. సమస్య గురించి వాళ్లతో మీముందే చర్చిస్తానని మీకు మాట యిస్తున్నాను. నేను మీ దగ్గరే నిలబడి వాళ్లని ముందుకు రమ్మని మాట్లాడతాను. ఇదైనా మీరు అంగీకరిస్తేనే" అభిషేక్ కార్మికులవైపు చూస్తూ అన్నాడు.

కార్మికవర్గం సరే అని అభిషేక్‌ని ప్రశంసిస్తూ నినాదాలు చేసింది.

అభిషేక్ జగదీష్ వున్న గదిలో అడుగుపెట్టాడు. ఆ గదిలో అభిషేక్, జగదీష్, చంద్రశేఖర్ మాత్రమే వున్నారు.

"చూడు జగదీష్ నీ సంగతి నాకు బాగా తెలుసు. ఉన్నత విద్య చదివావు. ఫ్యాక్టరీలను సమర్థవంతంగా నడుపుతున్నావ్. ఈరోజు నీకు ఇష్టంలేని నా ముందుకు వచ్చావ్. నా ముందుకు కాదు నా పదవి, హోదా ముందుకు నువ్వు వచ్చావ్. నీ తెలివితేటలు అమోఘమైనవి. కానీ నువ్వు వాటినే తలుచుకొంటూ అహంభావాన్ని పెంచుకొన్నావ్. అహం అనేది ప్రతివ్యక్తికీ వుండాలి. కానీ తెలివితేటలూ, ఈ అహం అందరికీ వుంటాయని కూడా గుర్తించాలి. నువ్ నీ అహాన్నే సాగించావ్. ఎదుటివాళ్ల అహాన్ని సహించలేకపోయావ్. ఏమైనా అది నాకనవసరం. నువ్వు నాముందుకు వచ్చిన శరణార్థివి. నిన్ను నేను రక్షించటానికి, ఈ సమస్యను పరిష్కరించటానికి అవకాశం ఇస్తాను. దాన్ని సద్వినియోగం చేస్తావో, దుర్వినియోగం చేస్తావో నీఇష్టం. నువ్వెంత అసహ్యించుకొన్నా కార్మికులు బలవంతులు. నీ ధనబలం వారిముందు ఆగదు.

నువ్వు ఆవేశంలో అనాలోచితంగా పొరపాటు చేశావ్. ఆ సంగతి నీకూ తెలుసు. అంగీకరించటానికి నువ్ ముందుకు రావని అందరూ అంటున్నారు. కానీ నీ పొరపాటు ఈ కార్మికవర్గంలో అశాంతిని రేపింది. అమాయకులు బలయ్యారు. నీవు అనుకొన్నట్లుగా అన్నీ జరగవు. అహాన్ని కొంచెం సేపు తగ్గించి, అహంకారాన్ని విడిచి వాస్తవంగా ఆలోచించు. కార్మికవర్గం ఎదురు చూస్తోంది ... వారి ముందుకొచ్చి





తప్పు ఒప్పుకో. వాళ్ళు సూచించే పరిష్కారమా ర్గానికి అంగీకరించు. చట్టపరమైన చర్యలు చట్టం తీసుకొంటుంది. బాధ్యతాయుతమైన మనిషిగా వాళ్ళముందుకొచ్చి వాళ్ళనీ మను షులుగా గుర్తించి సమస్య పరిష్కారానికి దో హదం చెయ్యి. నాతో నువ్ ఏంమాట్లాడాలన్నా ఆ పరిష్కారం తర్వాతే. నీ అనవసర ఆవేశా న్ని నేను అర్థం చేసుకోగలను... కమ్ మిష్టర్ జగదీష్"! అంటూ అభిషేక్ కార్మికవర్గంవైపు నడిచాడు. తండ్రీకొడుకులకు అభిషేక్‌ని అను సరించక తప్పలేదు. కార్మికుల తరపున వాళ్ళ తోపాటూ నిలబడ్డాడు అభిషేక్. వారికెదురుగా చంద్రశేఖర్, జగదీష్.

జగదీష్ తలవంచుకొని గొణుగుతున్నట్లు గానే "సా...రీ నేను తొందరపడ్డాను" అన్నాడు.

కార్మికనాయకులూ, కార్మికులూ అందుకు ఆనందాన్ని వ్యక్తపరిచారు.

సమస్య తక్షణం పరిష్కారమవ్వాలంటే జె.కె.ఎస్టేట్‌వారు, పోలీసు కాల్పుల్లో మర ణించిన వారి కుటుంబాలకు ఒక్కొక్కరికీ లక్ష రూపాయలు, గాయపడిన వారికి ఏభైవేల రూపాయలు చొప్పునా ఇవ్వాలని కార్మికవర్గం డిమాండ్ చేసింది. అంతేకాకుండా చనిపోయి నవారి కుటుంబంలో వారికి ఉద్యోగాలు ఇవ్వా లని కోరారు.

ఆ కోర్కెలన్నీ సామాన్యమైనవే అని అభి షేక్ కార్మికులకు మద్దతిచ్చాడు.

అభిషేక్‌ని మనసులోనే తిట్టుకొంటూ, తండ్రి బలవంతం, ప్రోద్భలం మీద జగదీష్ వారి కోర్కెలను అంగీకరించాడు.

కార్మికులూ, ప్రజలూ పెద్దపెట్టున హర్షధ్వా నాలు చేశారు. అభిషేక్‌ని అనేకరకాలుగా ప్ర శంసిస్తూ నినాదాలిచ్చారు. వాటిని వినలేక చెవులు మూసుకొంటూ జగదీష్ కారు వైపు నడిచాడు. చంద్రశేఖర్ కూడా అనుసరించా డు.

ఇద్దరూ కారెక్కారు.

"వ్వాట్ డాడీ?– ఈ ఫూల్... వీడు హోంమంత్రా?... వీడు సమస్యను పరిష్క రించటమా?... ఈ ఇడియట్‌కి మనం లొంగిపో వటమా! డర్టీఫెలోస్! వీడికి మంత్రిపదవి ఎలా ఇచ్చారో, ఇడియట్ చట్టంపనిచట్టం చేస్తుందట. మరి వీడెందుకు? మీరేమో వీడేదో చేస్తాడని లాక్కొచ్చారు. ఇడియట్... ఫూల్... నాకే నీతులు బోధిస్తున్నాడు. లక్షలాది రూపా యలు వీడి సొమ్మైనట్లు నష్టపరిహారం ఇప్పిస్తు న్నాడు. ఈ డర్టీపీపుల్, వాడినెందుకు వెనకే సుకుని వుంటో రోగ్స్... బ్లడీఫూల్స్"! జగ దీష్‌లో ఎక్కడలేని కసీ, ఆవేశం, అసహ్యం ఆవహించాయి

కారు స్టార్ట్ చేశాడు.

గెస్ట్‌హౌస్ దాటుతూండగా జగదీష్ కారాపా డు.

కారుకి కొంచెం దూరంలో ఎవరో ఆడవాళ్ళ తో జ్యోత్స్న మాట్లాడుతోంది.

"ఇలారా" అన్నట్లు చూశాడు జగదీష్. ఆ చూపు గమనించిన జ్యోత్స్న 'హలో' అంటూ జగదీష్‌ని పలకరించింది.

"వ్వాట్ ఆ్ యూ డూయింగ్ ఆల్ దీజ్ డేస్"?– యిదాకటి కోపాన్ని ఆవేశాన్ని మొ హంలో కనబనీయకుండా, నవ్వు తెచ్చుకున్న మొహంతో "నువ్ నాతో వుంటే హాయిగా వుంటావ్, వుడకూడదూ" అనే అర్థం వచ్చేట ట్లుగా జ్యోత్స్నకేసి చూశాడు జగదీష్.

"నీకు తెలీదా ... ఐ మ్యారీడ్ అభిషేక్" – అంటూ "అభిషేక్‌లాంటివాడు నాకు భర్తగా దొరకటం నా అదృష్టం" అని అర్థం వచ్చేట ట్లు చూసిది జ్యోత్స్న జగదీష్‌కేసి.

జగదీష్ మొహంలో మరో షాక్ బయటప డినా, అ చాటుచేసుకుని కారు స్టార్ట్‌చేసి జ్యోత్స్నతోమాట్లాడకుండానే, కనీసం ఆమె వైపు చూడకుండానే ముందుకు స్పీడుగా పోని స్తూ "గోటుహెల్" అని. మనసులోపల అను కున్నమాటబయటకి వచ్చేసింది.

ఆ మటలు జ్యోత్స్నకి వినబడలేదు. పక్కనే కూర్చున్న చంద్రశేఖర్‌కి మాత్రం వినప డ్డాయి.

ఎందుకో జగదీష్ ప్రవర్తనా, మాటలూ, చేష్టలూ అర్థంకావట్లేదు చంద్రశేఖర్‌కి. "జగ దీష్ యిక ఏం కాడేమోలే" అనుకొంటూ అర్థం కాని ఆలోచనల్లోకి, ఆ కారులాగే స్పీడుగా వెళ్ళిపోయాడుతండ్రి చంద్రశేఖర్.





# ఏరిన ముత్యాలు

## విద్యాలయం నా దేవాలయం

★ శరీరానికి వ్యాయామమెంత అవసరమో, మస్తిష్కానికి అధ్యయనం అంతే అవసరం.

— జోసెఫ్ ఎడిసన్

★ ఈరోజుల్లో చదవడం అందరికీ తెలుసు. కానీ ఏం చదవాలనేదే తెలియదు.

— జార్జి బెర్నార్డ్‌షా

★ అధ్యయనం ఆనందాన్ని యోగ్యతను ప్రసాదిస్తుంది.

— బేకన్

★ ప్రతి విషయాన్ని గురించి కొద్దిగా, కొన్నింటిని గురించి క్షుణ్ణంగా చదవడం మంచిది.

— బ్రోగా

★ చదవడంలోని నేర్పు అనవసరపు ఘట్టాలను అతి మెలకువతో దాటివేయడం.

— పి.జె. హామర్‌టన్

★ మననం చేయని చదువు జీర్ణం కాని ఆహారం వంటిది.

— ఎడుండ్మబర్క్

★ ప్రసంగాల కోసం చదివేవాళ్లూ, రాసేందుకు చదివే వాళ్లూ కోకొల్లలు. ఆలోచించేందుకు చదివేవారు అరుదు.

— సి.సి. కోల్టన్

★ ప్రజలు చదవడం మాస్తే క్రమంగా వక్రమార్గానపడి పెరగడం మానేస్తారు.

— నెహ్రూ

★ ఉత్తమ గ్రంథం చింతామణివంటిది. దానిని చదవడంవల్ల చెడు ఆలోచనలు రూపుమాస్తాయి. సంశయపిశాచం పారిపోతుంది. మదిలో సద్భావం జాగృతమై గొప్ప శాంతి ఏర్పడుతుంది.

— శివానంద

★ గతాన్ని స్మరించి, వర్తమానాన్ని ప్రేమించి, భవిష్యత్తును చూడగలిగినవాడే వాస్తవిక రచయిత.

— తుమ్మల

★ తన హృదయంలోకి న్యాయంగా చూడగలవాడు తానక్కడ చూసినదానిని నిర్భయంగా రాస్తే క అతనికి పాఠకుల కరవే ఉండదు.

★ ఈ విశాల విశ్వం మహాగ్రంథంలాంటిది. ఇల్లు కదిలి బయటి ప్రపంచాన్ని చూడనివాళ్లు ఆ గ్రంథంలో ఒక పేజీ మాత్రమే చదవగలుగుతారు.

— అగస్టీన్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

చతుర ఫీచర్

# ఇండియన్ మ్యూజియం

ప్రాచీన కళాఖండాల్నీ వస్తు సముదాయాల్నీ భద్రపరిచి ముందు తరాలవారికి గత వైభవాల్ని దర్శింపచేయటం అన్ని దేశాల్లోనూ ఉంది. మన దేశంలోని ప్రధాన నగరాల్లో ఎన్నో వస్తుప్రదర్శనశాలల్ని ప్రభుత్వం నెలకొల్పింది. హైద్రాబాద్‌లో సాలార్‌జంగ్ సేకరించిన విశేషవస్తువులను మ్యూజియంలో ప్రదర్శనకు ఉంచారు. మ్యూజియంలన్నింటిలోకి అతిపురాతనమైనది కలకత్తాలో ఉన్న ఇండియన్ మ్యూజియం.

ఈ ఇండియన్ మ్యూజియం ఆసియా ఖండంలోనే ఎన్నదగిందని చెప్పవచ్చు. ఇది ఏషియాటిక్ సొసైటీ సహకారంతో 1814లో రూపుదిద్దుకొంది. డెన్మార్క్‌కు చెందిన బ్రిటిష్ సర్జన్ నాథానియెల్‌వాలీ కన్న కలల ఫలమే ఈ మ్యూజియం. మనదేశంలోనే ఈ మ్యూజియం అతిపెద్దదీ, అతి పురాతనమైనదీ కూడా.

కలకత్తాలో 27, జవహర్లాల్ నెహూ రోడ్‌లో ఉన్న ఈ మ్యూజియంకు ప్రస్తుతం డాక్టర్ రమేష్ చంద్రశర్మ డైరెక్టర్‌గా, శ్రీ శ్యామల్ కాంతి చక్రవర్తి విద్యాధికారిగా ఉన్నారు. ఈ మ్యూజియంని మార్చి నుండి నవంబర్ వరకు ఉదయం పదిగంటల నుండి సాయంత్రం 5 గంటల వరకు, డిసెంబర్ నుండి ఫిబ్రవరి వరకు ఉదయం పదిగంటల నుండి సాయంత్రం 4.30 వరకు దర్శించవచ్చు. ప్రతి సోమవారం దీనికి సెలవు. 26 జనవరి, హోళీ, 15 ఆగస్టు, ఈదుల్‌ఫితర్, 2 అక్టోబర్, దీపావళి మొదలైన సెలవురోజుల్లో కూడా మ్యూజియంను మూసి ఉంచుతారు. ఈ మ్యూజియంను సందర్శించడానికి టిక్కెట్టు వెల రెండురూపాయలుగా నిర్ణయించినా విద్యార్థులకు మాత్రం ఉచితంగానే ప్రవేశం ఇస్తారు. ఏటా ఈ మ్యూజియంను విదేశీయులతో కలిపి 10 లక్షల మంది సందర్శిస్తారు.

ఈ మ్యూజియంలో దేశవిదేశీ సెమినార్లు చాలా నిర్వహిస్తుంటారు. ప్రతిభావంతులు పాల్గొనే ఈ సమావేశాల్లో ఎందరెందరో వక్తలుగానో, శ్రోతలుగానో హాజరవుతుంటారు.

ఈ మ్యూజియంలో ఆర్ట్స్, ఆర్కియాలజీ, ఆంత్రోపాలజీ, పెయింటింగ్, జియాలజీ, జూవాలజీ, బాటనీ మొదలైన ఎన్నో విభాగాలున్నాయి. ఇక్కడి ఫారిన్ గ్యాలరీ కూడా విశేషంగా ఆకర్షిస్తుంది. 175 ఏళ్ళ చరిత్రను ఇముడ్చుకున్న ఈ మ్యూజియం ఎందరెందరో మహనీయుల్ని దర్శించింది.

క్రీ.శ. 1832 నుండి ఈ మ్యూజియం అభివృద్ధికిగాను కృషిచేసి, ఉదారంగా విరాళాలొసగిన దాతలు చాలామందే ఉన్నారు. అందులో ముఖ్యంగా అలెగ్జాండర్ కానిన్‌గ్రాం, కౌంటెస్ ఆఫ్ లండన్, విలియం క్యారీ, హెచ్.హెచ్.విల్సన్, ఆర్టిస్ట్ రాబర్ట్ హోం, కాప్టెన్ టేలాన్, డాక్టర్ నాథాని యెల్ వాలీచ్, శ్రీ రాంకమల్ సేన్, రాజా కాళీకృష్ణ, మధురానాథ్ మల్కిక్, రాజా రాధకాంతదేవ్, శివ్‌చంద్ర దాస్, ధర్మగుప్త, బేగం సామ్రు అనే ఏకైక మహిళ ఉన్నారు.

శ్రీరామకృష్ణ, సిస్టర్ నివేదిత, పండిత్ ఈశ్వరచంద్ర విద్యాసాగర్ తదితరులు ఇండియన్ మ్యూజియంను సందర్శించి ప్రశంసించారు.

మ్యూజియంలోని విలువైన వస్తువులు కన్సర్వేషన్ లెబొరేటరీలో భద్రపరిచారు. సైంటిఫిక్ పరికరాలు కూడా ఎన్నింటినో జాగ్రత్తచేశారు.




ఇండియన్ మ్యూజియం ప్రధాన ద్వారము



డబ్ల్యు. గ్రేన్విల్ ప్లానువేసిన మ్యూజియం లోపలి భాగము.



మ్యూజియంలోని కారిడార్‌లోగల బుద్ధవిగ్రహాన్ని సందర్శిస్తున్న జపనీయులు



1873లో అలెగ్జాండర్ కారిన్‌గాం మధ్యప్రదేశ్‌లోని భార్హట్ గ్రామం నుండి మ్యూజియంకి తరలించిన బౌద్ధస్థూపం.



మ్యూజియంలో ప్రత్యేక ఆకర్షణగా ఉన్న నాలుగువేలేండ్లనాటి మమ్మీ స్థూపం. ఈ. సి. ఆర్కాల్డ్ 1883లో ఈజిప్తులోని గోర్బా పిరమిడ్ ఆఫ్‌ది ఫరావ్ నుండి మ్యూజియంకి తరలించాడు




గ్యాలరీ తలుపువెనుక బిగించిన 15 అడుగుల పొడుగున్న
ఈ దవడలు ఓ తిమింగలానివి.

ఫోటోలు: అజయ్ సిల్

# ఏరిన ముత్యాలు

★ స్త్రీ ప్రేమైక జీవి. ఆ ప్రేమలో కామం ఉంది. శారీరక వాంఛ ఉంది. త్యాగం ఉంది. మార్దవం ఉంది.

\- చలం

★ మానవుడు చేసిన అపకారాలన్నింటిలోకి స్త్రీయెడల చేసిన అపచారమంత పశుప్రాయమైనది, అమానుషమైనది మరొకటిలేదు.

\- గాంధీజీ

★ ఒక జాతి నాగరికతను అంచనా వేయాలంటే ఆ జాతి స్త్రీనిచూస్తే తెలుస్తుంది.

— కర్జన్

★ స్త్రీహృదయం నవనీతం. గట్టిపడిందా దానిముందు వజ్రం ఎందుకూ పనికిరాదు.

\- చలం

★ స్త్రీల స్థితి బాగుపరచేదాకా లోకకళ్యాణానికి మార్గమేలేదు. పక్షి ఒకే రెక్కతో ఎగరటం అసంభవం.

\- వివేకానంద

★ ప్రపంచంలోని అన్ని మహత్కార్యాలకు ఆరంభంలో ఒక్కొక్క స్త్రీ ప్రభావం వుంటుంది.

— లామెర్టైన్

★ స్త్రీమీద శారీరకంగా అనేక అత్యాచారాలు చెయ్యవచ్చు. కాని ఆమెలోని స్త్రీత్వాన్ని మాత్రం నాశనం చెయ్యలేరు.

— శరత్

★ స్త్రీలను చిన్నచూపు చూసి అవమానం చేసేవాడు తాను పతనమైనట్టే. తన ఉన్నతిని తాను తెలుసుకున్నవాడు స్త్రీలను గౌరవిస్తాడు.

— మార్టిన్

★ ఒక మగవాడు విద్యావంతుడయితే ఒక వ్యక్తి విద్యావంతుడవుతాడు. ఒక స్త్రీ విద్యావంతురాలయితే ఒక కుటుంబం యావత్తూ విద్యావంతులు అవుతారు.

— సోమర్‌సెట్‌మామ్

★ స్త్రీ మగవాడికి నీడవంటిది. అందుకోవడానికి ప్రయత్నిస్తే దూరం పరుగెడుతుంది. ఒకవేళ దీనినుండి పారిపోదలిస్తే వెంటాడుతుంది.

— హ్యూగో

★ మగువను మగవానితో సమానురాలినిచేస్తే ఆమె అతనికంటె అధికురాలవుతుంది.

— సోక్రటీస్

★ స్త్రీని దేవత అంటారు. కారణమేమిటంటే- ఆమె ఎవరు బాధపడుతున్నా కరుణతో కరిగిపోతుంది.

— బాల్జాక్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

# చతుర ప్రపంచం

## ఇంత పొడవు ఎదగకండి!

అమితాబ్‌లా పొడుగ్గా ఉండాలనుకునే యువకులూ, "ఇంకో నాలుగంగుళాల పొడవుంటేనా ఆటలో దుమ్ము లేపేసే వాడిన"నుకునే క్రీడాకారులూ మనకు తారసపడుతుంటారు. కాని ఆ పొడగరితనమే తనకు శాపంలా పరిణమించిందంటాడు జితేంద్రసింగ్.



19 ఏళ్ల జితేంద్రసింగ్ ఏడడుగుల మూడంగుళాల పొడవున్నాడు. సహజంగా ఆ వయస్సు కుర్రకారుకుండే హుషారు అతనిలో మచ్చుకి కూడా కన్పించదు. కారణం అతని పొడగరితనం వల్ల నిత్యం ఎదుర్కొనే యిబ్బందులే! అతనికి సరిపడ బూట్లు, చెప్పులు, లుంగీలు, పాంట్లు, చొక్కాలు ఏవీ దొరకవు. పడుకునేందుకు పొడవుకు తగ్గ మంచంకూడా దొరకదు. అన్నీ స్పెషల్ కొలతలతో, స్పెషల్ సైజుల్లో తయారుచేయించుకోవాలంటే ఖర్చు తడిసి మోపెడవుతోంది. బస్సుల్లోకి ఎక్కాలన్నా అతనికి ప్రాణాంతకమే అవుతోంది. ఇంట్లో నిలబడితే సీలింగు ఫానులు తలకి తగులుతుంటాయి. ఈ బాధలకుతోడు తోటి విద్యార్థుల వేళాకోళాలు ఎక్కువకావడంతో చదువు కూడా మానేశాడతను.

కలకత్తాలోని సాల్ట్‌లేక్ పోలీసు స్టేషన్‌లో డ్రైవర్‌గా పనిచేస్తున్న జితేంద్ర తండ్రి రామ్ బాలక్‌సింగ్ సాధారణ కుటుంబీకుడు. తన బిడ్డకి చాలినంత ఆహారం కూడా పెట్టలేని దుస్థితిలోనున్నానని అతను వాపోతుంటే, తల్లిదండ్రులకు తానో సమస్యలా తయారయ్యానని బాధపడుతున్నాడు జితేంద్ర. ఇతనికి ఉన్న ముగ్గురు సోదరులు, ఒక సోదరి పొడవులో అంతా మామూలుగానే ఉన్నారు.

ఓసారి ఎప్పుడో తయారుచేయించిన బూట్లు తెగిపోయి, పాడైపోవడంతో ప్రస్తుతం చెప్పుల్లేకుండానే ఎర్రటి ఎండలో సైతం కాళ్లీడ్చుకుంటూ తిరుగుతున్నాడు జితేంద్ర. కనీసం ఏ సర్కను కంపెనీవారైనా తనకింత ఆధరువు చూపితే బాగుండునని భావిస్తున్నాడతను.

## పుణ్యానికి పోతే...

పుణ్యానికిపోతే పాపం ఎదురైందంటూ లబోదిబోమంటున్నాడు స్వప్నాగంగూలీ. కలకత్తాలోని చర్చి హాస్పిటల్‌కు రక్తదానం చేయాలనే సదుద్దేశంతో రక్త పరీక్ష చేయించుకున్నప్పుడు అతని రక్తం బాగానే ఉన్నట్లు తేలింది. కాని వాటి శాంపిల్సును 'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కలరా అండ్ ఎంటెరిక్ డిసీజస్'కు పంపినపుడు వాటిలో 'ఎయిడ్స్' క్రిములున్నట్లు అక్కడ నిర్ధారణ జరిగింది. వెంటనే అతన్ని ట్రాపికల్ మెడిసిన్ స్కూలుకు తీసుకెళ్ళి పరీక్షించారు. అక్కడ రిపోర్టు మళ్ళీ దోషంలేదనే వచ్చింది కానీ పోలీసులు వెంటనేవచ్చి గంగూలీని అరెస్ట్‌చేసి జైల్లోపెట్టారు. ఆ తర్వాత అతని కుటుంబానికీ కష్టాలొచ్చిపడ్డాయి. ఇరుగుపొరుగులు ఇల్లు ఖాళీచేసి వెళ్ళ

మని బెదిరించనారంభించారు. కొందరైతే కరెంట్ పోయినప్పుడల్లా వారియింటిపై దాడి చేసి బీభత్సం సృష్టించసాగారు.

స్వప్నాగంగూలీ తండ్రి మణీంద్రబాబు కల



కత్తాలో ఒకప్పుడు బాగా బతికినవాడే! కాని ఎంచేతో అతని కుటుంబ ఆర్థిక పరిస్థితి దిగజారిపోయి ప్రస్తుతం మురికివాడలలో ఓ అద్దె కొంపలో ఉంటున్నాడు. నేషనల్ ఇన్స్టిట్యూట్‌లోనే శాంపుల్స్.విషయంలో ఏదో తారు మారు జరిగిందే తప్ప, తన కొడుకులో ఎలాంటి లోపమూ ఉండదంటాడాయన. జనం వత్తిడిని తట్టుకునేందుకు తన కొడుకు ఆరోగ్యవంతుడేనని ఆరోగ్యశాఖను ఓ సర్టిఫికెట్ ఇమ్మని ప్రాధేయపడుతున్నాడాయన. ఇంత గొడవ జరిగాక జైలు నుంచి తిరిగొచ్చే తన భర్తకు తిరిగి ఉద్యోగం ఎక్కడ దొరుకుతుందని రోదిస్తోంది గంగూలీ భార్య.

అతన్ని అరెస్టు చేయమని అసలు మేం ఆర్డరే ఇవ్వలేదని రాష్ట్రప్రభుత్వం చెబుతుంటే-"అది నిజమే... అయినా ప్రజారోగ్యానికి భంగంవాటిల్లుతుందనే భయంతో మేమే అతన్ని జైలులో ఉంచాం" అంటున్నారు ఘనత వహించిన పోలీసులు.

## తప్పు నెహ్రూదైనా...

సుమారు మూడుదశాబ్దాల క్రితం నెహ్రూజీ చేసిన పొరపాటుకు ఇప్పటికీ శిక్షననుభవిస్తోందో అమాయకురాలు అంటే మనమో పట్టాన నమ్మలేం. కాని ఇది నిజం. 1959 డిసెంబర్ 6న దామోదర్‌వాలీ ప్రాజెక్టు ప్రారంభోత్సవానికి నాటి ప్రధాని నెహ్రూ వచ్చారు. గిరిజన బాలికలు కొందరు తమ నృత్యగానాలతో ఆయనకు స్వాగతం పలికారు. అప్పుడు ప్రధానమంత్రి ఆ బాలికలలో ఒకతె అయిన బుధ్నిమజ్హిన్‌ను పిలిచి ఆమెతోనే ప్రాజెక్టు ప్రారంభోత్సవం చేయించారు. తరువాత గౌరవపురస్కరంగా ఆమె మెడలో దండవేసి ఆనందంగా చప్పట్లు కొట్టారాయన.

అయితే అంతటి గౌరవాన్ని పొందిన ఆనందం ఆ అమాయకురాలికి ఎక్కువసేపు నిలవలేదు. వరపురుషుడు మెడలో దండవేస్తే ఆమెకు పెళ్లయినట్లే లెక్క అని ఆ అమ్మాయి తెగకు చెందిన కులపెద్దలు అప్పు



డే నిర్ణయించారు. అయితే ఆ అమ్మాయిని పెళ్లిచేసుకోమని ప్రధానమంత్రిని అడగలేక వారంతా కల్సి బుధ్నిని కులం నుంచి వెలేశారు. కనీసం తల్లిదండ్రులు కూడా ఆమె ముఖం చూడ్డానికి ఇష్టపడకపోవడంతో ఆ అమ్మాయి బజార్నపడాల్సి వచ్చింది. గుక్కెడు





మంచినీళ్లు కూడా పుట్టే ఆవకాశంలేక ఆమె తన స్వగ్రామమైన గొరగొనని విడిచిపెట్టి వల్తారుక్వారీలో రోజు కూలీగా చేరింది. అసహాయస్థితిలోనున్న బుధ్నికి ఆ సమయంలో సుధీర్‌బాబు అనే యువకుడు ఆశ్రయం కల్పించాడు. ఫలితంగా అతనూ సంఘబహిష్కరణకు గురయ్యాడు. అయినా అధైర్యపడక ఆమెనే పెళ్లాడాడతను. వారికి ఒక పాప కూడా. తరువాత భార్యాభర్తలేవో చిన్నాచితకా ఉద్యోగాలు వెదుక్కొని పాంచెట్‌లో నివాసమేర్పరచుకున్నారు. తను ఈ ముప్పై ఏళ్లుగా అనుభవించిన నరకయాతనకి తల్లడిల్లి అందుకు కారణమైన నెహ్రూని, ఈ సమాజాన్ని కూడా యిప్పటికీ తిట్టిపోస్తుంటుంది బుధ్ని. ప్రస్తుతం ఆర్థికంగా వారి పరిస్థితి బాగానేఉన్నా ఎవ్వరితోనూ వాళ్లకి సంబంధబాంధవ్యాలు లేవు. తమ కూతురి భవిష్యత్తు ఎలా ఉంటుందోనని భయపడుతున్నారా దంపతులు ప్రస్తుతం.

## గోల్డ్ మెడల్ వంటవాడు

అన్ని రకాల విద్యలలోనూ పోటీలు పెట్టడం, పతకాలు బహూకరించడం సర్వసాధారణ విషయమే! అయితే అమధ్య అమెరికాలో జరిగిన ఓ వంటకాల పోటీలో ఓ భారతీయుడు బంగారు పతకం సాధించి మనందరికీ గర్వకారణంగా నిలిచాడు. శాన్‌ఫ్రాన్సిస్కోలో 'సెస్టాన్‌మిక్' పేర జరిగిన ఆ అంతర్జాతీయ వంటకాల పోటీలో 2000 మందికిపైగా నిష్ణాతులైన దేశదేశాల వంటవాళ్లు పాల్గొన్నారు. అంతమంది నలభీముల్లోనూ మహ్మద్ ఇమిడియాస్ అనే భారతీయ ఆసామి బంగారు పతకాన్ని చేజిక్కించుకున్నాడు. అసలు ఆసియా మొత్తంమీద వంటల పోటీల్లో బహుమతిపొందిన మొట్టమొదటి వ్యక్తి కూడా అతనేనట. ఆ పోటీలనిమిత్తం అతడు తయారుచేసిన బిర్యానీ, గులాబ్‌జామ్‌ల రుచికి దంగైపోయిన న్యాయనిర్ణేతలు మళ్ళీ మళ్ళీ అవే కావాలని పెట్టించుకుని తిన్నారంటే అవెంత అద్భుతంగా ఉన్నాయో మనం ఊహించుకోవచ్చు.

మహ్మద్ ఇమిడియాస్ ఖండానీ గోసాయ్ అనే ఓ వంటకాలు చేసే వారి కుటుంబంలో 1932 మే 7న జన్మించాడు. అతి నిరుపేదల యింట పుట్టడంవల్ల అనుభవించే కటిక దరిద్రానికి తోడు సవతితల్లిపోరు కూడా అతన్ని పీల్చి పిప్పిచేయసాగింది. ఫలితంగా ఎనిమిదేళ్ల వయసులోనే హాజీ ఇషాక్ అనే హొటల్ యజమాని వద్ద పనికి కుదిరాడు. విపరీతమైన కృషి కారణంగా అలా ఓ పది సంవత్సరాలు తిరిగే సరికి వంటకాలు చేయడంలో దిట్టగా పేరు తెచ్చుకున్నాడు. అతని వంటకాల కోసమే హొటల్‌కి వస్తూ తన ముందే అతన్ని కస్టమర్లు ఆకాశానికి ఎత్తివేస్తుండడం హొటల్ యజమాని హాజీ ఇషాక్‌కు దుస్సహంగా తయారైంది. ఫలితంగా హొటల్



నుంచి తరిమేశాడు. ఇమిడియాస్ సొంతంగా వేరే హొటల్ పెట్టుకున్నా దాన్ని తన గూండాల చేత ధ్వంసం చేయించాడు.

అదే సమయంలో ప్రేమ్‌నారాయణ్ టాండన్ అనే వ్యక్తి లక్నోలోని తన హొటల్ క్రిష్ణలో హెడ్‌కుక్‌గా ఇమిడియాస్‌ను కుదుర్చుకున్నాడు. అప్పటికి ఇమిడియాస్ వయస్సు 21. అప్పటినించీ 19 సంవత్సరాల పాటు అదే హొటల్‌లో పని చేశాడతను. కాని టాండన్ మరణంతో ఆయన కొడుకుల మధ్య వచ్చిన విభేదాల కారణంగా హొటల్ మూత పడింది.

ఫలితంగా మళ్ళీ రోడ్డున పడ్డాడు ఇమిడియాస్.

అంతలో వెల్‌కం గ్రూప్‌వారు ఇమిడియాస్ ప్రతిభా విశేషాల గురించి విని ఆగ్రాలోని తమ మౌర్య షెరాటన్ హోటల్‌కు చీఫ్ కుక్‌గా రమ్మని ఆహ్వానించారు. ఆగ్రాకి వెళ్లడం ఇష్టంలేకున్నా తన భార్యాబిడ్డల శ్రేయస్సుదృష్ట్యా అంగీకరించాడు ఇమిడియాస్. అక్కడ కూడా తన ప్రతిభావిశేషాల్ని ప్రదర్శించడంతో యాజమాన్యం అతన్ని ఢిల్లీలోని తమ ఫైవ్ స్టార్ హోటల్‌కి బదిలీ చేసింది. అంతేకాదు అతనికోసం ప్రత్యేకంగా 'సెపరేట్ ఇండియన్ ఫుడ్' అనే శాఖను ఏర్పాటుచేసి దానికి అతన్ని చీఫ్‌గా నియమించింది.

## సైకిలు పోటీలో నెగ్గిన బామ్మగారు

అరవై ఏళ్ల వయస్సులో కూడా హుషారుగా సైకిలుమీద తిరుగుతూ చాక్లెట్లు, అగరొత్తులు, వక్కపొడి అమ్మే నిర్మలాపాథక్ అసామాన్యస్త్రీ. ఆమె జీవితంలో ఎదుర్కొన్న కష్టనష్టాలు ఒకటీ అరాకాదు. అయినా ఉత్సాహం కోల్పోకుండా నిబ్బరంగా బతుకు పోరు సాగిస్తూ తనకు తనే సాటి అన్పించుకుందామె.

సుమారు రెండు దశాబ్దాలక్రితం నిర్మల భర్త వేరే అమ్మాయి వలలోపడి ఆమెని వదిలేశాడు. అప్పటికే ఆమె నలుగురు బిడ్డల తల్లి. అలాంటి దుర్భరపరిస్థితులలో కూడా ఆమెను ఆదుకోడానికి బంధువులెవ్వరూ ముందుకు రాలేదు. దాంతో చేసేదిలేక పిల్లల్ని తీసుకొని, ఆమె స్వస్థలమైన ఇండోర్‌ను విడిచి బొంబాయి చేరుకుంది.

అక్కడ మొదటి ఆరునెలలు ఒక ప్రయివేటు హాస్పిటల్‌లో ఆయాగా పనిచేసిందామె. ఆరోజులలోనే ఆమెకో మరాఠీ రచయిత పరిచయమయ్యాడక్కడ. అతనామె దీనావస్థను గమనించి నెలకు 300 రూపాయల జీతంమీద తన డ్రామా కంపెనీలో ఉద్యోగమిచ్చాడు. అది చేస్తూనే డబ్బు చాలడంలేదని సినిమాల్లో స్టంట్ ఉమన్‌గా చేరిందామె. నటీమణులకు డూప్‌గా నటిస్తూ డాబాలమీద నుంచి ఎగరడం, మంటల్లో దూకడం వంటి సాహసకృత్యాలు చేయడం మొదలెట్టింది. చివరికి మగ డూప్‌లు భయపడే ప్రాణాంతకమైన సన్నివేశాలను కూడా ఆమె అవలీలగా చేసేయసాగింది.

ఇవన్నీ చేస్తూనే మరోపక్క పూనే, లోనావాలా, ఖండాలావంటి చుట్టుప్రక్కల ప్రదేశాలలో ఉన్న సినిమా థియేటర్లకు వారానికోమారు 'న్యూస్‌రీల్స్' అందచేసే బాధ్యతను కూడా ఆమె స్వీకరించింది. దీని మీద ఆమెకు నెలకు రెండు వందల రూపాయలదాకా గిట్టుబాటవుతుందట.

వీటన్నింటితోపాటు ఇంకోపక్క సాంఘిక సేవా కార్యక్రమాలలో పాల్గొనడం కూడా చేసేదామె. అందులో భాగంగా మధ్యతరగతి గృహిణులు తయారుచేసే గృహోత్పత్తుల్ని విక్రయించి పెట్టడానికి వీధివీధి తిరిగేది. ప్రముఖ రాజకీయవేత్త వసంతదాదాపాటిల్ సహకారంతో బొంబాయిలోని యమ్మెల్యే క్వార్టర్స్‌లో ఒక స్టాల్‌ని కూడా నెలకొల్పింది. అక్కడ వస్తువులమ్మేందుకు ఎవరూ ఉండరు. తమకు కావల్సినవి తీసుకొని కస్టమర్లే వాటి ఖరీదుని నిజాయితీగా గల్లా పెట్టెలో వేసేసిపోతారట. మోసానికి అవకాశమున్నా ఇంతవరకు అక్కడ అలాంటిది జరగలేదని చెబుతుంది నిర్మల. రద్దీగా ఉండే బొంబాయి చర్చిగేటువద్ద ట్రాఫిక్ పోలీసులు లేనప్పుడు తనే నిలబడి ట్రాఫిక్‌ని కంట్రోలు చేస్తూ ఉంటుందామె. అది కూడా సంఘసేవేనని ఆమె ఉద్దేశం.

బొంబాయిలో నాలుగైదేళ్ల క్రితం జరిగిన 'అర్ధరాత్రి సైకిలు పందాల'లో 136 మంది మగవాళ్లను ఓడించి ఆమె విజయాన్ని సాధించింది. అప్పటికి ఆమె వయసు 55 ఏళ్లు. ఇంతటి దీక్ష, పట్టుదలగల నిర్మలా పాథక్ చదువుకోలేదు. అయితేనేం జీవితాన్ని చదివిందామె!

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.

# ఒక్క పోస్టు కార్డు చాలు!...

ఇంట్లో ఉంటూ తీరుబాటు
సమయాల్లో పోస్టుద్వారా
ఇంగ్లీషు నేర్చుకోవటానికి అవ
కాశం కలిగించే 'వివేకానంద
ఇన్‌స్టిట్యూట్' వారికి -
నా జోహార్లు. నేను తెలుగు
భాష ద్వారా ఇంగ్లీషు నేర్చుకోవ
టానికి రుసుము వివరాల
పుస్తకము మరియు అప్లికేషన్
ఫారము వెంటనే పంపమని
కోరుతున్నాను. ఇట్లు,
B. USHA
ANANTAPUR.

पते में पिन कोड लिखें
WRITE PIN CODE IN ADDRESS




TO,
VIVEKANANDHA INSTITUTE,
POST BOX NO:4986.
NO. 9, MADLEY ROAD,
T.NAGAR, MADRAS-17.
पिन PIN 600017

మీకూ, మీ అభ్యుదయానికీ మధ్యవున్న దూరం ఒక పోస్టుకార్డే అని మేమంటే మీకు విచిత్రంగానూ, తమాషాగానూ వుండవచ్చు. కానీ అది నిజం!

మీ అభ్యుదయానికి ఇంగ్లీషుభాష తెలియక పోవటమే ఒక కారణమైతే.....

ఇతరులు ఇంగ్లీషులో మాట్లాడుతుంటే మీకు అర్థమైనాకూడా వాళ్ళకి ఇంగ్లీషులోనే సమాధానాలు చెప్పలేకపోతున్నామే అని మీరు మానసికంగా బాధపడ్తూంటే....

ఇదివరకూ యెన్నో మార్గాలలో ప్రయత్నించినా, యెన్ని పుస్తకాలు చదివినా, ఇంగ్లీషులో మాట్లాడ లేకపోతున్నామే అన్న విసుగు మీలో పుట్టి వుంటే....

మీరు యెదురుచూసే అభ్యుదయాన్ని సాధించటానికి ఒక పోస్టుకార్డు వ్రాస్తేచాలు.

నిజమే!

ఇంగ్లీషులో వ్యాకరణ తప్పులు లేకుండా వుత్తరాలు, వ్యాసాలు వ్రాయటానికీ, చక్కగా, సరళంగా మాట్లాడటానికి మీరు చేయవలసిన ముఖ్య పని ఒక్కటే. మీ కోర్కెను వివరంగా తెలుపుతూ ఒక పోస్టుకార్డుని పోస్టు చెయ్యండి. మీ పోస్టుకార్డు అందిన వెంటనే ఈ వివేకానందా ఇన్‌స్టిట్యూట్ వారు మీకు కావలసిన వివరాలను, మీరు తీసుకోవలసిన అభ్యాసాలన్నింటినీ పూర్తిగా అందిస్తారు.

ఎక్కడికి బయలుదేరారండీ? పోస్టుకార్డు కొనటానికేనా? అయితే మీ అభ్యుదయానికైన మొదటి మెట్టు ఎక్కారు!

శభాష్!!

మీ కోర్కెను పోస్టుకార్డు ద్వారా వివరంగా తెలిపి మీ యొక్క పూర్తి చిరునామాను కూడా తెలుపుతూ వెంటనే పోస్టు చేయడం మరువకండి సుమా!

మీరు పోస్టు చేయవలసిన చిరునామా -

## VIVEKANANDHA INSTITUTE

POST BOX NO:4986, 9, MADLEY ROAD, T.NAGAR, MADRAS-17.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD/402